ఆగస్టు 2015

ఆషాఢం - శ్రావణం | శాలివాహన శకం 1937 ₹ 5



# ఆంధ్రప్రదేశ్

# అధునాతన అమరావతి

## కలల రాజధాని ఆవిష్కరణ

కన్నులు చెదిరేలా పుష్కర సంరంభం

ఏపి పరిపుష్టికి జపాన్ ఊతం

మీడియా ముసుగులో రాజకీయ క్రీడలు

తానాలో విరబూసిన తెలుగు సంస్కృతి

# గోదారి తీరంలో బాపు రమణ



తెలుగు సాంస్కృతిక కళా వైభవానికి ప్రతీకగా స్వర్గీయ బాపు – ముళ్లపూడి వెంకట రమణ పేరిట నవ్యాంధ్ర రాజధాని అమరావతిలో ఒక కళాక్షేత్రాన్ని నిర్మించనున్నట్లు ఎప్పుడో ప్రకటించిన ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు, ఆ కళామూర్తులు, చిరకాల మిత్రుల జంట ప్రతిమను గోదావరి తీరంలో ఏర్పాటు చేయాలని కూడా నిర్ణయించారు. ఆడినమాట చెల్లిస్తూ, ఆ నిర్ణయాన్ని అమలు చేస్తూ ఏర్పాటు చేసిన బాపు – రమణ విగ్రహాలను ముఖ్యమంత్రి రాజమండ్రిలో ఆవిష్కరించారు.

# ఈ సంచికలో...



12

పుష్కర గోదారి సందర్శనం మా పాలిట మహాయోగం!

పుష్కరాల సమయంలో గోదావరిలో స్నానమాచరించడం ఎలాంటి అనుభూతి? ఈ పుష్కరాల్లో రాజమండ్రి సందర్శించిన ఓ సామాన్య భక్తుడి అనుభవం ఆయన మాటల్లోనే...



8

ఏపికి జపాన్ ఆర్థిక పరిపుష్టి







22

ఇదిగో ఆంధ్రనగరి...

అనుకున్న సమయానికే అమరావతి సీడ్ క్యాపిటల్ ప్లాన్‌ను అందించిన సింగపూర్







20

'మీ భూమి' వెబ్ పోర్టల్: సమస్త సమాచారం ఇక మీ చేతుల్లోనే

ఆంధ్రప్రదేశ్

తెలుగు, ఇంగ్లీషు భాషల్లో ప్రచురితం

సంపుటి 59 సంచిక 1
శాలివాహన శకం 1937 ఆషాఢం-శ్రావణం

**పబ్లిషర్ కమిషనర్**
ఎన్ వి రమణారెడ్డి, ఐఆర్‌పిఎస్

**ప్రధాన సంపాదకుడు**
కందుల రమేష్

**సంపాదకుడు**
నున్నా నరేష్

**సహ సంపాదకులు**
నీరుకొండ ప్రసాద్
జాస్తి గోపాల ప్రసాద్
డబ్బీరు రామకృష్ణ పట్నాయక్

ముఖచిత్రం
అమరావతి రేఖాచిత్రం

రెండవ కవర్
బాపు రమణల విగ్రహావిష్కరణ

మూడవ కవర్
ముఖ్యమంత్రి కార్యక్రమాల చిత్రమాలిక

నాల్గవ కవర్
'పేదరికంపై గెలుపు' ప్రకటన

**ప్రచురణ**
సమాచార, పౌరసంబంధాల శాఖ
సమాచార భవన్, ఎ.సి.గార్డ్స్
హైదరాబాద్ - 500 028
ఫోన్: 040 - 23300258

రచయితలు వెలిబుచ్చిన అభిప్రాయాలు తప్పనిసరిగా ప్రభుత్వానికి చెందినవి కానక్కరలేదు.

**రూపకల్పన**
కార్తీక్ బీసు

**ముద్రణ**
కాక్స్‌టన్ ఆఫ్‌సెట్ ప్రైవేట్ లిమిటెడ్
హైదరాబాద్

www.andhrapradeshmagazine.org
Email: apchiefeditor@gmail.com
www.ipr.ap.nic.in





# నాయకత్వ పరీక్ష నెగ్గిన ముఖ్యమంత్రి

దురదృష్టం వెన్నాడినప్పుడు ధైర్యంగా వ్యవహరించగలిగినవాడే నాయకుడు. నవ్యాంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత వచ్చిన పుష్కరాలను కనీవినీ ఎరుగని రీతిలో జరిపేందుకు, రాష్ట్ర ప్రభుత్వం సకల సన్నాహాలూ చేసింది. అయినా, తొలిరోజే ఊహించని దుర్ఘటన జరిగింది. ప్రభుత్వ యంత్రాంగం యావత్తూ దిగ్భ్రమకు గురైంది. దగ్గరుండి అన్ని ఏర్పాట్లు పర్యవేక్షిస్తున్న ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ఈ సంఘటనకు చలించిపోయారు. అయినా, ఆయన కుంగిపోలేదు. తక్షణమే రంగంలోకి దిగి, జరిగిన నష్టాన్ని పూరించలేకపోయినా, జరగాల్సిన కార్యక్రమాన్ని నిర్విఘ్నంగా కొనసాగించేందుకు నడుంబిగించారు. నిర్వహణలో లోపాల్ని గుర్తించి, పోటెత్తిన భక్త జనానికి ఎటువంటి ఇబ్బందులు లేకుండా, గట్టి భద్రతా ఏర్పాట్లతో యాత్రికుల మన్నన పొందారు. అందుకే, మొదటిరోజు సంఘటన మీద ఎవరెన్ని కువిమర్శలు చేసినా, భక్తులు పట్టించుకోలేదు. ముఖ్యమంత్రి చిత్తశుద్ధి, విధి నిర్వహణ పట్ల ఆయనకున్న అంకితభావం వారికి తెలుసు. ఫలితంగా, ఈ ఆది నిష్ఠూరాన్ని పట్టించుకోకుండా, కోట్లాదిమంది రెట్టించిన ఉత్సాహంతో పుష్కరస్నానం చేశారు. గోదావరి హారతిని పులకింతతో వీక్షించారు. లక్షలాదిమంది తరలివచ్చినా, ఎక్కడా ఎటువంటి ఇబ్బంది లేకుండా చేసిన ఏర్పాట్లను ప్రశంసించారు. ముఖ్యమంత్రి దీక్షాదక్షతలకు ముగ్ధులయ్యారు.

ఇబ్బందులొస్తాయి. ఒక్కొక్కసారి పొరపాట్లు జరుగుతాయి. కాని, ధృఢచిత్తంతో వాటిని అధిగమించినవాడే నాయకుడు. ఈ లక్షణాలు పుష్కలంగా ఉన్నవాడే ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు. ఒకవైపు, పుష్కర సంరంభాన్ని కనులవిందుగా నిర్వహిస్తూనే, మరోపక్క పాలనావ్యవహారాలను రాజమండ్రిలోనే ఉండి చక్కదిద్దారు. అక్కడే, సింగపూర్ బృందం అందించిన అధునాతన రాజధాని అమరావతి కేంద్రపాలక ప్రాంతం రూపురేఖలను ఆవిష్కరించారు.

సమగ్ర, సమ్మిళిత నగరంగా రూపుదిద్దుకున్న అమరావతి రేఖా చిత్రాలను చూసి ఆనందించని తెలుగువారుండరు. ఒక చారిత్రిక బాధ్యతగా అమరావతి రాజధాని నగరాన్ని సాకారం చేయడానికి ముఖ్యమంత్రి చేస్తున్న ప్రయత్నాలకు తొలి అడుగు పడింది. అసాధ్యాన్ని సుసాధ్యం చేయగల నాయకుడిగా ఇప్పటికే మన్ననలు పొందిన చంద్రబాబు నాయుడు, ఈ మహాయజ్ఞాన్ని విజయవంతంగా పూర్తి చేయగలరని ఆంధ్రప్రదేశ్ ప్రజలు గుండెలనిండా నమ్ముతున్నారు.

కందుల రమేష్ (signature)

**కందుల రమేష్**
చీఫ్ ఎడిటర్



# ఎలా మర్చిపోగలం?

"సమాజంలో నువ్వు కోరుకునే మంచి మార్పు రావాలంటే ఆ మార్పు ముందు నీలో రావాలి".

–మోహన్‌దాస్ కరమ్‌చంద్ గాంధీ

స్వరాజ్యం కావాలనుకున్నవాళ్ళు – అదొక్కటే లక్ష్యంగా ఉద్యమించారు, పోరాడారు. లాఠీ దెబ్బలు తిన్నారు. – జైళ్ళకు వెళ్ళారు – పురుగులున్న అన్నం తిన్నారు.

తల్లిదండ్రులకు ఒకే సంతానంగా వున్నవాళ్ళూ ఉద్యమంలోకి దూకారు.

'ప్రాణాలు పోతే పోనీ – దేశం కోసం' అనుకుని రాత్రింబవళ్ళూ స్వరాజ్యం కోసమే చెమట చిందించారు.

'రక్తం కారి ఏరులైనా' స్వరాజ్యం వస్తే చాలనుకున్నారు.

భగత్ సింగ్, చంద్రశేఖర్ ఆజాద్, రాజ్‌గురు వంటి వాళ్ళు దేశానికి స్వాతంత్ర్యం తీసుకురాలేని జీవితమే వ్యర్థమనుకుని ఉరికంబం ఎక్కడానిక్కూడా వెనుకాడ లేదు.

1947 తరువాత పుట్టిన ఏ ఒక్కరూ ఆ మహోద్యమాన్ని చూడలేదు – సినిమాల్లో తప్ప. ఆస్తులు కరిగిపోయినా, బంధువులు భయపడి దూరంగా పారిపోయినా – స్వాతంత్ర్య సమర యోధుణ్ణి అని చెప్పుకోవడంలో ఒక ఆత్మగౌరవాన్ని ఆ యోధులు అనుభవించారు.

దేశాన్ని దాస్య శృంఖలాల నుంచి విడిపించడం కోసం దాదాపు నాలుగు దశాబ్దాల పాటు ఉధృతంగా సాగిన ఆ ఉద్యమంలో పాల్గొన్నవాళ్ళు రోజుకి ఎన్ని గంటలు పని చేద్దాం, వారానికి ఎన్నిసెలవులు తీసుకుందాం, ఏడాదికి ఎన్ని సార్లు విహారయాత్రలు చేద్దాం –అని ఆలోచించి వుంటే, ఇప్పటికీ మనం బానిస జీవితాన్నే అనుభవిస్తూ వుండేవాళ్ళమేమో!

లక్ష్య సాధన కోసం పనిగంటలు, శెలవురోజులు లెక్క పెట్టకుండా పనిచేసిన సంస్కృతి ఆ స్వాతంత్ర్య సమర యోధులది. రోజులు, నెలల తరబడి అజ్ఞాతంలో వుండి పోరాటాలు చేసిన ఉయ్యాలవాడ నరసింహారెడ్డి, అల్లూరి సీతారామరాజు వంటి యోధులు క్యాలెండర్‌లో తేదీలు, వారాలు కూడా తెలియనంతగా దేశం కోసం ఉద్యమంలో మునిగిపోయారు.

అంతటి దేశభక్తి పరవళ్ళు తొక్కితే మనకి స్వరాజ్యం వచ్చింది. ఆ మహోన్నత ఉద్యమాన్ని మనం చూడలేదు గనుక ఇప్పుడు మనం అనుభవిస్తున్న స్వాతంత్ర్యం విలువ మనకు తెలియకపోవచ్చు.

స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న ప్రతి దేశభక్తుడూ ఈ జాతి శ్రేయస్సు కోసం స్వరాజ్యాన్ని సాధించే దిశలో తన కుటుంబం ఏమైపోయినా ఫరవాలేదనుకున్నాడు. కాని ఇప్పుడు –నేను, నా కుటుంబం బాగుండటంకన్నా సమాజం, రాష్ట్రం, దేశం ముఖ్యమా నాకు –అని ఆలోచించే స్థితిలో వున్నాం.

పనిగంటలు, పనిరోజుల గురించి ఉద్యమాలు చేసే 'పరిస్థితి' సాధించుకున్నాం. 'హక్కుల కోసం పోరాడే హక్కు నాకుంది' అని ఎలుగెత్తి అరుస్తున్నాం.

స్వాతంత్ర్యయోధులు – "స్వరాజ్యం వస్తే, దాన్ని మనం సురాజ్యం చేసుకోగలం" అనుకున్నారు. ఈ 'సురాజ్యం' అంటే కేవలం ఆగష్టు 15న జెండా వందనాలు చేయటమేనా?

అసలు – ఇప్పుడున్న స్థితి నుంచి మన రాష్ట్రాన్ని, మన దేశాన్ని అన్ని రంగాలలో మెరుగైన సమున్నత స్థితికి తీసుకువెళ్ళేలా ప్రతి ఒక్కరం పని చేయటంకన్నా భిన్నమైన సురాజ్యం వుంటుందా?

దేశంలో అగ్రగామిగా ఎదిగిన ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ఒక్కసారిగా రెండు రాష్ట్రాలుగా చీలిపోయి, ఇప్పుడు 13 జిల్లాల ఆంధ్రప్రదేశ్‌ని పున్నర్నిర్మించుకోవాల్సిన స్థితికి వచ్చాము. ఒక మహత్తర రాష్ట్రంగా ఈ ఆంధ్రప్రదేశ్‌ని పునర్నిర్మించుకోవాలంటే కేవలం ముఖ్యమంత్రి, ప్రధాన కార్యదర్శి, కొందరు మంత్రులు, అధికారులు పనిచేస్తే సరిపోదు. సురాష్ట్ర సాధన లక్ష్యంతో ప్రతి ఒక్కరం నవ్యాంధ్ర పునర్నిర్మాణ ఉద్యమంలో స్వాతంత్ర్య సమర యోధుల స్ఫూర్తితో, అంకితభావంతో పనిచేస్తేనే స్వరాజ్యం కోసం పోరాడిన దేశభక్తులకు నిజమైన వారసులం అనిపించుకుంటాం, ఆ ఉద్యమానికి, ఆ యోధుల త్యాగానికీ అర్థం, పరమార్థం కల్పించిన వాళ్ళమవుతాం.

ఎన్. వి రమణారెడ్డి

**ఎన్ వి రమణారెడ్డి**

సమాచార కమిషనర్




## 'అమరావతి భూమిపూజ' బాగుంది

'అమరావతి భూమిపూజ' మీద ప్రధాన వ్యాసం గొప్ప స్ఫూర్తినిచ్చింది. ఆలోచనలు మొలకప్రాయంలో ఉండే నవతరం మీద ఇటువంటి వ్యాసాలు గొప్ప ప్రభావాన్ని చూపిస్తాయి. అమరావతి ఒక కొత్త తరానికి సరికొత్త వారసత్వంగా నిలుస్తుంది. జాస్తి గోపాలప్రసాద్ గారికి అభినందనలు.

– గాలి మల్లేశ్వర్రావ్, అద్దంకి.

## 'గోదావరి' తెలుగుపాటల కథనం అద్భుతం

తెలుగువారి జీవనాడి గోదావరి నదిపై చిత్రీకరించిన తెలుగు చలన చిత్రాల పాటలకు సంబంధించి, 'గల గల పారుతున్న గోదారిలా..' శీర్షికతో సమగ్రంగా ఇచ్చిన కథనం అద్భుతంగా ఉంది. గోదావరిపై చిత్రీకరించిన పాటలు మీ పత్రిక ద్వారా మరోసారి సింహావలోకనం చేసుకునేలా పాఠకులకు అవకాశం కల్పించిన మ్యూజికాలిస్ట్ రాజా గారికి ధన్యవాదాలు.

– మాగంటి సతీష్, గుంటూరు

## పుష్కర సంచిక అమూల్యం

ఆంధ్రప్రదేశ్ జులై సంచికలో గోదావరి పుష్కరాల గురించి మాకు తెలియని ఎన్నో విశేషాలు మరెన్నో వివరణలు ప్రచురించిన మీకు మా ధన్యవాదాలు. ఆంధ్రప్రదేశ్ పత్రిక ఇటీవల చాలా బాగుంటోంది. గోదావరి నదీ స్నానం ఎంత ముఖ్యమో, ఈ పత్రిక కొని భద్రపరచుకొనుట కూడా అంతే ముఖ్యం. చంద్రయోగం తెలుగు ప్రజలందరికీ శుభయోగం.

– గీతా దుర్గ, ఈ మెయిల్

## అంశాలన్నీ చక్కగా ఉన్నాయి

జూలైలో ఆంధప్రదేశ్ మాసపత్రికలోని ప్రచురించిన అంశాలన్నీ నాకు బాగా నచ్చాయి. ప్రధానంగా గోదావరి నది, మహా పుష్కరాల చరిత్ర, ప్రాశస్త్యం, నిర్వహణా ఏర్పాట్లపై సమగ్రంగా ఇచ్చిన కథనాలతో పాటు ఫోటోలన్నీ నన్ను ఎంతో ఆకట్టుకున్నాయి. సమాజ వికాసానికి చెందిన మరిన్ని ఆసక్తికరమైన అంశాలను రానున్న పత్రికల్లో ఇవ్వగలిగితే మంచిది.

– నవీనవతి, అనకాపల్లి, విశాఖపట్నం జిల్లా.

## 'గోపుర శోభల పావన గోదారి' శీర్షిక నచ్చింది

జూలై మాస పత్రికలో గోదావరి మహాపుష్కరాలు సందర్భంగా మీరు ఉభయ గోదావరి జిల్లాల పరిధిలో గోదావరి నదీపరివాహక ప్రాంతాలలో కొలువు దీరిన దేవాలయాల చరిత్ర గురించి ఇచ్చారు. ఆలయాల చరిత్రపై సమగ్రంగా ఇచ్చిన కథనం బాగుంది. ఈ కథనానికి సంబంధించి మీరు పెట్టిన ' గోపుర శోభల పావన గోదారి' శీర్షిక నన్ను ఎంతగానో ఆకర్షించింది.

– పి సదానంద మూర్తి, రాజమండ్రి, తూ.గో.జిల్లా

## 'గోదావరణీయం' రమణీయం!

'గోదావరణీయం' శీర్షికతో ప్రచురించిన కథనం నన్ను కదిలించింది. సవ్వడి కోల్పోతున్న గలగల గోదావరి ఉపశీర్షికతో ఇచ్చిన సమాచారం ఆలోచింపజేసింది. రచయిత జి సత్యశ్రీనివాస్‌కు అభినందనలు.

– ఎవిఎన్ ఆచార్యులు, ద్వారకాతిరుమల, ప.గో.జిల్లా

## రచయితలకు గమనిక

'ఆంధ్రప్రదేశ్' పత్రికపై అభిమానంతో రచనలను పంపుతున్న రచయితలు రచనతోపాటు తమ బ్యాంకు అకౌంట్ పాస్ బుక్ మొదటి పేజీ ఫోటో కాపీ గానీ, బ్లాంక్ చెక్కు కొట్టేసి పంపితేనే, ప్రచురితమైన రచనలు పారితోషికం ఆయా అకౌంట్ లో జమ చేయడం జరుగుతుందని అకౌంట్స్ అధికారి తెలియజేస్తున్నారు. రచయితలూ, రచయిత్రులు దీని ప్రాధాన్యత గ్రహించి, మాతో సహకరించవలసిందిగా కోరుకుంటున్నాం.

– సంపాదకులు

## 'ఆంధ్రప్రదేశ్' పత్రికకు చందా ఇలా కట్టాలి

'ఆంధ్రప్రదేశ్' మాసపత్రికకు చందాదారులుగా చేరాలనుకుంటున్న వారు వార్షిక చందా నిమిత్తం 50 రూపాయల మనియార్డరును 'అకౌంట్స్ ఆఫీసర్, సమాచార, పౌర సంబంధాల శాఖ, హైదరాబాద్' పేరిట పంపాలి. తమ పూర్తి చిరునామాను, తాము 'ఆంధ్రప్రదేశ్ ' పత్రికను ఏ భాషలో కోరుకుంటున్నారో కూడా ఆ మనియార్డరులో రాయాలి. ఆ మనియార్డర్‌ను ఈ క్రింది చిరునామాకు పంపాలి.

అకౌంట్స్ ఆఫీసర్, సమాచార, పౌర సంబంధాల శాఖ, సమాచార భవన్, ఏ.సి.గార్డ్స్, మాసాబ్ ట్యాంక్, హైదరాబాద్ – 500 028.

చందాదారులు తమ చిరునామా మార్పు, కాపీలు అందకపోవడం గురించి ఈ ఫోన్ నెంబరుకు కాల్ చేసి వివరాలు కనుక్కోవచ్చు 040 23399048 ఎక్స్‌టెన్షన్ 123

## రాష్ట్ర స్థాయి పెన్నా సాహిత్య పురస్కారం

రాష్ట్ర స్థాయి ప్రతిష్ఠాత్మక 'పెన్నా సాహిత్య పురస్కారం– 2015' కోసం 2014 జూన్ 1 నుంచి 2015 జూన్ 30 లోపు ప్రచురించబడిన కవితా సంపుటాలు 4 ప్రతులను ఆహ్వానిస్తున్నాము. ఎంపికైన కవితా సంపుటి రచయితకు రూ.3000లు నగదు, జ్ఞాపిక, ప్రశంసాపత్రం త్వరలో జరుగనున్న సంఘం 6వ వార్షికోత్సవంలో రచయితలకు ప్రదానం చేయనున్నాం. మీ కవితా సంపుటాలు మాకు చేరాల్సిన ఆఖరు తేదీ 31.08.2015.

మీ కవితా సంపుటాలు మాకు పంపవలసిన చిరునామా:

గుండాల నరేంద్రబాబు, వ్యవస్థాపక కార్యదర్శి, పెన్నా రచయితల సంఘం, డో.నెం.25–1–890, నేతాజీనగర్, 3వ, వీధి, ఏ.కె.నగర్ పోస్టు, నెల్లూరు–524 004.
మొబైల్ : 9493235992

# చంద్రన్న రంజాన్ తోఫా



రంజాన్ పండుగ సందర్భంగా ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు ముస్లిం సోదరులకు చంద్రన్న రంజాన్ తోఫా అందించారు. ప్రతి కార్డుదారునికి 5 కిలోల గోధుమ పిండి, 2 కిలోల చక్కెర, కిలో సేమియా, 100 గ్రాముల నెయ్యి అందించారు. తెల్లరేషన్ కార్డు కలిగిన దాదాపు 11 లక్షల ముస్లిం కుటుంబాలకు వీటిని అందించడానికి ప్రభుత్వం ఏర్పాట్లు చేసింది. బహిరంగ మార్కెట్‌లో రూ. 400 విలువ కలిగిన వస్తువులను, టెండరు ప్రక్రియ ద్వారా రూ. 300 లకే ప్రభుత్వం కొనుగోలు చేసి కానుక అందించింది. ఇందుకోసం, 35 కోట్లు ఖర్చును ముస్లిం సోదరుల సంక్షేమం కోసం భరించింది.

ముస్లిముల అభివృద్ధికి పెద్ద పీట వేసి వారి ఉపాధి కల్పనకు రాయితీలతో రుణాలు, రోహిణి, దుకాన్-మకాన్ వంటి పథకాలను పెద్ద ఎత్తున ప్రభుత్వం అమలు చేస్తోంది. నిరుపేద ముస్లిం యువతుల పెళ్లిళ్ల కోసం దుల్హన్ పథకం, తత్కాల్ పథకం, వక్ఫ్ ఆస్తుల పరిరక్షణ, విద్యావికాసం, చంద్రన్న రంజాన్ తోఫాలాంటి ఎన్నో పథకాలు ప్రభుత్వం ముస్లిం వర్గాల అభ్యున్నతి కొరకు ప్రతిష్ఠాత్మకంగా అమలు చేస్తోంది.

"పేద ముస్లిం కుటుంబాలను దృష్టిలో వుంచుకొని రంజాన్ పండుగకు రూ. 400 విలువ చేసే నాలుగు అత్యవసర నిత్యావసర వస్తువులు ఉచితంగా ఇవ్వడం మా కుటుంబాల్లో పండుగను తెచ్చినట్లయింది. ఈ పండుగ మాకు తీపి గుర్తుగా ఉండిపోతుంది. ముఖ్యమంత్రికి మా మనస్ఫూర్తిగా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం."

**- గౌసుబీ, కర్నూలు**

# ఏపికి జపాన్ ఆర్థిక పరిపుష్టి

## ముఖ్యమంత్రి చంద్రబాబు జపాన్ పర్యటన విజయవంతం



జపాన్ ప్రధాని షింజె అబెతో ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు

ప్రపంచవ్యాప్తంగా పెట్టుబడులను పెట్టి ఆయా దేశాల ఆర్థికస్థితిగతుల పురోగతికి ఇతోధిక సహకారం అందిస్తున్న సూర్యోదయ దేశం జపాన్‌కు... విస్తారమైన తీరప్రాంతం, మానవ వనరులు, అపార ఖనిజ, అటవీ తదితర సంపద నెలకొన్న సన్‌రైజ్ స్టేట్ ఆంధ్రప్రదేశ్‌కు మధ్య ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు జపాన్ పర్యటనతో గాఢమైన ఆర్థిక బంధానికి పునాదులు పడనున్నాయి. గతంలో ముఖ్యమంత్రిగా చంద్రబాబు నాయుడు సాగించిన పాలనతో నెలకొన్న విశ్వసనీయత, సహకారం అందిస్తే అభివృద్ధికి బాటలు పరచడం, పెట్టుబడులకు తగిన ఫలితం వస్తుందన్న నమ్మకంతో జపాన్ కంపెనీలు నవ్యాంధ్రలో పరిశ్రమల స్థాపనకు ముందుకు వస్తున్నాయి. జపాన్ ప్రభుత్వం భారత్‌లో పెట్టుబడులు పెట్టే 37 బిలియన్ డాలర్లలో అత్యధికభాగం ఆంధ్రప్రదేశ్‌లో వెచ్చించనుండటమే చంద్రబాబు నాయకత్వం మీద వారికి ఉన్న నమ్మకానికి ఉదాహరణ.

ముఖ్యమంత్రి బృందం జూలై 5 నుంచి 8 వరకు నాలుగు రోజుల పాటు జపాన్ పర్యటించింది. నాలుగు రోజుల పర్యటనలో ఏపీ ప్రభుత్వ బృందం వివిధ జపాన్ కంపెనీల ప్రతినిధులతోనూ, సీనియర్ మంత్రులతోనూ భేటీ అయ్యింది. ఆంధ్రప్రదేశ్‌లో విరివిగా లభ్యమవుతున్న సహజ వనరులు, విలువైన మానవ వనరుల గురించి జపాన్ కంపెనీలు, ప్రభుత్వాధినేతలకు చంద్రబాబు నాయకత్వంలోని బృందం ఈ పర్యటనలో వివరించింది. ఈ సందర్భంగా పలు జపాన్ సంస్థలు ఏపీలో పెట్టుబడులు పెట్టేందుకు ముందుకు వచ్చాయి. రాజధాని నిర్మాణంలో, మౌలిక వసతుల కల్పనలో సహకరించేందుకు సుముఖత వ్యక్తం చేశాయి.

### స్మార్టు గ్రిడ్ నిర్మాణంపై ఫ్యూజి సంస్థ ఆసక్తి

తొలిరోజే ఫ్యూజి కంపెనీ ప్రతినిధులతో నిర్వహించిన సమావేశంలో విజయవాడలో పైలెట్ ప్రాజెక్టుగా చేపట్టిన తర్వాత గత ఏడాది నవంబర్ పర్యటన నుంచి నేటి దాకా స్మార్ట్ గ్రిడ్ నిర్మాణ పురోగతిపై సమీక్షించారు. ఫ్యూజి సంస్థ ద్వారానే స్మార్టు గ్రిడ్ నిర్మాణం పూర్తి చేయటం, లేదా రాష్ట్ర ప్రభుత్వ భాగస్వామ్యంతో నిర్మాణం చేపట్టడంపై

'ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికి అన్ని విధాలా సాయపడతాం. సాంకేతికంగా, ఆర్థికంగా సహకారం అందిస్తాం. ఏపీ రాజధాని నిర్మాణంలో, మౌలిక వసతుల కల్పనలో జపాన్ తప్పక సహకరిస్తుంది. పెట్టుబడులను ఆకర్శించడంలో ఏపీ ప్రభుత్వం చేస్తున్న కృషి అభినందనీయం.

– జపాన్ ప్రధాని షింజో అబే

నిర్ణయం తీసుకోవాలని సీఎం ఆ సంస్థకు సూచించారు. ఉమ్మడి భాగస్వామ్యంతో నిర్మాణం ప్రారంభిస్తే ఇతర రాష్ట్రాలకు కూడా ఆ సంస్థ కన్సల్టెంట్‌గా పనిచేయవచ్చని, ప్యూజి ప్రాజెక్టు దేశానికే ఒక నమూనాగా వుండాలని ముఖ్యమంత్రి ఆకాంక్షించారు. ఇప్పటికే క్షేత్రస్థాయి పరిశీలన కోసం 3 పర్యాయాలు విజయవాడను సందర్శించిన ఆ సంస్థ ప్రతినిధులు ఆగస్టులో మరో పర్యాయం ఆంధ్రప్రదేశ్‌లో పర్యటించనున్నారు.

## విశాఖలో జపాన్ ఇన్ఫర్మేషన్ అండ్ స్టడీస్ సెంటర్

మిత్సుబిషి కంపెనీ ప్రతినిధులతో ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు భేటీ అయిన ఫలితంగా కార్పోరేట్ సోషల్ రెస్పాన్సిబిలిటీ (సిఎస్ఆర్) కింద విశాఖలో జపాన్ ఇన్ఫర్మేషన్ అండ్ స్టడీస్ సెంటర్ నెలకొల్పటానికి మిత్సుబిషి ముందుకొచ్చింది. పెట్టుబడులు పెట్టి పారిశ్రామికంగా ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికి దోహదపడుతూనే సిఎస్ఆర్ కార్యక్రమాలకు చేయూత అందిస్తామన్న హామీ మిత్సుబిషి నుంచి లభించింది.

స్వామినాథన్ ఫౌండేషన్‌తో కలిపి మిత్సుబిషి కంపెనీ కృష్ణా జిల్లాలో ఐదేళ్లపాటు గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలు చేపట్టనుంది. ఆగస్టు 13న స్వామినాథన్ 90వ పుట్టినరోజు వేడుకలను రాష్ట్రప్రభుత్వంతో కలసి నిర్వహించనున్నామన్న మిత్సుబిషి కంపెనీ పేర్కొనగా ముఖ్యమంత్రి చంద్రబాబు స్పందిస్తూ అమరావతిలో ఈ కార్యక్రమం చేపడదామని ప్రతిపాదించారు. స్మార్టు విలేజి, స్మార్టు వార్డు కార్యక్రమానికి మిత్సుబిషి కంపెనీ సహకరించాలని కోరారు. తూర్పుగోదావరి జిల్లా తునిలో నిర్మాణంలో వున్న తమ ఫ్యాక్టరీకి అప్రోచ్ రోడ్డు నిర్మించాలని కంపెనీ ప్రతినిధులు కోరగా 100 రోజుల్లో రహదారి నిర్మిస్తామని ముఖ్యమంత్రి హామీనిచ్చారు. చెన్నై– బెంగళూరు ఇండస్ట్రియల్ కారిడార్,కృష్ణపట్నం ఇండస్ట్రియల్ నోడ్ పై మిత్సుబిషి ప్రతినిధులు ఆసక్తి చూపించారు. కృష్ణపట్నంలో క్లష్టర్ ఏర్పాటుకు మిత్సుబిషి కంపెనీ సానుకూలత వ్యక్తంచేసింది. తమ యూనిట్లన్నీ అక్కడే ఏర్పాటు చేసేందుకు సంసిద్ధత తెలపగా అన్ని రకాల మౌలిక వసతులు కల్పిస్తామని ముఖ్యమంత్రి హామీనిచ్చారు. ఫుడ్ ప్రాసెసింగ్ రంగంపై దృష్టి పెట్టాలని మిత్సుబిషిని చంద్రబాబు కోరారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఐరన్, బాక్సైట్ వంటి అపారమైన ఖనిజ సంపద వుందని మిత్సుబిషి ప్రతినిధులకు చందబాబు వివరించారు.

## శ్రీకాకుళం జిల్లాలో విద్యుత్ కేంద్రం ఏర్పాటు

శ్రీకాకుళం జిల్లా పోలాకి దగ్గర 1000 మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి కేంద్రం ఏర్పాటుపై ప్రాథమిక అధ్యయనం పూర్తయ్యిందని సుమిటోమో కార్పోరేషన్ ప్రతినిధులు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడుకు తెలిపారు. సుమిటోమో కార్పోరేషన్ మేనేజింగ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ మసయుకి హ్యోడో, ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ సుటోము అకిమోటొ, కార్పొరేట్ ఆఫీసర్ హిడెకి యమనొ తదితర ప్రతినిధులతో ఆయన పలు అంశాలపై చర్చలు జరిపారు.

గత ఏడాది నవంబర్‌లో సుమిటోమో కార్పోరేషన్ పోలాకి దగ్గర విద్యుత్ ప్లాంటుపై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంతో ప్రాథమిక అవగాహన ఒప్పందం చేసుకున్న విషయం విదితమే. ఈ ఒప్పందానికి కార్యరూపమిచ్చేందుకు చంద్రబాబు సుమిటోమో కార్పోరేషన్‌తో భేటీ అయ్యారు. విద్యుత్ కేంద్రం ఏర్పాటుకు పోలాకి సమీపంలో స్థలాన్ని గుర్తించామని కంపెనీ ప్రతినిధులు తెలిపారు. ప్రాజెక్టుపై ప్రాథమిక అధ్యయనం పూర్తయ్యిందని వివరించారు. రాష్ట్రంలోని వ్యవసాయోత్పత్తుల దిగుబడి పెంచేందుకు తోడ్పాటు అందిస్తామని సుమిటోమో ప్రతినిధులు హామీ ఇచ్చారు. రాజధాని అమరావతిలో సీవరేజ్ ట్రీట్‌మెంట్ ప్లాంటు నిర్మాణానికి అంగీకారం తెలిపారు. ఈనెలలోనే ప్రయోగాత్మకంగా పనులు చేపడతామన్నారు. త్రాగునీరు, సీవరేజ్, ట్రాఫిక్ నియంత్రణ విభాగాల్లో సహకారం అందజేస్తామని వివరించారు.

## జైకా ప్రతినిధులతో భేటీ

ముఖ్యమంత్రి చంద్రబాబు జపాన్ ఇంటర్నేషనల్ కోఆపరేషన్ ఏజెన్సీ (జైకా) ప్రతినిధులతో భేటీ అయ్యారు. రాజధాని నిర్మాణం, మెట్రో రైలు ప్రాజెక్టు, పవర్ ప్రాజెక్టులపై సమావేశంలో చర్చ జరిగింది. క్యాపిటల్ కన్సల్టెన్సీ బిడ్ సహా పవర్ ప్రాజెక్టు ఫైనాన్సింగ్‌లో కూడా జైకా భాగస్వామ్యానికి ముందుకు వచ్చింది. నీటిపారుదల వ్యవస్థపై సమీక్షించి అక్టోబర్ నాటికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి నివేదిక అందిస్తామని జైకా ప్రతినిధులు తెలిపారు. ఫుడ్ ప్రాసెసింగ్, డిస్ట్రిబ్యూషన్ రంగాలపై జైకా ఆసక్తి చూపింది. రాబోయే 15 ఏళ్లకు కార్యాచరణ ప్రణాళిక సిద్ధం చేయాలని ముఖ్యమంత్రి చంద్రబాబు జైకాను కోరారు.

## ఏపీలో గుడ్ గవర్నెన్స్ వల్లనే జపాన్ పెట్టుబడులు

ఆంధ్రప్రదేశ్ లో సుపరిపాలన, పారదర్శకత వున్నందునే జపాన్ కంపెనీలు పెట్టుబడులు పెట్టేందుకు ముందుకు వస్తున్నాయని జైకా సీనియర్ వైస్ ప్రెసిడెంట్ డొమిచి అన్నారు. భారత్‌లో దృఢమైన నాయకత్వం వున్నందువల్ల జపాన్ కంపెనీలు ఆసక్తిగా వున్నాయని వివరించారు.

## ఏపీ అభివృద్ధిలో భాగస్వాములుగా బ్యాంకింగ్ సంస్థలు

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు జపాన్ పర్యటనలో రెండోరోజు వివిధ ఆర్థిక సంస్థల ప్రతినిధులతో భేటీ అయ్యారు. తొలుత మిజుహో బ్యాంక్ ప్రతినిధులతో ముఖ్యమంత్రి బృందం భేటీ అయ్యింది. మిజుహు బ్యాంకు జపాన్‌లో నూరేళ్ల చరిత్రవున్న అతి ప్రాచీనమైన, రెండో పెద్దబ్యాంకు అని ఈ సందర్భంగా సీఎం చంద్రబాబు గుర్తు చేశారు. ఆంధ్రప్రదేశ్ నూతన రాజధాని అమరావతిలో బ్యాంకు శాఖను ఏర్పాటు చేయాలని మిజుహో ప్రతినిధి బృందాన్ని ముఖ్యమంత్రి కోరారు. ఈ శాఖను భారత దేశానికి కేంద్ర కార్యాలయంగా తీర్చిదిద్దాలని సూచించారు. మిజుహో బ్యాంకుతో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అవగాహన ఒప్పందం కుదుర్చుకుంది.

## సాఫ్ట్ బ్యాంకు చైర్మన్‌తో భేటి

ముఖ్యమంత్రి చంద్రబాబు బృందం సాఫ్ట్ బ్యాంకు చైర్మన్ మసయోషి సోన్‌తో సమావేశమైంది. 'మేకిన్ ఇండియా' లో భాగంగా ఏపీలో సాఫ్ట్ బ్యాంక్ సోలార్ ప్యానళ్ల తయారీని



జైకా సీనియర్ వైస్ ప్రెసిడెంట్ హిడికి డిమిచితో సమావేశమైన ఆంధ్రప్రదేశ్ ప్రతినిధి బృందం. జపాన్ లో భారత రాయబారి దీపా గోపాలన్ వాధ్వా కూడా చిత్రంలో ఉన్నారు.

చేపట్టబోతోందని చైర్మన్ మసయోషి సోన్ తెలిపారు. త్వరలో 20 గిగావాట్ల సోలార్ పవర్ ప్లాంట్‌ను నెలకొల్పనున్నట్లు వివరించారు. సోలార్ పవర్‌పై స్పెషలైజేషన్ చేసే ఇంజనీరింగ్ విద్యార్థులకు స్కాలర్‌షిప్పులు అందించటానికి సాఫ్ట్ బ్యాంక్ సిద్ధంగా వుందన్నారు. ఏపీలో నెలకొల్పనున్న సంప్రదాయేతర ఇంధన వనరుల విశ్వవిద్యాలయం ఏర్పాటుకు ఆర్థిక సహాయం అందిస్తామని సాఫ్ట్ బ్యాంక్ చైర్మన్ ప్రకటించారు.

### జపాన్ మంత్రి యోచి మియజవాతో భేటీ

జపాన్ ఆర్థిక, వాణిజ్య, పరిశ్రమల మంత్రి యోచి మియజవాతో మెటి (ఎంయిఐటి) కార్యాలయంలో ముఖ్యమంత్రి నేతృత్వంలోని ఏపీ ప్రతినిధి బృందం భేటీ అయ్యింది. జపాన్‌లో పలు కంపెనీలతో చర్చలను ఫలప్రదం చేసుకుంటున్న ఏపీ ప్రభుత్వ బృందాన్ని యోచి మియజవా అభినందిస్తూ, చంద్రబాబు నాయకత్వాన్ని ప్రశంసించారు. ఏపీ రాజధాని అభివృద్ధి, నిర్వహణ సంస్థతో ఈక్విటీ భాగస్వామ్యం కోరుకుంటున్నట్లు తెలిపారు. రాజధాని నిర్మాణంలో భాగస్వాములు కావటానికి జపాన్ కంపెనీలు ఆసక్తిగా వున్నాయని జపాన్ మంత్రి తెలియజేశారు. మెట్రో ప్రాజెక్టుపై భారత్ ప్రభుత్వం నుంచి ప్రతిపాదన వస్తే పూర్తిస్థాయిలో పెట్టుబడులు పెట్టడానికి ప్రయత్నిస్తామన్నారు. ఇందులో భాగస్వామి కావాల్సిందిగా 'నెడో'ను కోరామని, దీనిపై 'నెడొ' అధ్యయనం చేస్తుందని, సుమిటోమోకు సహకరిస్తుందని మియజవా వివరించారు. నాకంటే వయసులో మీరు ఒక్కరోజే చిన్నవారని, మూడు సమావేశాల తర్వాత బాగా దగ్గరయినట్లుగా కన్పిస్తున్నారని చంద్రబాబుతో మియాజవా ఆత్మీయంగా పేర్కొన్నారు.

### భారత్‌లో రెండో ఉత్తమ రాష్ట్రం ఏపీ

ఆంధ్రప్రదేశ్ భారత్‌లో రెండో ఉత్తమ రాష్ట్రమని తమ నివేదికలు వెల్లడిస్తున్నాయని జపాన్ మంత్రి మియజవా చెప్పారు. సమగ్ర అభివృద్ధికి కావలసిన సహజ వనరులతో పాటు మానవ వనరులు పుష్కలంగా వున్నాయన్నారు. జపాన్ సంస్థలన్నీ ఏపీ అభివృద్ధికి మంచి తోడ్పాటు అందిస్తాయని చెప్పారు. త్వరలో అధికారుల స్థాయి సమావేశం ఏర్పాటు చేస్తామని ప్రకటించారు. 'మెటి'లో ఏపీ డెస్కు ఏర్పాటుకు చర్యలు తీసుకుంటామన్నారు. రాజధాని సంస్థలో ఈక్విటీ తీసుకునేందుకు సంసిద్ధత తెలపడాన్ని ఏపీ బృందం కీలక పరిణామంగా భావిస్తోంది.

### బ్యాంక్ ఆఫ్ టోక్యో బృందంతో భేటీ

ఏపీ సీఎం ప్రతినిధి బృందం బ్యాంక్ ఆఫ్ టోక్యో, మిత్సుబిషి ప్రతినిధులతో భేటీ అయ్యింది. నవ్యాంధ్రప్రదేశ్ రాజధాని అమరావతిలో బ్యాంకు శాఖ ఏర్పాటు చేయాలని ముఖ్యమంత్రి చంద్రబాబు బ్యాంక్ ఆఫ్ టోక్యో బృందాన్ని కోరారు. ప్రత్యేకించి విదేశీ మారక ద్రవ్య విభాగాన్ని ఏర్పాటు చేయాలని విజ్ఞప్తి చేశారు. బ్యాంకు ప్రతినిధులు సానుకూలంగా స్పందించారు. ఆంధ్రప్రదేశ్‌కు సహకారం అందించటానికి విదేశాల్లో వున్న జపాన్ ఖాతాదారులను ప్రోత్సహిస్తామని బ్యాంక్ ఆఫ్ టోక్యో, మిత్సుబిషి వైస్ ప్రెసిడెంట్ టకాషి మోరిముర చెప్పారు.

### జపాన్ మంత్రితో భేటీ

జపాన్ మినిస్ట్రీ ఆఫ్ ల్యాండ్, ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ అండ్ టూరిజం (ఎంఎల్‌టిఐ) మంత్రి అఖిహిరో ఓహతాతో ముఖ్యమంత్రి చంద్రబాబు భేటీ అయ్యారు. ఇండియా వెళితే చంద్రబాబును కలుసుకోవాలని, ఆంధ్రప్రదేశ్ పై ప్రత్యేక దృష్టి పెట్టాలని సహచర మంత్రి ఒకరు తనను కోరినట్లు ఆయన తెలిపారు. రాజధాని నిర్మాణం ఒక దేశంలో లేదా ఒక రాష్ట్రంలో ఎంతో ప్రాముఖ్యమైన అంశమని, తప్పక సహకారం అందజేస్తామని చెప్పారు.

### రాజధాని నిర్మాణంలో సాంకేతిక, ఆర్థిక సహకారం: జపాన్ ప్రధాని

ఆంధ్రప్రదేశ్ అభివృద్ధికి అన్ని విధాలా సాయపడతామని జపాన్ ప్రధాని షింజో అబే తెలిపారు. జపాన్‌లో పర్యటించిన ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు షింజో అబేతో భేటీ అయ్యారు. సాంకేతికంగా, ఆర్థికంగా సహకారం అందిస్తామని ఈ సందర్భంగా జపాన్ ప్రధాని చంద్రబాబుకు హామీ ఇచ్చారు. ఏపీ రాజధాని నిర్మాణంలో, మౌలిక వసతుల కల్పనలో జపాన్ తప్పక సహకరిస్తుందన్నారు. పెట్టుబడులను ఆకర్షించడంలో ఏపీ ప్రభుత్వం చేస్తున్న కృషిని షింజో అబే అభినందించారు.

అమరావతి నగర శంకుస్థాపన కార్యక్రమానికి ముఖ్యమంత్రి జపాన్ ప్రధానిని ఆహ్వానించారు. వీలు చూసుకుని ఆంధ్రప్రదేశ్‌ను తప్పక దర్శిస్తానని హామీ ఇచ్చారు. ఏపీ, జపాన్

> ఆంధ్రప్రదేశ్‌లో సుపరిపాలన, పారదర్శకత వున్నందునే జపాన్ కంపెనీలు పెట్టుబడులు పెట్టేందుకు ముందుకు వస్తున్నాయి. భారత్‌లో దృఢమైన నాయకత్వం వున్నందు వల్ల జపాన్ కంపెనీలు ఆసక్తిగా వున్నాయి.
>
> – జైకా సీనియర్ వైస్ ప్రెసిడెంట్ డొమిచి

సౌహార్ద్ర సంబంధాలకు సంస్థాగతమైన ఏర్పాట్లు చేయాలని పీయం షింజో అబేను చంద్రబాబు కోరగా, ఆయన పరిశీలిస్తానని చెప్పారు.

### జపాన్ ప్రధానికి తిరుపతి లడ్డూ ప్రసాదాలు

ముఖ్యమంత్రి చంద్రబాబు జపాన్ ప్రధాని షింజో అబేకు తిరుమల శ్రీవారి శేష వస్త్రాన్ని కప్పి, స్వామి వారి లడ్డూ ప్రసాదాలను బహూకరించారు. జ్ఞాపికను అందజేశారు. గత ఎన్నికలకు ముందు చంద్రబాబు నుంచి శ్రీవారి లడ్డూ అందుకుని ప్రచారానికి తాను బయలుదేరానని, అనంతరం విజయం సాధించిన విషయం షింజో అబే గుర్తు చేసుకున్నారు.

### టోక్యో నగర సందర్శన

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు మూడో రోజు పర్యటనలో జపాన్ రాజధాని టోక్యో నగరాన్ని సందర్శించారు.

### జేజీసీ కార్పొరేషన్ ప్రతినిధులతో భేటీ

జేజీసీ కార్పొరేషన్ చైర్మన్ మసయుకి సటోతో సీయం చంద్రబాబు బృందం భేటీ అయ్యింది. చెన్నయ్‌లో ఇండస్ట్రియల్ పార్క్ వున్న జేజీసికి ముఖ్యమంత్రి ఆంధ్రప్రదేశ్‌లో వనరులపై వివరించారు. జేజీసి ప్రతినిధులు ఫుడ్ ప్రాసెసింగ్ రంగం వైపు ఆసక్తి చూపారు. రిఫైనరీ, క్రాకర్ యూనిట్ ఏర్పాటుపై కూడా జేజీసీ ప్రతినిధులు ఆసక్తి కనపరిచారు.

### ఎస్ఎంబిసి కన్సల్టెన్సీ సేవలకై విజ్ఞప్తి

ముఖ్యమంత్రి చంద్రబాబు బృందం సుమిటోమో మిత్సు బ్యాంకింగ్ కార్పొరేషన్ (ఎస్ఎంబీసీ)తో భేటీ అయ్యింది. ఎలివేటెడ్ మెట్రో రైలుకు, మోనో రైలుకు అయ్యే ఖర్చులో వ్యత్యాసం గురించి అధ్యయనం చేసి చెప్పాలని ఎస్ఎంబిసికి అనుబంధంగా వున్న జపాన్ రీసెర్చ్ ఇనిస్టిట్యూట్ (జెఆర్ఐ)ను సిఎం చంద్రబాబు కోరారు. ఆంధ్రప్రదేశ్‌కి వచ్చి అక్కడ విశ్వవిద్యాలయాలు, పరిశోధన సంస్థలతో కలిసి కన్సల్టెన్సీ సేవలు అందించాలని జేఆర్ఐకు సూచించారు.

ముఖ్యమంత్రి చంద్రబాబు టోషిబా కంపెనీ ఏర్పాటు చేసిన సమావేశంలో పాల్గొన్నారు. విద్యుత్ నిర్వహణపై టోషిబా ప్రతినిధులు ఆసక్తి చూపారు. విద్యుత్ ట్రాన్స్ మిషన్ నష్టాలను ఏపీలో ప్రస్తుతం 10.3 శాతం వరకు తగ్గించుకుంటూ వచ్చిన విషయాన్ని టోషిబా ప్రతినిధులకు ముఖ్యమంత్రి చంద్రబాబు వివరించారు.

ఏపీలో ప్రతిపాదిత ఎనర్జీ యూనివర్సిటీ ఏర్పాటులో భాగస్వామి కావాలని ముఖ్యమంత్రి టోషిబా కంపెనీకి సూచించారు. ఎనర్జీ రీసెర్చిలో తమకు భాగస్వామిగా వుండాలని కోరారు. స్మార్ట్ మీటర్లు, స్మార్ట్ పవర్ మేనేజ్మెంట్‌పై టోషిబా కంపెనీ ప్రతినిధులు ప్రెజెంటేషన్ ఇచ్చారు. ఫ్యుజి కంపెనీ విజయవాడలో పైలట్ ప్రాజెక్టుగా స్మార్ట్‌గ్రిడ్‌పై పనిచేసేందుకు ముందుకువచ్చిందని, టోషిబా విశాఖపట్నం కేంద్రంగా పనిచేయాలని సీయం చంద్రబాబు సూచించారు.

### ఎన్ఈసీతో ఏపిటిఎస్ అవగాహనా ఒప్పందం

ఇన్ఫర్మేషన్ అండ్ టెక్నాలజీ, ఎలక్ట్రానిక్స్ అండ్ కమ్యూనికేషన్స్ విభాగంలో భాగమైన ఏపీ టెక్నాలజీ సర్వీసెస్ లిమిటెడ్, ఎన్ఈసీ ఇండియా ప్రైవేటు లిమిటెడ్ మధ్య అవగాహన ఒప్పందం కుదిరింది. ఈ ఒప్పందం ప్రకారం పౌర సేవలు, విద్య, భవిష్యత్తు నగర ప్రాజెక్టులు, ఆర్థిక సాంఘిక ప్రగతి, జిడిపి వృద్ధి, విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు, యువత ఉపాధి, సాంఘిక భాగస్వామ్యం, నైపుణ్యాభివృద్ధిలో అంతర్జాతీయ ప్రమాణాలను చేరుకోవటంలో ఏపీ సర్కారుకు ఎన్ఈసీ తోడ్పాటు అందిస్తోంది. తిరుపతిలో సేఫ్ సిటీస్ ప్రాజెక్టు అమలుకు ఏపిటిఎస్, ఎన్ఈసీ కలిసి పనిచేస్తాయి.

### అమరావతి నిర్మాణంలో ఆది నుంచీ పాల్గొంటాం – వైస్ మినిస్టర్ హోమీ

జపాన్ పర్యటనలో భాగంగా ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు మెటి వైస్ మినిస్టర్తో భేటీ అయ్యారు. ఈ సందర్భంగా వైస్ మినిస్టర్ మాట్లాడుతూ ఆంధ్రప్రదేశ్ అభివృద్ధి పట్ల జపాన్‌కు వున్న చిత్తశుద్ధిని రుజువు చేసేందుకే తాను వచ్చానన్నారు. కొత్త రాజధాని నిర్మాణంలో ఆది నుంచి పాల్గొనాలన్నదే జపాన్ ఆకాంక్షగా పేర్కొన్నారు.

### జేఎఫ్ఈ ఇంజనీరింగ్ కార్పోరేషన్ సందర్శన

టోక్యో సందర్శనలో భాగంగా సీఎం చంద్రబాబు బృందం జేఎఫ్ఈ ఇంజనీరింగ్ కార్పోరేషన్‌ను సందర్శించింది. వ్యర్థ పదార్థాల నుంచి విద్యుత్ ఉత్పత్తి లో ప్రపంచంలోనే పేరొందిన కంపెనీ ఇది. ఏపీలో కూడా వేస్టు 2 ఎనర్జీ ప్లాంట్ల ఏర్పాటుపై సీఈఓ హిసనోరి కనోవు నేతృత్వంలోని ప్రతినిధి బృందం ఆసక్తి చూపింది. సీఎం చంద్రబాబు స్పందిస్తూ ఏపీలోని ఏడు నగరాలలో వేస్టు 2 ఎనర్జీ ప్లాంట్ల ఏర్పాటు టెండర్లలో పాల్గొనాలని వారిని ఆహ్వానించారు.

### కొమమురా కార్పొరేషన్ ప్రతినిధులతో భేటీ

నాలుగో రోజైన గురువారం కొమమురా కార్పొరేషన్ ప్రతినిధులతో భేటీ అయ్యారు. ఈ భేటీలో పాల్గొన్న కొముమురా కార్పొరేషన్ ప్రెసిడెంట్ టొషియుకి మాట్లాడుతూ భారత దేశంలో లెన్సులు, కెమేరాల ఉత్పత్తికి తాము ఆసక్తిగా వున్నట్లు తెలిపారు. ఆంధ్రప్రదేశ్‌లో ఉత్పత్తి కర్మాగారాన్ని ఏర్పాటు చేయటంపైన, ఏపీ నుంచి ఇతర దేశాలకు ఉత్పత్తుల ఎగుమతికి వున్న సాధ్యాసాధ్యాల గురించి చర్చించారు.

మొత్తం మీద ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు రెండవ సారి జపాన్‌లో జరిపిన పర్యటనతో ఆంధ్రప్రదేశ్‌లో అంతర్జాతీయ కంపెనీలు పెట్టుబడులు పెట్టడానికి మార్గం మరింత సుగమమైంది. పెట్టుబడులతో పాటు, అత్యాధునిక టెక్నాలజి అందుబాటులోకి రానుంది. ఈ కంపెనీలు ఒక్కొక్కటి తమ కార్యకలాపాలు ప్రారంభిస్తే, మన రాష్ట్రంలో ఉపాధి కల్పనకు కూడా అవకాశాలు ఇబ్బడిముబ్బడిగా పెరుగుతాయి.



జాస్తి గోపాల ప్రసాద్

# పుష్కర గోదారి సందర్శనం

## మా పాలిట మహాయోగం!



పుష్కరాల సమయంలో గోదావరిలో స్నానమాచరించడం ఎలాంటి అనుభూతి? ఈ పుష్కరాల్లో రాజమండ్రి సందర్శించిన ఓ సామాన్య భక్తుడి అనుభవం ఆయన మాటల్లోనే...

వింతశబ్దాలు చేస్తూ రైలు వంతెన దాటుతూంటే పిల్లలు ఉత్సాహంగా రూపాయి బిళ్లలు విసురుతూ అఖండ గోదావరికి మొక్కుతున్నారు. నడిరాత్రి రెండున్నర జాములైనా గడవలేదు. చిక్కని చీకట్లో లోతు దాచుకొని పారే నిశ్శబ్ద గోదారి కాదప్పుడు; రాత్రిని పగలు చేసేస్తున్న మిరుమిట్ల పుష్కర దీపాల కాంతిలో మెరిసే నిశ్చల గోదారి. పుష్కరాల వల్ల కాబోలు గోదావరి స్టేషన్ లో కూడా ఆగింది రైలు. ముఖ్యమైన పుష్కర ఘాట్లు మరీ దగ్గర ఉండటం వల్ల అందరూ అక్కడే దిగిపోతున్నారు. రైల్లో కంటే బైటే ఎక్కువ కిటకిటలాడుతున్నారు జనం. పిల్లాపీచు, బాదరాబందీతో అక్కడ వద్దనుకొని, రాజమండ్రి స్టేషనులో దిగాము. పోయిన పుష్కరాలకి కూడా రాజమండ్రి వచ్చాము. మళ్లీ ఆ తర్వాత మా నాన్నగారి అస్థికలు నిమజ్జనం చేయడానికి ఆరేళ్ల క్రితం కూడా వచ్చాను ఒంటరిగా. కానీ, నిన్నటి రాజమండ్రిలా లేనేలేదని తెల్సిపోతుంది రైల్వే స్టేషనులోనే. ప్లాట్ ఫారం మీద గడియారం రాత్రి 2.20 చూపిస్తుందే గానీ, అపరాత్రి ఛాయలేవ్వు అక్కడెక్కడా. నిద్రతో జోగుతున్న ముఖం ఒక్కటి కూడా లేదు. కాషాయం స్కార్ఫ్ కి భగవాన్ సత్యసాయి బొత్తాం పెట్టుకున్న సేవాదళం 'సాయిరాం..' అంటూ స్వాగతం పలుకుతున్నారు. పుష్కర కమిటీ ఏర్పాటు చేసిన వాల్ పోస్టర్లు, హోర్డింగులు సౌకర్యాల గురించి యాత్రికులకి ఇచ్చే సమాచారాన్ని మించి మరింత సాదరంగా ఉన్నాయి పోలీసు వారి సూచనలు.

### తల దాచుకొను తావు...

అన్నింటికన్నా పెద్ద సమస్య వసతి. ఈడొచ్చిన ఇద్దరు పిల్లల్తో యాతనలు పడాల్సివస్తుందని భయం. ముందు జాగ్రత్తగా మూడ్నెల్ల ముందే ప్రయత్నించాను, నా దిగువ మధ్యతరగతి తాహతుకు తగ్గట్టు. కానీ, కుదరలేదు. అయినవాళ్లు లేరా అంటే, లేకేమి! కావల్సిన వాళ్లు కంబాలచెరువు చుట్టూ, మిత్రులు మోరంపూడి నిండా ఉన్నారు. కానీ, పుష్కరాల తాకిడికి భయపడి తప్పించుకున్నారు. స్టేషన్ బైటకి వచ్చాక అర్థమయ్యింది, మాలాగా ఎందరో అని. అక్కడ కొంతమంది ఎన్ఎస్ఎస్ కుర్రాళ్లు దగ్గర్లో ఉన్న ఓ కమ్యూనిటీ హాలుకి తీస్కెళ్లారు. వాతావరణంలో ఉక్కబోతని ఊదేయడానికా అన్నట్టు పనిచేస్తున్నాను పెద్ద పెడస్టల్ ఫ్యాన్లు. అంత గాలిని తవ్వి పోస్తూ కూడా చప్పుడు చేయకపోవడం విశేషం. ప్రొద్దుటి దాకా అక్కడే పడకేశాము. కమ్యూనిటీ హాలుకి ఉన్న టాయిలెట్లకి అదనంగా తాత్కాలికంగా కట్టినవి బారులు తీరి ఉన్నాయి. కోనసీమ కొబ్బరినీళ్లలా నిరంతరాయంగా అన్నిచోట్లా మంచినీళ్లే. పేస్టులు వాడొద్దంటూ ఓ పెద్దాయన వేపపుల్లలు పంచుతున్నాడు. కాలకృత్యాలు తీర్చుకొని, స్నానాలు ముగించాము. అక్కడి నుంచి, ప్రభుత్వం ఏర్పాటు చేసిన ఏపీఎస్ ఆర్టీసీ ఉచిత బస్సులో రామాలయం ఘాట్‌కి వెళ్లాము.

## పిండ ప్రదానం రేపు

ముందు పుణ్యస్నానం చేసి, పిండ ప్రదానం చేస్తే ముఖ్యమైన పని పూర్తవుతుంది అనుకుంటే, అది కుదరలేదు. అధిక ఆషాఢంలో వస్తున్న అమావాస్య మర్నాడు కాబట్టి, పిండ ప్రదానం రేపటికి వాయిదా వేసుకోమన్నారు ఘాట్ దగ్గర పురోహితుడొకరు. ఎలాగైనా ఉండటానికే సిద్ధమై వచ్చాం కాబట్టి, సరే లెమ్మనుకున్నాం. పుష్కర స్నానం వరకూ చేద్దామనుకొని 'గంగేచ యమునైశ్చైవ గోదావరి సరస్వతీ' అంటూ సంకల్పం చెప్పుకుని, ప్రవాహానికి ఎదురుగా మూడు మునకలూ, ఆ తరవాత తూర్పుగా తిరిగి మరో మూడు మునకలూ వేసి గోదారమ్మకి పసుపు కుంకుమల్తో హారతిచ్చి, బయటకొచ్చి అశ్వద్ధానికి ప్రదక్షిణం చేశాం. పక్కనెవరో షాంపూలు వాడుతుంటే వాలెంటీర్లు వారిస్తున్నారు. బట్టలు పిండి చాకిరేవు చెయ్యొద్దని మరి కొందరికి అదిలింపులు. పుష్కలంగా నీరున్నా మునగలేని వికలాంగులు, వయోవృద్ధులకు అనుకూలంగా గోదారమ్మ నీళ్లు నిండారా తడిపేసేలా షవర్లు ఓ పక్క.

బట్టలు మార్చుకోడానికి చేసిన ఏర్పాట్లు చాలా బాగున్నాయని అంది మా శ్రీమతి, అక్కడ ఆడ వాలెంటీర్లు చాలా మర్యాదగా ఉన్నారని చెప్పుకొచ్చారు మా అమ్మాయిలు. పోస్టల్ డిపార్ట్మెంట్ ఇంటికే పంపిస్తుంటే, పవిత్ర గోదారి జలాల్ని మోసుకు తిరగడం ఎందుకు? అందుకే, అక్కడే ఉన్న సంబంధిత స్టాల్‌లో డబ్బులు కట్టి మా అడ్రెస్ నమోదు చేశాను. ఆన్‌లైన్ లో కూడా బుక్ చేసుకునే ఏర్పాటు ఉందిట.

కడుపులో ఎలుకలు పరిగెడుతున్నాయని పిల్లల గొడవ. పెద్దోళ్లం కాబట్టి మేము బైటపడలేదంతే. ఘాట్ బైటకి వెళ్లి తిందామని అంటుండగానే, దేవాదాయ శాఖ వాళ్లు గోదారమ్మ ప్రసాదం పెడుతుంటే ఆబగా అందుకున్నాం. ఇంగువ ఘుమఘుమలాడుతున్న పులిహోర. ఎక్కడ చూసినా మంచినీళ్ల చలివేంద్రాలు, చిన్న చిన్న పొట్లాల్లో రక్షిత మంచినీళ్లు. క్షుద్బాధ తీరింది. పది మీటర్లకో పడవ, పడవకి ఇద్దరు గజ ఈతగాళ్లు. ఘాట్స్‌తో పాటు ఆంధ్రుల చారిత్రక, సాంస్కృతిక రాజధాని రాజమండ్రిని రూ.1999తో ఆకాశం నుంచి చూసొచ్చానని చెబుతున్నాడు ఓ పెద్ద మనిషి. ఒక హెలికాప్టర్లో ఆరుగురు చొప్పున ప్రయాణం చేసేలా 20 నిమిషాల పాటు నగరాన్నీ, పుష్కర సంబరాల్ని చూసే ఏర్పాటు చేసింది ప్రభుత్వం."ఎదవ డబ్బులు పోతేపోయాయ్ గానండీ... మా గొప్పగా ఉందండీ బాబు..." తలుచుకొని తలుచుకొని చెబుతున్నాడాయన. పై నుంచి చూస్తుంటే, గట్లు పొడవునా ఉన్న బోట్లు పూలచెండ్లు లాగా తేలుతుండటం బాగున్నదని అంటుంటే, కుతూహలంగా వింటున్న నా పిల్లలిద్దరూ అదెక్కడ ఎక్కించమంటారోనన్న జంకుతో త్వరత్వరగా అక్కడి నుంచి బయిల్దేరదీశాను. "ఈ మాత్రం దానికి హెలికాప్టర్ లో రెండువేల రూపాయలు చమురు వదిలించుకోవాలా? ప్రతి ఘాట్ లో చంద్రబాబు ప్రభుత్వం పెట్టిన ఎలక్ట్రానిక్ తెరల మీద కోటి లింగాల ఘాట్, లక్ష్మి గణపతి ఘాట్ ,కనకదుర్గా ఘాట్, శ్రీ కృష్ణ చైతన్య ఘాట్, పుష్కర ఘాట్, పద్మావతి ఘాట్, ఇంకా.... వైగ్రాం, విశ్వేశ్వర, గౌతమీ, సిద్దేశ్వర ఘాట్లు .... మొత్తం అన్ని ఘాట్లూ కళ్లకు కట్టినట్టు కనబడుతుంటేనూ..." అంటూ తొందర చేశాను.

## 'పుష్కర నగర్' ఆదర్శం

చేతిలో పెట్టేబేడా ఎక్కడైనా పెట్టేసుకొని ఊరు చూసొద్దాం అన్నారు పిల్లలు. పుష్కర యాత్రికులు రాత్రి వేళల్లో బస చేయడం కోసం కమ్యూనిటీ హాళ్లు, కళ్యాణమండపాలు ఏసీ , నాన్ ఏసీలు మొత్తం కలిపి సుమారు 200 దాకా ప్రభుత్వం సిద్ధం చేసినట్టు చెప్పుకుంటుంటే రాత్రి విన్నాం. అవిగాకుండా, ప్రభుత్వ స్కూళ్లు, జూనియర్ కాలేజీలు కూడా కొన్ని బస ఏర్పాట్లు చేశారట. మరి, ఈ పుష్కర నగరాలు ఏమిటో? అక్కడొక సమాచార కేంద్రంలో అడిగాము, పుష్కర నగర్ కథాకమామీషూ ఏంటీ అని. యాత్రికుల విశ్రాంతికి, ఉచిత భోజనానికీ కూడా ఏర్పాటైనవే పుష్కర నగర్‌లని చెప్పారక్కడ. గూడ్స్ షెడ్, జెమిని గ్రౌండ్స్, లారీ స్టాండ్, మార్గాని ఎస్టేట్, హౌసింగ్ బోర్డు, ఆర్ట్స్ కళాశాల, సంస్కృతి పాఠశాల, ఈఎస్ఐ ఆసుపత్రి, లూథర్‌గిరి, మూలగొయ్యి, టీటీడీ కల్యా ణ మండపం.... ఇట్లా పలు చోట్ల పుష్కర నగర్ లు ఏర్పాటు చేసారట. బ్రతుకుజీవుడా అనుకుంటూ, ఉచిత బస్సుల కోసం చూడకుండా రిక్షా మీద బయిల్దేరాం.

మరీ రద్దీ లేని పుష్కర నగర్‌కి చేరుకున్నాం. మిట్టమధ్యాహ్నం... చెమటలు దిగ్గారిపోతున్నాయి. చేతిలో బ్యాగులు కౌంటర్లో అప్పజెప్పి, టోకెన్ తీసుకొని, ఓ ఫ్యాను కింద పక్కలేసుకొని కాసేపు నడుం వాల్చాము. గట్టిగా గంట కునికానో లేదో, కమ్మటి వాసనలకి మేలుకున్నాను. పడుకున్న చోటుకు ఉత్తరంగా గుడారం కింద వరసల్లో ఉన్నాయి సోలార్ కుక్కర్లు. రోజూ లక్షల మందికి వండి వార్చే భారీ ఏర్పాట్లు, మరో పక్క వడ్డనకి ఆరు పంక్తులు, మరి కాస్త ముందు బఫే పద్ధతిలో పెట్టడానికి సేవాదళ్ దండు. చూస్తేనే కడుపు నిండిపోయినట్టు అనిపించింది. వంక పెట్టడానికి లేని ఏర్పాట్లే ఎటు చూసినా. ఒక పూట, ఒక రోజు కాదు; ఏకంగా 12



భక్తులతో కలిసి గోదావరి హారతిని తిలకిస్తున్న ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు

రోజుల మహా సంబరం. వరద ఉధృతిలా వచ్చిపడుతున్న ఎడతెగని యాత్రికుల ప్రవాహం. కానీ, ఎక్కడా దోపిడికి తావులేదు. అడుగడుగునా మరుగు దొడ్లు, మంచి నీళ్లు, ఉచిత వైద్య శిబిరాలు, ఉచిత బస్సు సౌకర్యం, ఎక్కడికక్కడ సమాచార కేంద్రాలు రైల్వే స్టేషన్, బస్టాండ్లలో ఉచితంగా 3జి సర్వీస్...! సేవలో పాలుపంచుకుంటూ ప్రభుత్వ సంస్థల ఉద్యోగులతో పాటు స్వచ్ఛంధ సంస్థలు, విద్యార్థినీ విద్యార్థులు, వాలంటీర్లు.... ఎందరో.

## నగర సందర్శనం

కమ్మటి భోజనం తిని, మెల్లగా బయిల్దేరాము, నగర సందర్శనకి. పాత రాజమండ్రికీ దీనికీ పొంతనే లేదు; కొత్త రోడ్లు, వెడల్పైన పాత రాదారులు, భూగర్భ డ్రైనేజి వ్యవస్థ, అడుగడుగునా పచ్చదనం, ఉద్యానవనాలు, కోటిపల్లి బస్టాండ్ ఎదుట భారతీయ నృత్య రీతులన్నీ బొమ్మల రూపంలో నృత్య వనం, ఉద్యమకారిణుల స్మృతి చిహ్నంగా పాల్ చౌక్ లో ఫ్రీడం పార్క్... ప్రత్యేక వాహనాల్లో ఏటిఎం మిషన్లను ఏర్పాటు చేసి, వాటిని స్నానఘట్టాలు, ప్రధాన రోడ్లపై నిలుపుతున్నారు.

ముందుగా, కోటిపల్లి బస్టాండ్ నుండి తాడితోటకు వెళ్ళే దారిలో మునిసిపాలిటీ స్టేడియంలో తిరుమల తిరుపతి దేవస్థాన నమూనా ఆలయం చూశాము. తర్వాత, శ్రీ కందుకూరి రాజ్యలక్ష్మి మహిళా కాలేజ్ లో ఏర్పాటు చేసిన రాష్ట్రంలోని ప్రముఖ పుణ్యక్షేత్రాల నమూనాలు. ఆర్ట్స్ కాలేజ్ లో కడియం ఉద్యాన ప్రదర్శన చాలా బాగుంది. దామెర్ల ఆర్ట్ గ్యాలరీ, గౌతమీ గ్రంథాలయం, కాటన్ దొర కట్టించిన ధవళేశ్వరం బ్యారేజీ.... వగైరాలు కూడా పనిలో పనిగా కాకుండా ఎంతో ఇష్టంగా చూశాం. 1900లో ప్రారంభమైన హేవ్ లాక్ బ్రిడ్జ్ తో సహా, మొత్త గోదావరి మీద ఉన్న పాత, కొత్త వంతెన్లు కూడా చూసేశాం. రోడ్ కమ్ రైల్ వంతెన మీద నిలబడితే, కాళ్ల కింద నేల జ్ఞాపకాల తలపోతలో కంపించినట్టనిపించింది. ఇక, సాయంసంధ్య వేళకి పుష్కర ఘాట్ చేరుకున్నాము.

## గౌతమికి అఖండ హారతి

మలిసంధ్య వేళ గోదారమ్మకి నిత్య హారతి ఇచ్చేలా ఏర్పాట్లు చేయడం రాష్ట్ర ప్రభుత్వం చేపట్టిన మరో అద్భుత కార్యక్రమం అనడానికి సందేహం లేదు. ఇంకొద్ది సేపట్లో హారతి మొదలవుతుందనగా ఘాట్ జనంతో నిండిపోయింది. గట్టు మెట్ల మీద కాస్తంత జాగా కుదుర్చుకొని సర్దుకొని కూర్చొన్నాం మేం నలుగురం. గట్టుకి ఏభై అడుగుల దూరంలో పంట్ మీద భారీ వేదిక. విద్యుద్దీపాల అలంకరణలో వేదిక ధగద్ధగాయమానంగా ఉంది. ఏడుగురు అర్చక స్వాములు వేదమంత్రోచ్చాటనలతో బిళ్వహారతి, నాగ హారతి, పంచ హారతి, వృక్షహారతి, నంది హారతి, సింహ హారతి, రుద్ర హారతి, కుంభ హారతి, చక్ర హారతి, కర్పూర హారతి....అంటూ...రకరకాల


పుష్కర స్నానమాచరించే భక్తులకు ఎటువంటి ఇబ్బంది లేకుండా అన్ని ఏర్పాట్లు

హారతులు నివేదన చేశారు. కళ్లారా, మనసారా హారతి అద్దుకొన్నాం.

ఆ తర్వాత మహా శివలింగం పక్కగా ఎగజిమ్ముతున్న ఫౌంటెన్లకి రంగులద్దుతున్న లైట్లు; కొత్త కాంతుల లోకాన్ని సృష్టిస్తూ ఆ పక్కనే లేజర్ షో, వంపు తిరిగిన వంతెన్లు నగర సుందరి నడుముకి వెలుగుల వడ్డాణాలు! అల్లంత దూరాన మరో తారాతీరాన్ని తలపిస్తూ ఆకాశ దీపాల వేడుక. పుష్కర కళా వేదిక మీద వాయులీనం– వేరే లోకంలో ఉన్నట్టే అనిపించింది. అలౌకికానందానికి లౌకికమైన బోనస్ దొరికినట్టు ఎవరో పిడపర్తి ట్రస్ట్ వాళ్లట రవ్వ ఉప్మా పేకెట్లు పంచిపెట్టారు.

## మహానాయకుడి కరచాలనం

మెల్లగా ఘాట్ నుంచి పుష్కర నగర్ ముఖం పట్టాం. అప్పుడు రాత్రి 10.20. జనంలో ఒక్కసారి కలకలం. ఎదురుగా మహానేత, పుష్కర పుణ్యాన్ని కోట్లాది మంది తన వాళ్లకి పంచాలని సమకట్టిన సంకల్పశక్తి, కొండంత కార్యభారాన్ని భుజాన మోస్తున్న ధీశాలి, మన రాష్ట్ర ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు గారు! సాక్షాత్తూ ఆయనే, బ్లాక్ కమెండోల రక్షణ వలయాన్ని దాటి, యాత్రికుల్ని పలకరిస్తూ, వారి సురక్షితమైన ప్రయాణానికి అధికారుల్ని పురమాయిస్తూ.... ఆ నిలువెత్తు మూర్తి! అప్రయత్నంగా చాచిన నా చేతికి అనుకోని అదృష్టంలా ఆయన కరస్పర్శ; పిల్లలకి ఆశీర్వచనాలు. చంద్రుని ముఖాన చిన్న మచ్చలా ఆ అధినేత వదనంలో దాగని విషాద జీర. పుష్కరాల తొలినాడు మానవ తప్పిదంగా దొర్లిపోయిన విషాదం 27 మందిని బలితీసుకుంటే, తన ప్రమేయం లేనిదైనా 'నా తప్పు ఉంటే మన్నించండి' అని వేడుకున్న సంస్కారి! నరంలేని నాలుకతో గిట్టని వాళ్లు దాడి చేస్తూ, నేలబారుగా ప్రవర్తిస్తున్నప్పుడు, తనకి సంబంధం లేని జవాబుదారితనాన్ని మోసిన ఒక మేరునగధీరుడు! ఇటువంటి సంస్కారి, ధీరుడి గురించి ఎక్కడైనా విన్నామా, ఎప్పుడైనా కన్నామా?

ఆయన కళ్ల ముందు కనబడి, కరచాలనం చేసి, పలకరించడం ఒక కలగా అనిపించింది. ఆయన కదిలి ముందుకెళ్లిపోతుంటే, అప్రయత్నంగా నది వంక చూశాను. యుగాలుగా ప్రవహించి వస్తున్న ఆ జీవవాహిని ఒడ్డున ఒదిగిన నా తరతరాల జీవ-నయానం ఒక ఋణగ్రస్తమైన జ్ఞాపకంలా మెదిలింది. మనిషికి బ్రతుకునిచ్చి, నాగరికత నేర్పి, నిన్న– నేడు– రేపులనే త్రికాలాలతో ముడిపడిన మహానదిలోకి సామూహిక కృతజ్ఞతనై మంత్ర సహితంగా, అగ్నిసాక్షిగా సంగమించే సందర్భమే కదా పుష్కరం అనిపించింది.

ఇదంతా ఒక అపూర్వమైన మహోత్సవంగా జరిపించిన ముఖ్యమంత్రి 'సౌకర్యంగా ఉందా..' అని పరామర్శిస్తున్నారు యాత్రికుల్ని. సౌఖ్యం, సౌకర్యాలు అన్నవి చిన్న మాటలు. అది మొత్తం ఒక భోగం, ఈ గోదావరి పుష్కరాలకు రావడం మాకు పట్టిన మహాయోగం.

– ఓ సామాన్య యాత్రికుడు

వెల్లువ గోదారై పోటెత్తిన భక్తకోటి

# అంగరంగ వైభవంగా మహాపుష్కరాలు

వేద ఘోషే కాదు. కోట్లాది జన ఘోష, జలభాష. జీవన రేఖ గోదావరి. ఆ జలాలు పొంగితేనే కదా పొలాల్లో హలాలు కదిలేది. ఆ జల స్పర్శతోనే కదా ఈ నేల ధన్యగోదారి అయ్యింది. ఆంధ్రావని తలుపు తట్టి భూదేవికి ఆకుపచ్చ బొట్టు పెట్టింది. కర్షకుల ఆశలు పండించే తూర్పు, పశ్చిమ ఒడ్లు. పుట్లకు పుట్లు వడ్లు. కాటనాయనమః. ఎన్ని తర్పణలు, ఎన్ని సమర్పణలో చూసిన గోదారమ్మకి మహా పుష్కరాలు. ఆ పావన గౌతమీ తీరం పన్నెండు రోజుల పాటు పుష్కర సంబరాలతో భక్త జనకోటికి ఒక వేదికగా మారింది.వేదఘోషతో శ్రీకారం చుట్టిన పుష్కరాల వేడుకల్లో కోట్లాది మంది యాత్రికులు పాల్గొని పుణ్యస్నానాలతో పునీతులయ్యారు.

## పోటెత్తిన భక్తకోటి

జూలై 14 నుంచి 25 వరకు పన్నెండు రోజుల పాటు రాష్ట్ర ప్రభుత్వం ఎంతో ప్రతిష్ఠాత్మకంగా నిర్వహించిన గోదావరి మహా పుష్కరాలు అంగరంగ వైభవంగా జరిగాయి. దేశ, విదేశాల నుంచి కోట్లాది మంది భక్త జనం ఒక ప్రవాహంలా పోటెత్తారు. కుంభమేళాను తలపించేలా ఈ పుష్కరాలు ఘనంగా, విజయవంతంగా జరిగాయి.

## అంకురార్పణ జరిగిందిలా

బృహస్పతి సింహరాశిలో ప్రవేశించిన సుమూహూర్తంలో, 144 వసంతాల తర్వాత అరుదుగా వచ్చే గోదావరి మహా పుష్కరాలు మేళతాళాలు, మంగళవాయిద్యాల మధ్య వేదపండితుల మంత్రోచ్ఛరణలతో జూలై 14న నవ్యాంధ్రప్రదేశ్‌లోని గోదావరి నదీ తీరంలో ప్రారంభమయ్యాయి. రాజమండ్రిలో ఆ రోజు ఉదయం సరిగ్గా 6.26 గంటలకు పుష్కర ఘాట్ వద్ద గోదావరి మహా పుష్కరాలు శాస్త్రోక్తంగా మొదలయ్యాయి.

కంచి పీఠాధిపతి జయేంద్ర సరస్వతి ఈ పుష్కరాలకు తొలుత అంకురార్పణ చేశారు. అనంతరం ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు తన కుటుంబసభ్యులతో పుష్కర ఘాట్ వద్ద పుణ్యస్నానాలు ఆచరించి, మహాపుష్కరాలకు శ్రీకారం చుట్టారు. గవర్నర్ నరసింహన్ దంపతులు, కేంద్రమంత్రులు ముప్పవరపు వెంకయ్యనాయుడు, జవదేకర్ ప్రభృతులతోపాటు పలువురు రాష్ట్ర మంత్రులు, ఉన్నతాధికారులు, రాజకీయ ప్రముఖులంతా గోదావరినదిలో పుణ్యస్నానాలు ఆచరించి తమ భక్తిని చాటుకున్నారు. సింగపూర్ మంత్రి ఈశ్వరన్ ఆధ్వర్యంలో అమరావతి రాజధాని బృహత్తర ప్రణాళిక రూపొందించిన సింగపూర్ ప్రతినిధులు కూడా పుణ్యస్నానమాచరించారు.



కోట్లాదిమంది యాత్రికులు తరలివచ్చినా, సజావుగా సాగిన నిర్వహణ

## భక్తజనంతో మమేకమైన చంద్రన్న

గోదావరి పుష్కరాలను ప్రశాంతంగా, విజయవంతంగా నిర్వహించడంలో ముఖ్యమంత్రి



## 'గోదావరి పుష్కరాల నిర్వహణ...నా పూర్వజన్మ సుకృతం'

'144 ఏళ్లకు ఒకసారి అరుదుగా వచ్చే గోదావరి మహా పుష్కరాలను నా హయాంలో నిర్వహించడం నా పూర్వ జన్మ సుకృతం. పవిత్రమైన గోదావరి నది తెలుగు వారందరికీ జీవనాడి. ఈ పుష్కరాలు సందర్భంగా రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధికి కావలసిన సంపద సృష్టించాలని ఆ గోదావరి మాతను వేడుకున్నాను. పుణ్యస్నానాలు చేస్తూ తమ వ్యక్తిగత, కుటుంబ శ్రేయస్సును ఆకాంక్షించే భక్తులు రాష్ట్ర సమగ్రాభివృద్ధిని కూడా కోరుతూ ఆ గోదావరి తల్లిని వేడుకోండి,' అని నవ్యాంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు యాత్రీకులకు పిలుపునిచ్చారు.



తొలిరోజే జరగరాని దుర్ఘటన జరిగినా, చెక్కుచెదరని మనోధైర్యంతో బాధితులను ఒకవంక ఓదార్చుతూ, మరోపక్క జరగాల్సినకార్యక్రమాన్ని నిర్విఘ్నంగా, శోభాయమానంగా నిర్వహించిన వైనాన్ని ప్రశంసించని భక్తజనులు లేరు....

## 'దుర్ఘటన నుంచి తేరుకోలేకపోతున్నా...'

'ప్రభుత్వం ఎంతో ప్రతిష్ఠాకరంగా చేపట్టిన గోదావరి మహాపుష్కరాలలో తొలిరోజే తొక్కిసలాట జరిగి 27మంది మృత్యువాత పడిన దుర్ఘటన నుంచి నేను ఇంకా తేరుకోలేకపోతున్నాను. వివిధ ప్రాంతాల నుంచి పుణ్య స్నానాలకోసం తరలి వచ్చిన భక్తులు మరణించడం బాధాకరం. అవాంఛనీయ ఘటనలేవీ చోటుచేసుకోకూడదన్న లక్ష్యంతో నేనే స్వయంగా ఏర్పాట్లన్నీ పర్యవేక్షించినా, దురదృష్టం మృత్యువు రూపంలో వెంటాడింది,' అని ముఖ్యమంత్రి చంద్రబాబు ఉద్వేగభరితంగా అన్నారు. తొలిరోజు తొక్కిసలాట ఘటనను జ్ఞాపకం చేసుకుంటూ ఆయన తీవ్ర ఆవేదన చెందారు.



రాజమండ్రి వద్ద అంబరాన్ని అంటిన గోదావరి పుష్కర సంబరం

చంద్రబాబు నాయుడు పోషించిన పాత్ర అమోఘం. పన్నెండు రోజులూ అనుక్షణం అప్రమత్తంగా ఉ ంటూ, తరచూ అధికారులతో పరిస్థితులు సమీక్షిస్తూ, భక్తులతో మమేకమవుతూ తానొక 'పుష్కరసేవకుని'లా వ్యవహరించి, భక్తుల మనసులు గెలుచుకున్నారాయన. అర్ధరాత్రి అపరాత్రి అనక, రాత్రి రెండింటిదాకా ఆకస్మికంగా పర్యటనలు జరిపి ఏర్పాట్లను, పారిశుద్ధ్య పరిస్థితులను పరిశీలించి, లోపాలను సరిదిద్దుతూ పలు జాగ్రత్తలపై అధికారులకు తగు సూచనలిస్తూ అప్రమత్తం చేయగలిగారు చంద్రబాబు. పుష్కరాల నిర్వహణలో ఆద్యంతం దగ్గర ఉండి పరిస్థితులన్నీ చక్కదిద్దగలిగారు. పుణ్య స్నానాలకు తరలి వచ్చే కోట్లాది మంది భక్తులకు ఎలాంటి ఇబ్బందులూ కలుగకుండా వారికి అవసరమైన మౌలిక సదుపాయాలన్నీ కల్పించగలిగారు. యాత్రికులంతా ముక్తకంఠంతో ఏర్పాట్లను ప్రశంసించడం గమనార్హం.

## తొలి రోజు తీవ్ర మనస్తాపం

ఎంతో శోభాయమానంగా సాగిన ఈ పుష్కరాలలో తొలి రోజు ఊహించని విధంగా చోటు చేసుకున్న అపశ్రుతి అందర్నీ కలచి వేసింది.

పుణ్యస్నానాలకోసం ఆతృత పడిన భక్తుల మధ్య తొక్కిసలాట జరిగి 27మంది మృత్యువాత పడగా, మరో 32 మంది క్షతగాత్రులయ్యారు. ఈ దుర్ఘటనపై తీవ్ర మనస్తాపం చెందిన ముఖ్యమంత్రి ఒక దశలో కన్నీటి పర్యంతమయ్యారు. దానిని ఒక గుణపాఠంగా తీసుకున్న ఆయన, రాజధాని హైదరాబాద్‌కు తిరిగి రాకుండా రాజమండ్రిలోనే మకాంపెట్టి అన్నీ తానై చిత్తశుద్ధితో పనిచేస్తూ అందరికీ ఆదర్శంగా నిలిచారు. రాజమండ్రిలో ఉన్నన్నాళ్లూ తన పరిపాలన కూడ అక్కడ నుంచే కొనసాగించారు.

1996లో హరికేన్ తుపాను మహమ్మారిలా కోనసీమను అతలాకుతలం చేసిన సందర్భంలో కూడ చంద్రబాబు రాజమండ్రిలో మినీ సెక్రటేరియట్‌ను నిర్వహించి, బాధితులకు పునరావాసం కల్పించి వారిని ఆదుకోవడంలో సఫలీకృతులయ్యారు. ఈ అనుభవమే... ఆయనకు ఇలాంటి భారీ కార్యక్రమాల నిర్వహణలో అక్కరకొస్తోంది.



గోదావరి పుష్కరాల సందర్భంగా జరిగిన సాంస్కృతిక కార్యక్రమాలలో స్నేహా పెనుమూడి కూచిపూడి నృత్యప్రదర్శన

## బాసటగా నిలిచిన భక్తజనం

తొలిరోజున జరిగిన అపశృతికి ముఖ్యమంత్రే కారణమంటూ కొన్ని విపక్షాలు తమ రాజకీయ లబ్ధికోసం ఆరోపణలు గుప్పించినప్పటికీ ఆ విమర్శలు, నిందారోపణలను భక్తులు లెక్క చేయలేదు. జరిగిన ఘటనకు ప్రత్యక్ష సాక్షులుగా ఉన్న భక్తజనం, చంద్రబాబుకు బాసటగా నిలవడం విశేషం. యాదృచ్ఛికంగా జరిగిన ఆ దుర్ఘటనకు చంద్రబాబు ఎలా బాధ్యులౌతారని పలువురు భక్తులు, మేధావులు, ప్రత్యక్ష సాక్షులు ఒక్క గొంతుకై ప్రశ్నించారు. ఇలా భక్తులు నైతికంగా ఇచ్చిన ఆత్మస్థైర్యంతో చంద్రబాబు తన పాలనాదక్షతకు మరింత పదునుపెట్టి, మిగతా 11 రోజులూ భక్తులు మెచ్చేలా ప్రశాంతంగా కార్యక్రమాన్ని జయప్రదం చేయగలిగారు.

గోదావరి మహాపుష్కరాలు విజయవంతం కావడంలో ముఖ్యమంత్రి చంద్రబాబుకు పుష్కరాల నిర్వహణ మంత్రిమండలి ఉపసంఘం ఛైర్మన్, ఆర్థికమంత్రి యనమల రామకృష్ణుడు, పుష్కరాల నిర్వహణ కమిటీ ఛైర్మన్ పరకాల ప్రభాకర్, దేవాదాయశాఖ మంత్రి మాణిక్యాలరావు, పురపాలక, వైద్య ఆరోగ్య శాఖల మంత్రులు నారాయణ, కామినేని శ్రీనివాస్ ప్రభృతులు నిరంతరం అండగా ఉండి సహకరించారు.



దబ్బీరు రామకృష్ణ పట్నాయక్

# ఆయన నాకెప్పుడూ కలాం గారే...



రాష్ట్రపతి భవనాన్ని సామాన్యులకు చేరువ చేససిన ఏపిజె అబ్దుల్ కలామ్ ఆంధ్రప్రదేశ్‌తో, మరీ ముఖ్యంగా ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడితో సన్నిహిత సంబంధం ఉంది. 2002 లో చంద్రబాబు తొలివిడత ముఖ్యమంత్రిగా ఉన్న కాలంలో, కేంద్రంలోని ఎన్డీయే ప్రభుత్వంలో తెలుగు దేశం పార్టీ భాగస్వామిగా ఉంది. 2002లో రాష్ట్రపతి అభ్యర్థి ఎంపిక సమయంలో చంద్రబాబు కీలక పాత్ర వహించారు. శాస్త్రవేత్తగా అప్పటికే పేరుప్రఖ్యాతులు గడించిన అబ్దుల్ కలాంను దేశంలోనే అత్యున్నత పదవికి ఎంపిక చేయడం వల్ల ప్రజలకు, ప్రపంచానికి ఒక గొప్ప సందేశం ఇచ్చినట్లవుతుందని చంద్రబాబు నాయుడు ఎన్డీయే భాగసస్వాములకు నచ్చజెప్పారు. ఆ తర్వాత ఆయన ఎన్డీయే అభ్యర్థిగా విజయం సాధించడం, ప్రజల రాష్ట్రపతిగా పేరు తెచ్చుకోవడం అందరికీ తెలిసిందే. ఈ విషయాన్ని అబ్దుల్ కలామే స్వయంగా 'టర్నింగ్ పాయింట్స్' అని తాను రాసిన పుస్తకంలో గుర్తుచేసుకున్నారు.

"ఆ రోజు నేను అన్నా యూనివర్శిటిలో క్లాసు తీసుకోని, బయటకు రాగానే, వైస్ ఛాన్స్‌లర్ కళానిధి నా కోసం వచ్చి ఉన్నారు. మీ కోసం ప్రధాని వాజ్‌పేయి కార్యాలయం నుంచి చాలా ఫోన్లు వచ్చాయి. ప్రధాని మీతో అత్యవసరంగా మాట్లాడాలట అని విసి చెప్పారు. ప్రధాని ఫోన్ కోసం ఎదురుచూస్తుండగానే, ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడి నుంచి కాల్ వచ్చింది. మీకు కొద్దిసేపట్లో ప్రధాని కార్యాలయం నుంచి ఫోన్ వస్తుంది. మీరు వారు అడిగినదానికి కాదు అని చెప్పవద్దు అని చంద్రబాబు కోరారు. అంతలోకే, ప్రధాని కార్యాలయం నుంచి ఫోన్ రింగయ్యింది."

కలాంతో ముఖ్యమంత్రి ఈ అనుబంధం చివరివరకూ అలాగే కొనససాగింది. తనపై మావోయిస్టులు హత్యాయత్నం చేససినప్పుడు, రాష్ట్రపతిగా ఉండి కూడా ప్రొటోకాల్‌ను పక్కనబెట్టి కలాం తానే హైదరాబాద్‌లో తన ఇంటికి వచ్చి పలకరించిన విషయాన్ని ఈ సందర్భంగా చంద్రబాబు గుర్తుచేసుకున్నారు. నేను ఆయననెప్పుడూ కలాం గారూ అనే పిలిచేవాడిని. ఎంత పెద్ద పదవిలో ఉన్నా సామాన్యులతో కలిసిపోవడం, అందరినీ ప్రేమతో పలకరించడం, దేశం ముందుకువెళ్లాలని తపించడం ఆయనకున్న గొప్ప లక్షణాలు, అని కలాం మీద ఎన్‌డిటీవికి రాసిన నివాళిలో చంద్రబాబు పేర్కొన్నారు. కలాం కలలుగన్న దేశాన్ని సృష్టించడమే మనం ఆయనకు అర్పించగలిగిన నివాళి అని ముఖ్యమంత్రి అన్నారు.



## గొప్ప దార్శనికుడు.... స్ఫూర్తిదాత

"మన మాజీ రాష్ట్రపతి, భరతమాత ముద్దుబిడ్డ డాక్టర్ ఏపీజే అబ్దుల్ కలాం ఇక లేరు అన్న దుర్వార్త తీవ్ర దిగ్భ్రాంతికి గురిచేసింది, నన్ను కలచివేసింది. దేశం గొప్ప శాస్త్రవేత్తను, మేధావిని, దార్శనికుడిని కోల్పోయింది. భారతీయ క్షిపణి కార్యక్రమానికి అబ్దుల్ కలాం నేతృత్వం వహించడమే గాకుండా, ఆ మహోజ్వల కార్యక్రమాన్ని విజయవంతం చేసి మన దేశాన్ని అగ్రరాజ్యాల సరసన నిలబెట్టిన మహనీయుడు కలాం. ఆయన లేని లోటు పూడ్చలేనిది.

అలిపిరిలో నా మీద దాడి జరిగినప్పుడు రాష్ట్రపతిగా వున్న కలాం ప్రొటోకాల్‌ను పక్కన పెట్టి పరామర్శించటానికి వచ్చారు. అది ఆయన ఔదార్యానికీ, మా మధ్య ఉన్న వ్యక్తిగత సాన్నిహిత్యానికీ గుర్తు. నేనొక ఆత్మీయుడిని కోల్పోయాను. కలాం స్ఫూర్తితోనే ఆనాడు విజన్ 2020 కార్యక్రమంతో ఉమ్మడి రాష్ట్రాభివృద్ధికి కృషిచేశాను. ఎన్డీయే కన్వీనర్‌గా వున్నప్పుడు అబ్దుల్ కలాం పేరును రాష్ట్రపతి పదవికి ప్రతిపాదించింది నేనే.

నా ఆహ్వానం మీదే కొద్ది నెలల క్రితం అనంతపురం జిల్లాలో ప్రైమరీ సెక్టార్ మిషన్ కార్యక్రమంలో కలాం పాల్గొన్నారని చంద్రబాబు అన్నారు. 'గొప్ప కలలు కనండి, ఆ కలలు నిజం చేసుకోండి' అన్న కలాం సందేశం విద్యార్థిలోకానికి, యువతరానికి గొప్ప స్ఫూర్తి."

– ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి
నారా చంద్రబాబునాయుడు

❖

# 'ఉపాధి'లో ఏపిదే ముందంజ



కేంద్ర నిధులను సద్వినియోగం చేసుకుంటున్న ప్రభుత్వం
మూడు నెలల్లో 10 కోట్ల పనిదినాలు

గ్రామీణ పేదలకు పనులు కల్పించటంలో దేశంలో ఆంధ్రప్రదేశ్ ముందుంది. ఈ ఆర్థిక సంవత్సరంలో జూన్ 15 వరకు 100 రోజుల్లో 10 కోట్లకు పైగా పని దినాలు కల్పించి దేశంలోనే మన గ్రామీణాభివృద్ధి శాఖ మొదటి స్థానంలో ఉంది. రాష్ట్ర విభజన నేపథ్యంలో ఆర్థికంగా లోటు బడ్జెట్ కలిగిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం కేంద్ర నిధులను సద్వినియోగం చేసుకోవడంలో సఫలమైంది. ఎన్ఆర్‌జిఎస్ శాఖామాత్యులు చింతకాయల అయ్యన్నపాత్రుడు ఆధ్వర్యంలో అధికారులు పటిష్టమైన ప్రణాళికలు రూపొందించి, ఐటిని విస్తృతంగా ఉపయోగించుకోవడం ద్వారా సత్ఫలితాలు సాధించి కేంద్ర ప్రభుత్వం ప్రశంసలందుకున్నారు.

దేశంలో ఉపాధి హామీ పథకం ద్వారా పనులు కల్పించడంలో పథకం ప్రారంభం నుంచి ఏపికి ప్రత్యేక స్థానమున్నప్పటికి .. రాష్ట్ర విభజన నేపథ్యంలో ఈ పథకం ద్వారా రాష్ట్రానికి ఎక్కువ నిధులు రాబట్టాలని ఉపాధి హామీ పథకం శాఖను నిర్వహిస్తున్న మంత్రి అయ్యన్నపాత్రుడు చేసిన సూచనలతో గ్రామీణాభివృద్ధి కమీషనర్ బి రామాంజనేయులు ప్రభుత్వ యంత్రాంగాన్ని మరింత కార్యోన్ముఖులను చేశారు. ఉద్యోగులకు ఎక్కడికక్కడ టార్గెట్‌లు పెట్టి పనులు కల్పన వేగవంతం చేశారు. 100 రోజుల్లోనే అద్భుతమైన ఫలితాలు సాధించారు.

ఉపాధి హామీపథకం ద్వారా ఇప్పటికే ఈ ఏడాదిలో రూ .2200 కోట్లకు పైగా నిధులను గ్రామీణాభివృద్ధిశాఖ కేంద్రం నుంచి తెచ్చుకోగలిగింది. కేంద్ర ప్రభుత్వం నుంచి దేశ వ్యాప్తంగా లేబర్ బడ్జెట్ ను సమీక్షించిన కేంద్ర గ్రామీణాభివృద్ధి శాఖ పనితీరు సమీక్షా కమిటీ (పీఆర్సీ) సమావేశంలో వివిధ రాష్ట్రాల్లో ఈ పథకం అమలు తీరును పరిశీలించి గణాంకాలను వెల్లడించింది. ఆయా రాష్ట్రాలు రూపొందించిన లేబర్ బడ్జెట్‌లో ఎంతెంత శాతం పనిదినాలు సాధించారనే వివరాలు తెలిపింది. లేబర్ బడ్జెట్‌ను నూరు శాతం పుదుచ్చేరి, కేరళ రాష్ట్రాలు సాధించగా, గోవా, ఉత్తరప్రదేశ్‌లు తర్వాత అత్యధిక టార్గెట్‌లు సాధించాయి. అయితే ఈ రాష్ట్రాల్లో పనిదినాలు తక్కువగా ఉన్నాయి. లేబర్ బడ్జెట్ టార్గెట్లలో 80 శాతం సాధించి ఆంధ్రప్రదేశ్ మూడవ స్థానంలో ఉంది. దేశంలోని 33 రాష్ట్రాలు, కేంద్రపాలిత ప్రాంతాల్లో 44 కోట్లు పనిదినాలు ఉపాధి హామీ పథకం ద్వారా పనులు కల్పిస్తే, అందులో నాలుగో భాగం 10 కోట్లకు పైగా పనిదినాలు ఆంధ్రప్రదేశ్‌లో కల్పించారు. జూన్ 15 కల్లా 12.63 కోట్ల పనిదినాలు కల్పిస్తామని లేబర్ బడ్జెట్‌లో పేర్కొంటే అందులో 10.14 కోట్లు పనిదినాలు కల్పించారు. ఏపి గ్రామీణాభివృద్ధి శాఖలో పటిష్టమైన ప్రభుత్వ యంత్రాంగం, పథకానికి సాఫ్ట్‌వేర్ అనుసంధానం చేయడం ద్వారా ఈ ఫలితాలను సాధించారని కేంద్ర అధికారులు ప్రశంసించారు. ఆంధ్రప్రదేశ్ ఉపాధి హామీ పథకంలో దుబారా ఖర్చులు అదుపులోకి వచ్చాయి. ఈ పథకం నిర్వహణ కోసం కేంద్రం ఇచ్చిన నిధుల్లో 6 శాతం మించకుండా నిర్వహణా వ్యయం చేయాల్సి ఉండగా గతంలో ఎప్పుడూ 12 శాతానికి తగ్గకుండా ఖర్చు చేసేవారు. అయితే తాజాగా ఈ వ్యయం 4.1 శాతానికి తగ్గింది. ఐటీ ఉపకరణాల కొనుగోలు, సాఫ్ట్‌వేర్ విపరీత వాడకం, అధికసంఖ్యలో ఉద్యోగులు, వాహనాల అలవెన్సుతో భారీగా నిర్వహణా వ్యయమయ్యేది. 6 శాతం ఖర్చు కంటే ఎక్కువగా ఖర్చు చేస్తే ఆ నిధులు రాష్ట్ర ప్రభుత్వాలే భరించాలి. దీంతో ప్రతి ఏటా రాష్ట్ర ప్రభుత్వానికి అదనపు భారం పడేది. ఈ ఏడాది ప్రారంభంలోనే ఉపాధి హామీ శాఖకు చెందిన అధికారులు నిర్వహణా వ్యయం తగ్గించేందుకు చర్యలు తీసుకున్నారు. అనవసర ఖర్చులు భారీగా తగ్గించి నిర్వహణా వ్యయం అదుపులోకి తీసుకు రావటం జరిగింది. ఐటీ సపోర్ట్ చేస్తున్న టీసిఎస్‌తో సంప్రదించి దాని వ్యయం కూడా భారీగా తగ్గించారు. దీంతో పాటు గ్రామీణ ప్రాంతాల్లో ఉపాధి పనులు ముమ్మరంగా జరగడంతో నిర్వహణ వ్యయం సాధారణ శాతం 6 కంటే తగ్గి 4.1 శాతానికి వచ్చింది. అధికారులతో నిరంతర సమీక్షలు నిర్వహించటం, ఎప్పటికప్పుడు పర్యవేక్షించటం ద్వారా మొదటి స్థానం సాధించినట్లు ఎన్ఆర్‌జిఎస్ శాఖ మంత్రి చింతకాయల అయ్యన్నపాత్రుడు తెలిపారు.



లెక్కల మురళి
పీఆర్ఓ, పంచాయితీరాజ్ శాఖ

# 'మీ భూమి' వెబ్ పోర్టల్

## సమస్త సమాచారం ఇక మీ చేతుల్లోనే



మీ భూమి సమాచారం ఇంకెంత మాత్రం రహస్యం కాదు. ఏఏ సర్వే నెంబర్లలో మీ భూములు వున్నాయి. ఏ అడంగల్ లో వున్నాయి? సాగు భూమి విస్తీర్ణం ఎంత? ఒక్క క్లిక్ చేస్తే మీ పొలానికి సంబంధించి సమస్త సమాచారం కళ్లముందు ప్రత్యక్షమవుతుంది. ఇకపై ప్రజలు తమ భూముల వివరాలు తెలుసుకోవాలంటే రెవెన్యూ కార్యాలయాల చుట్టూ తిరగనక్కరలేదు.

పారదర్శక, జవాబుదారీ పాలనలో భాగంగా రెవెన్యూ శాఖ రూపొందించిన 'మీ భూమి' వెబ్ పోర్టల్ ను, ఆండ్రాయిడ్ అప్లికేషన్ (యాప్) ను ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు ప్రారంభించారు. అధికారులు ఎప్పటికప్పుడు ఈ వెబ్ పోర్టల్ లో తాజా సమాచారాన్ని పొందుపరచాలని ముఖ్యమంత్రి సూచించారు. ఆధార్‌తో అనుసంధానించాలని కోరారు.

భూమి రికార్డుల నిర్వహణను మరింత పారదర్శకంగా అమలుచేయటానికి ముఖ్యమంత్రి చంద్రబాబు ఆదేశాలతో రెవెన్యూశాఖ ఈ వెబ్ పోర్టల్ ను తీర్చిదిద్దింది. భూమి రికార్డులయిన అడంగలు, 1-బి.ఎఫ్.ఎం.బి,. గ్రామ పటాలను 'మీ భూమి' ద్వారా తెలుసుకోవటం ఇక ఎంతో తేలిక.

www.meebhoomi.ap.gov.in కు లాగిన్ అయితే చాలు. వివరాలు తేలిగ్గా తెలుస్తాయి.

రాష్ట్రంలోని 2.24 కోట్ల సర్వే నెంబర్ల వివరాలు, 72 లక్షల పట్టాదారుల వివరాలను డిజిటలైజ్ చేసి ప్రజలకోసం 'మీ భూమి' లో వుంచారు. ఇందులో అన్ని సర్వేనెంబర్లకు సంబంధించిన విస్తీర్ణం, వాటి వర్గీకరణ, పట్టాదారుని పేరు తదితర వివరాల రికార్డులున్నాయి.

1-బి: గ్రామంలో ఒక వ్యక్తికి వివిధ రకాలుగా లభించిన భూమి హక్కు వివరాలను నమోదు చేసే రికార్డు ఇది. ఇందులో ఖాతాదారుని పేరు, అతని

> బూజు పట్టిన పాత రెవిన్యూ విధానాలకు రాష్ట్ర ప్రభుత్వం త్వరలో చెల్లుచీటి ఇవ్వనుంది. రానున్న రోజులలో పట్టాదార్ పాస్ పుస్తకాలు, టైటిల్ డీడ్స్ వంటి పద్ధతులకు స్వస్తి చెప్పాలని ప్రభుత్వం యోచిస్తోంది. ఆదాయ, నివాస ధృవీకరణ పత్రాలు, జనన ధృవీకరణ పత్రాలకు మంగళం పలికి ఇక అన్నీ ఆధార్ కార్డుకు అనుసంధానం చేయాలని ప్రభుత్వం ఆలోచిస్తోంది.

తండ్రి పేరు, భూములు వివరాలు, ఎలా అతనికి భూములు సంక్రమించాయన్న వివరాలను పొందుపరిచారు.

పొలం కొలతల పుస్తకం (ఎఫ్.ఎం.బి) గ్రామాల్లోని భూములన్నింటినీ సర్వే నెంబర్ వారీగా సబ్ డివిజన్ వారీగా కొలతలు, విస్తీర్ణం సహా తెలియజేసే రిజిస్టర్. ఇందులో ఒక్కో సర్వే నెంబర్కు ఒక్కో పటం వున్నాయి. వీటన్నింటినీ ఒక క్రమంలో పెట్టి తయారు చేసినదే పొలం కొలతల పుస్తకం (ఎఫ్.ఎం.బి).

గ్రామాల్లోని భూములన్నింటినీ రేఖాచిత్రపటాల్లో చూపించే గ్రామపటాన్ని వెబ్ పోర్టల్లో వుంచారు. ఆధార్ లింక్ వివరాలను ఇచ్చారు. ఒక వ్యక్తి తన భూమి వివరాలతో ఆధార్ నెంబరును అనుసంధానం చేసిందీ లేనిదీ తెలుసుకోవటం తేలిక. అనుసంధానం కాని పక్షంలో తన ఆధార్ నెంబర్ను నమోదు చేసి ఆధార్ లింకింగ్ చేసుకునే వీలు కల్పించారు. అనుసంధానం చేసిన ఆధార్ నెంబర్ వివరాలకు మాత్రం సంబంధిత తహసిల్దార్ కార్యాలయంలో సంప్రదించాలి.

రెవెన్యూ మంత్రి, ఉప ముఖ్యమంత్రి కె.ఇ.కృష్ణమూర్తి పర్యవేక్షణలో అధికారులు రెండు నెలలుగా శ్రమించి ఈ పోర్టల్ను తీర్చిదిద్దారు. భూముల వివరాలు ఇప్పటిదాకా రెవెన్యూ అధికారుల దగ్గర లేదా, గ్రామాధికారుల దగ్గర వున్నాయి. ప్రజల అవస్థలను అధ్యయనం చేసిన ప్రభుత్వం వారి కష్టాలు తీర్చేలా 'మీభూమి' పోర్టల్కు రూపునిచ్చింది. సర్వే నెంబరు లేదా ఖాతా నెంబరు ద్వారా అడంగలు, 1-బి రిపోర్టులను పొందవచ్చు. మీ భూమి వివరాల్లో ఏమైనా తప్పులున్నా, లేదా మ్యూటేషన్ వివరాలు చూడాలంటే సంబంధిత తహసిల్దార్ కార్యాలయంలో కానీ, మీసేవా కేంద్రాలలో కానీ దరఖాస్తు చేస్తే 45 రోజులలో అక్షర దోషాలు లేకుండా సరిచేసే వీలు కల్పించారు. కేవలం వ్యక్తిగత భూములు వివరాలే కాకుండా గ్రామ అడంగల్లో సమాచారాన్ని సైతం ఈ పోర్టల్ ద్వారా పొందవచ్చు. జిల్లా, గ్రామం, మండలం పేర్లను మీభూమి పోర్టల్లో ఇచ్చిన ఆప్షన్లో ఎంచుకొని తర్వాత సర్వేనంబర్ని టైప్ చేస్తే తేలిగ్గా వివరాలు తెలుస్తాయి.

## రెవిన్యూ వ్యవస్థలో విప్లవాత్మక సంస్కరణలు

బూజు పట్టిన పాత రెవిన్యూ విధానాలకు రాష్ట్ర ప్రభుత్వం త్వరలో చెల్లుచీటి ఇవ్వనుంది. రెవిన్యూశాఖ 'మీ భూమి' పేరుతో ఆన్లైన్ పోర్టల్ను ప్రారంభించి భూముల వివరాలను పొందుపర్చడంతో రానున్న రోజులలో పట్టాదార్ పాస్ పుస్తకాలు, టైటిల్ డీడ్స్ వంటి పద్ధతులకు స్వస్తి చెప్పాలని ప్రభుత్వం యోచిస్తోంది. అలాగే, ఆదాయ, నివాస ధృవీకరణ పత్రాలు, జనన ధృవీకరణ పత్రాలకు మంగళం పలికి ఇక అన్నీ ఆధార్ కార్డుకు అనుసంధానం చేయాలని ప్రభుత్వం ఆలోచిస్తోంది.

ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు రెవిన్యూ వ్యవస్థలో తీసుకురానున్న సంస్కరణలపై సమీక్ష జరిపారు. రెవిన్యూ వ్యవస్థను డిజిటలైజ్ చేసే ప్రక్రియను వేగవంతంగా పూర్తిచేయాలని ముఖ్యమంత్రి ఆదేశించారు. పట్టాదార్ పాస్ పుస్తకాలు, టైటిల్ డీడ్స్ను రద్దుచేసి ఆన్లైన్లో వివరాలు వుంచడం ఒక విప్లవాత్మక చర్యగా ముఖ్యమంత్రి అభివర్ణించారు. భవిష్యత్తులో ఇక వ్యవసాయ రుణాలు వగైరా ప్రక్రియ మొత్తం మీ భూమి పోర్టల్ ఆధారంగానే జరుగుతుందని చెప్పారు. ఈ పోర్టల్లో వివరాలు ప్రింట్ తీసుకుని ఇస్తే బ్యాంకర్లు రుణాలు మంజూరుచేసే విధానం అమల్లోకి రానున్నదని వివరించారు.

రెవిన్యూ సర్వే కోసం ఉపయోగించే 450 ఈటీఎస్ (ఎలక్ట్రానిక్ టోటల్ సిస్టమ్) మిషన్లను రూ.20 కోట్లు వెచ్చించి కొనుగోలు చేయాలని ఈ సమావేశంలో నిర్ణయించారు. సాధారణ పద్ధతుల్లో రోజుకు కేవలం 10 ఎకరాలలో చేసే ల్యాండ్ సర్వేని ఈ మిషన్ల ద్వారా 100 నుంచి 150 ఎకరాలలో చేసే వీలు చిక్కుతుందని అధికారులు సీయం దృష్టికి తీసుకువచ్చారు. ఇప్పటికే 273 మిషన్లను రాష్ట్రంలోని వివిధ జిల్లాలలో వినియోగిస్తున్నారు. కొత్త మిషన్ల రాకతో సర్వే పనుల్లో వేగం పుంజుకుంటుందని అధికారులు భావిస్తున్నారు. డిజిటల్ ప్రక్రియకు ఇది ఎంతగానో ఉపకరిస్తుందని ల్యాండ్ అడ్మినిస్ట్రేషన్ ఛీఫ్ కమిషనర్ అనిల్ చంద్ర పునేఠ చెప్పారు.

ఇక మీదట ఆధార్ కార్డు అన్ని ధృవీకరణ పత్రాలకు కీలకం కానున్నది. నివాస, ఆదాయ, జనన ధృవీకరణ పత్రాలకు ఆధార్ కార్డులో వున్న సమాచారమే ఆధారం కానున్నది. ఆ విధమైన ప్రక్రియను త్వరితగతిన పూర్తిచేయాలని ముఖ్యమంత్రి ఆదేశించారు. అలాగే, రాష్ట్రంలో 3 కేటగిరిలుగా రేషన్ కార్డుల జారీ ప్రక్రియ జరపనున్నారు. బీపీఎల్, ఏపీఎల్, ట్యాక్స్ పేయర్స్ కేటగిరిలుగా ఆదాయవర్గాల విభజన జరగనుంది. కుల ధృవీకరణ పత్రాల జారీపై రాష్ట్రంలో ముందుగా అధ్యయనం జరిపి తదుపరి నిర్ణయం తీసుకుందామని ముఖ్యమంత్రి చెప్పారు. రాష్ట్రంలో త్వరలో సోషియో ఎకనమిక్ డేటా నమోదు కార్యక్రమం జరగనుందని, ఈ సర్వేలో వచ్చిన డేటా ఆధారంగా కుల ధృవీకరణ పత్రాలు జారీచేయవచ్చునని అన్నారు.

గ్రామస్థాయిలో పనిచేసే వీఆర్వోలు, అంగన్వాడీ వర్కర్లు, ఎఎన్ఎంలు, పంచాయతీ కార్యదర్శులు, వ్యవసాయాధికారులు, ఉన్నత పాఠశాలల ప్రధానోపాధ్యాయులకు నెల రోజులలోపు ట్యాబ్లు అందజేయాలని ఈ సమావేశంలో నిర్ణయించారు. పట్టణ ప్రాంతాలలో అనుమతి లేని భూములలో ఇళ్లు నిర్మించుకున్న పేదవర్గాలకు ఇళ్ల పట్టాలు ఇవ్వాలని కూడా సమావేశంలో నిర్ణయించారు. దీనిపై అధికారులు పూర్తి వివరాలు సేకరించాలని, ఈ నివేదిక ఆధారంగా కేబినెట్ సమావేశంలో నిర్ణయం తీసుకుందామని ముఖ్యమంత్రి అన్నారు. మీ భూమి పోర్టల్లో భూముల వివరాలు, పంటల వివరాలు ఎప్పటికప్పుడు అప్డేట్ చేయడానికి గ్రామ పాలనాధికారులు, వ్యవసాయాధికారులు, జల వనరుల శాఖ అధికారులు సమన్వయంగా పనిచేయాలని సూచించారు. మ్యుటేషన్ విధానంలో కూడా మార్పులు తీసుకురావాలని ముఖ్యమంత్రి కోరారు. కర్నాటకలో 'భూమి' పేరిట అమలవుతున్న కార్యక్రమాన్ని పరిశీలించి ఇక్కడ కూడా తగిన మార్పులు చేయాలని సూచించారు. భూముల విక్రయాలు, కొనుగోళ్ల వివరాలన్నీ మీ భూమి పోర్టల్లో ఎప్పటికప్పుడు అప్డేట్ అవ్వాలని ఆదేశించారు. కొత్తగా 82 మంది కంప్యూటర్ ఆపరేటర్ల నియామకాలకు సీయం అంగీకరించారు. రెవిన్యూ సర్వే అకాడమీ ఏర్పాటుకు రూ.50 కోట్లు అందజేస్తున్నట్టు ముఖ్యమంత్రి తెలిపారు.



నీరుకొండ ప్రసాద్

# ఇదిగో ఆంధ్రనగరి...

## అమరావతి కేంద్ర ప్రాంత స్వరూపం ఆవిష్కరణ





ఇది అమరావతి ముఖద్వారం. అన్ని హంగులున్న అత్యాధునిక రాజధాని ప్రవేశం కూడా అంతే ఉజ్వలంగా ఉండాలన్న ఉద్దేశంతో విజయవాడ వైపు ఈ అద్భుత నిర్మాణం ఉంటుంది. కృష్ణా నది మీద వినూత్నశైలిలో నిర్మించే వంతెన ప్రత్యేక ఆకర్షణ.

అలనాటి అమరావతి తొలి అడుగై నడిచిన వెయ్యేళ్ల చరిత్ర తీసుకునే మలుపుకు కారణం, కార్యమూ కూడా తానే అయ్యి నిలిచిన క్రాంతదర్శి చంద్రబాబు. ఆ కర్మవీరుడు మరో వెయ్యేళ్ల దీర్ఘకాలిక భవితవ్యాన్ని స్వప్నించి, వేనవేల రెప్ప వేయకుండా ఎదురుచూసిన అభ్యుదయాన్ని సాధించి, శంకుస్థాపన చేయబోతున్న మహానగరం, ఆంధ్రనగరి, అమరావతి!

ఆంధ్రప్రదేశ్ ప్రజల ఆకాంక్షలకు అద్దం పట్టేలా ఉజ్వలమైన, విభిన్నమైన, సమ్మిళితమైన, అధునాతనమైన నగరంగా రాజధాని ఉండాలన్న ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడి ఆకాంక్షలు ప్రతిబింబించేలా నవ్యాంధ్ర రాజధాని ప్రధాన ప్రాంత (సీడ్ క్యాపిటల్) బృహత్ ప్రణాళిక తయారైంది.

మరో వెయ్యేళ్లపాటు చెక్కుచెదరకుండా చరిత్రలో నిలిచిపోయే సుస్థిర రాజధానిని నిర్మించాలన్న ఆశయాలు, ఆకాంక్షలకు అనుగుణంగా, నిర్మాణ రంగంలో ఉన్న అనుభవాన్ని, సాంకేతిక పరిజ్ఞానాన్ని జోడించి సింగపూర్ ప్రభుత్వం ఈ మాస్టర్ ప్లాన్ రూపొందించింది. సింగపూర్ మంత్రి ఈశ్వరన్ తన స్వహస్తాలతో ముఖ్యమంత్రికి అందించిన ఈ ప్రణాళికతో నవ్యాంధ్ర రాజధాని అమరావతి 'భారతదేశ తూర్పు ముఖద్వారం' కానుంది.

నవ్యాంధ్ర రాజధాని అంటే చూడచక్కటి దారులు... ఆకాశ హర్మ్యాలు... ఆకు పచ్చని ఉద్యానవనాలు... ఆ పక్కనే నిండుగా పారే కృష్ణమ్మ సోయగాలు పర్యాటకులకు కనువిందు చేయనున్నాయి. అద్భుత నిర్మాణ కౌశలంతో అసెంబ్లీ, సచివాలయం, రాష్ట్ర ఉన్నత న్యాయస్థానం, ఇతర ప్రభుత్వ కార్యాలయాల సముదాయాలు చూపరులను ఆకట్టుకోనున్నాయి. 2050 నాటికి నవ్యాంధ్ర రాజధాని పరిధిలో కోటి మందికిపైగా ప్రజలు నివసించే వీలుండటాన ఈ ప్రణాళికకు 'అమరావతి: ఆంధ్రప్రదేశ్ ప్రజా రాజధాని–2050' అని నామకరణం చేయడం కూడా తగినట్లుగా ఉంది. దసరా నాటికి ఈ కసరత్తు పూర్తి చేసి అప్పటి నుంచి నిర్మాణ పనులు వేగంగా చేపట్టాలని రాష్ట్ర ప్రభుత్వం భావిస్తోంది. 2018 డిసెంబర్ నాటికి కీలక రాజధాని ప్రాంతంలో మొదటి దశ నిర్మాణాలు పూర్తి కావాలన్నది ప్రభుత్వ లక్ష్యం. మొదటి దశలో ప్రభుత్వ భవనాలు, గేట్‌వేలు, వాటర్ ఫ్రంట్ నిర్మాణాలు, అంతర్గత రహదారులు, పార్కులు, డౌన్‌టౌన్‌లోని వాణిజ్య భవనాల నిర్మాణం పూర్తవుతాయి. వచ్చే ఎన్నికల నాటికి కీలక రాజధానికి ఒక స్వరూపం ఇచ్చేందుకు ప్రభుత్వం ప్రయత్నిస్తోంది.

### రాజధాని బృహత్ ప్రణాళికలోని ముఖ్యాంశాలు

- బెజవాడ వైపు నుంచే భారీ ఎంట్రెన్స్.. గేట్ వే
- 30 కిలోమీటర్ల పొడవునా వినోద స్థలి.. వాటర్‌ఫ్రంట్
- ఆర్థిక, వాణిజ్య, పారిశ్రామిక కూడలి.. డౌన్‌టౌన్
- ఒకేచోట అసెంబ్లీ, సచివాలయం.. గవర్నమెంట్ కోర్
- 5 దశల్లో 'కీలక రాజధాని' నిర్మాణం.. 2018లోపు తొలి దశ
- 40 శాతం పార్కులు, ఖాళీ స్థలాలు.. మాస్టర్‌ప్లాన్ ఆవిష్కరణ
- రాజధాని ప్రాంత అథారిటీ... 7420 చదరపు కిలోమీటర్లు
- నగర విస్తీర్ణం 125 చ.కి.మీ. – సీడ్ క్యాపిటల్ 16.9 చ.కి . మీ.

- అత్యాధునిక హంగులతో 100 శాతం వాస్తు ప్రమాణాలతో నిర్మాణం
- అమరావతికి అక్టోబర్ 22న శంకుస్థాపన –దసరా నుంచి పనులు మొదలు
- భారత్, సింగపూర్, జపాన్ ప్రధానమంత్రుల సమక్షంలో శంకుస్థాపన
- మూడేళ్లలో తొలి దశ పూర్తి – నిదురించని నగరంగా నవ్యాంధ్ర రాజధాని
- ప్రధాన నిర్మాణాలన్నీ నదీముఖంగా ఉండేలా ప్రణాళిక
- వెనిస్ నగరిలా జల విహారం – రాజ్‌పథ్ తరహా రహదారులు
- పర్యావరణాన్ని కాపాడుకుంటూ... కాలుష్యాన్ని నియంత్రిస్తూ 'హరిత వర్ణం' సంతరించుకుంటుంది
- రాష్ట్రపతి భవన్ తరహాలో అధికార కేంద్రం
- ఉద్ధండ్రాయునిపాలెం – ఐటీ ప్రాంతం
- స్విస్ చాలెంజ్ విధానంలో అమరావతి అభివృద్ధిలో దీర్ఘకాలిక భాగస్వాములు కావాలని సింగపూర్, జపాన్ ప్రభుత్వాలని కోరిన ఏపీ ప్రభుత్వం
- రాజధాని కేంద్రప్రాంతంలో ప్రజా రవాణాకు పెద్ద పీట
- కేంద్ర ప్రాంతంలో 12 కి.మీ. మెట్రోరైలు నెట్ వర్క్
- 15 కి.మీ బీఆర్‌టీఎస్ మార్గాలు
- డౌన్ టౌన్ రోడ్డు 7 కి.మీ.
- ప్రధాన, ఉప ప్రధాన రోడ్లు 26 కి.మీ.
- అనుసంధాన రోడ్ల పొడవు 56 కి.మీ.
- నగరంలో చక్కటి నడక మార్గాలు, సైకిల్ కోసం ప్రత్యేక దారులు
- మోటారు వాహన రహిత ప్రయాణం పొడవు 25 కి.మీ.
- రాజధాని నగరంలో ఒకచోట నుంచి మరోచోటకు వేగంగా చేరుకునేందుకు 135 కిలోమీటర్ల (మెట్రో, జాతీయ హైస్పీడు) రైలు మార్గాలకు రూపురేఖలు



ఇది అమరావతి నగర వ్యాపారకూడలి. సకల సౌకర్యాలతో అంతర్జాతీయ స్థాయి వ్యాపార కేంద్రంగా ఈ ప్రదేశం విరాజిల్లనుంది.



చిత్రంలో కుడివైపున ఉన్న జంట ఆకాశహర్మ్యాలు అమరావతికి ప్రత్యేక గుర్తింపునిస్తాయి. ఎడమ వైపున విశిష్ట ఆకృతితో ఉన్న భవనం సాంస్కృతిక కేంద్రం.

సిద్ధం

- నగరంలో నిర్మితం కానున్న రోడ్ల పొడవు మొత్తం 1000 కి.మీ.

రాజధాని కేంద్ర (కృష్ణానదిని ఆనుకుని తాళ్ళాయపాలెం – లింగాయపాలెంల మధ్య కేంద్ర ప్రాంతం) ప్రాంతం ఇలా...

| |
|---|
| విస్తీర్ణం – 16.9 కి.మీ. |
| జనాభా – 3లక్షలు |
| ప్రభుత్వ ఉద్యోగాలు – 62 వేలు |
| ఉపాధి – 6.35 లక్షల మందికి |

2035 నాటికి సీఆర్‌డీఏ పరిధిలో...

- జనాభా – **1.1** కోట్లు
- ఉద్యోగ, ఉపాధి – **33** లక్షల మందికి

2050 నాటికి సీఆర్‌డీఏ పరిధిలో...

- జనాభా – **1.35** లక్షలు
- ఇతర ఉద్యోగ, ఉపాధి – **56** లక్షలు

రాజధాని నిర్మాణం అయ్యాక తొలి పదేళ్ళలో 3.5 లక్షల మందికి ఉపాధి

ఇవీ హబ్ లు...

| | |
|---|---|
| నందిగామ | పర్యాటక |
| అమరావతి | వారసత్వ సంపద |
| సత్తెనపల్లి | భారీ పరిశ్రమలు |
| గుంటూరు | ఆగ్రో ప్రాసెసింగ్ |
| తెనాలి | తేలికపాటి పరిశ్రమలు |
| పామర్రు | బహుళార్థ రవాణా పార్కు |
| గుడివాడ | ఎలక్ట్రానిక్ |
| గన్నవరం | విమానాశ్రయ పరిశ్రమలు |
| నూజివీడు | ఆహారోత్పత్తులు |

## అమరావతి ముఖద్వారం

హైదరాబాద్ నుండి విజయవాడ వెళ్ళే మార్గంలో ఇబ్రహీంపట్నం వద్ద కృష్ణానది వంతెనపై అమరావతి గేట్‌వే నిర్మాణమవుతుంది. అమరావతి గేట్‌వే ప్రాంతంలో సీట్ గ్యాలరీ, అమరావతి ప్లాజా,

ఆకర్షణీయ, పర్యావరణహిత, స్వయం సమృద్ధి నగరంగా అమరావతి ఉంటుంది. ఆంధ్రప్రదేశ్ ప్రజల గౌరవానికి ప్రతీకగా,ఆకాంక్షలకు అద్దం పట్టేలా, మంచి భవిష్యత్తుకు కేంద్రంగా రాజధానిని నిర్మిస్తాం. ప్రతి ఒక్కరూ ఒక్క ఇటుకైనా, అంత డబ్బైనా ఇచ్చి, రాజధాని నిర్మాణంలో నా భాగస్వామ్యం, నా కష్టం కూడా ఉందని గర్వించాలి.

– ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు

విశ్వవిద్యాలయం, సాంస్కృతిక కేంద్రం, నదీ తీర పార్కులు ఏర్పాటు అవుతాయి. మెట్రోరైలు, హైస్పీడు రైలు, ఆకాశమార్గాలు, కూడా ఈ ప్రవేశం ద్వారం నుంచే అమరావతి లోపలికి వెళ్ళనున్నాయి.

## వాణిజ్య నగరి

రాజధాని ప్రధాన ప్రాంతంలో వాణిజ్య వ్యాపార కేంద్రం అమరావతి, డౌన్‌టౌన్ వాణిజ్య భవనాలు, వివిధ సంస్థల కార్యాలయ భవనాలు కొలువైన ప్రాంతాన్ని అంతర్జాతీయంగా డౌన్‌టౌన్ అని పిలుస్తారు. ఈ ప్రాంతంలో కేఫేటేరియాలు, రెస్టారెంట్లు, హోటళ్ళు, ఎగ్జిబిషన్ సెంటర్లు, కనెన్షన్ సెంటర్, క్రీడా సదుపాయాలు ఏర్పాటు అవుతాయి. నవ్యాంధ్రకు ఆర్థికంగా, ఉపాధి కల్పనాపరంగా డౌన్‌టౌన్ అత్యంత కీలకం కానుంది.

## నదీ ముఖనగరి

ఇది అమరావతి వాటర్‌ఫ్రంట్, ఈ ప్రాంతం ప్రధానంగా వినోద పర్యాటక కేంద్రంగా ఉంటుంది. జలక్రీడలు, రిసార్ట్స్, పర్యాటక ఆకర్షణీయ కేంద్రాలు, ఏర్పాటు చేస్తారు. 30 కిలోమీటర్ల వాటర్‌ఫ్రంట్‌ను అభివృద్ధి చేయనున్నారు. దీని సమీపంలో ఉన్న భవానీ ద్వీపాన్ని కూడా పెద్ద పర్యాటక కేంద్రంగా తీర్చిదిద్దనున్నారు. దీనితోపాటు మరిన్ని ద్వీపాలను కూడా అభివృద్ధి చేస్తారు.

## అమరావతి పాలనా కేంద్రం

నవ్యాంధ్ర పరిపాలనా కేంద్రం ముఖద్వారం హైదరాబాద్ వైపు ఉంటే, పాలనా కేంద్రం గుంటూరు వైపు ఉండేలా ప్రణాళిక రచించారు. ఢిల్లీలో నార్త్‌బ్లాక్, సౌత్‌బ్లాక్ రాష్ట్రపతి భవన్ గుర్తుకుతెచ్చేలా దీనిని ప్లాన్ చేశారు. ప్రభుత్వ కార్యాలయాలు, హైకోర్టు, శాసనసభ, సచివాలయం, మంత్రిత్వశాఖలు ఇక్కడే ఏర్పాటు అవుతాయి. మధ్యలో ఉండే ముఖ్యభవనంలో రాజభవన్ లేదా అతిథి గృహం ఏర్పాటు చేయాలని యోచిస్తున్నారు. రాజధానికి బ్రహ్మస్థానంలో వెయ్యి పడకల ఆసుపత్రిని నిర్మించాలని నిర్ణయించారు. నగర వైద్య అవసరాలు సంపూర్ణంగా తీర్చేలా దీనిని ఏర్పాటు చేస్తారు.

## సా'మాన్యుల' కలల ఫలశ్రుతి

వేలమంది అన్నదాతలు స్వచ్ఛందంగా చేసిన త్యాగాలే దన్నుగా లేస్తున్న మహానగరం అమరావతి ఒక్కటే. ఒక మహానిర్మాణానికి పునాదిరాళ్లై, రేపటి మహోదయానికి కాంతిబీజాలై, 'మేము సైతం' అంటూ జనసామాన్యం భుజం భుజం కలిపిన చరిత మరే నగరానికీ లేదు.

మట్టి పరిమళాల పల్లెలు అంతర్భాగమైన, భిన్నత్వంలోని ఏకత్వాన్ని సొంతం చేసుకున్న అచ్చమైన భారతీయ, ఆదర్శ నగరం– అమరావతి.

పల్లకిలో చంద్రబాబు ప్రభువు కాదు; నవ్యాంధ్రప్రదేశ్‌ని అభ్యుదయాల పల్లకి ఎక్కించి ప్రగతి బాటలో మోసుకుపోతున్న మొదటి బోయి ఆయనే! ఈ మహాయానంలో అమరావతి మొదటి మజిలి అయితే, అందుకు అంకురార్పణగా త్వరలో జరగబోయే శంకుస్థాపనే తొలి అడుగు!



సున్నా నరేష్

# రాజకీయానికి మీడియా ముసుగు

## ప్రజాస్వామ్యానికే పెనుముప్పు




మీడియా రంగంలోకి పాత్రికేయ విలువలతో ఎటువంటి సంబంధం లేని పెట్టుబడిదారులు చొరబడ్డారు. దీనివల్ల జరుగుతున్న అనర్థాల గురించి ప్రపంచ వ్యాప్తంగా చర్చ జరుగుతోంది. తమ వ్యాపార ప్రయోజనాలను కాపాడుకోవడం కోసం, రాజకీయ ప్రయోజనాలను పొందడం కోసం, ప్రజాభిప్రాయాన్ని తమ అవసరాలకు అనుగుణంగా మలచడం కోసం, అధికారంలో ఉన్న ప్రభుత్వాల ప్రాపకం పొందడం కోసం, అధికార వ్యవస్థను బ్లాక్ మెయిల్ చేయడం కోసం మీడియాను ఒక పావుగా ఉపయోగించుకోవడం ఇటీవల కాలంలో ప్రజాస్వామ్య వ్యవస్థకు పెనుప్రమాదంగా మారింది.

రాజకీయ పార్టీలే నేరుగా మీడియా రంగంలోకి చొరబడి, పత్రికారంగాన్ని మరింత గందరగోళంలోకి నెట్టడం ఇటీవలి ఆందోళనకర పరిణామం. ఈ జాడ్యం మన దేశంలో, మరీ ముఖ్యంగా తెలుగు రాష్ట్రాల్లో వేళ్లూనుకుంటోంది. దీనిని త్వరగా కూకటివేళ్లతో పెకిలించకపోతే, పత్రికా స్వేచ్ఛ అనే మాట ప్రహసనంగానే కాక, స్వార్థపర శక్తుల చేతిలో ఒక ప్రమాదకర ఆయుధంగా మారే అవకాశం ఉంది. ప్రజాస్వామ్య పునాదులే బీటలు వారే ప్రమాదం ఉంది. నిజానికి ఇప్పటికే, తెలుగు పత్రికా రంగంలో ఇటువంటి ఆందోళనకర పరిస్థితి కనిపిస్తోంది. టెలివిజన్ మీడియా రంగంలోకి వ్యాపారప్రయోజనాలే ప్రధానంగా పలువురు ప్రవేశించడంతో, పత్రికావిలువల పతనం ఇటీవల కాలంలో కాంతివేగంతో జరుగుతోంది. ఇచ్చే సమాచారం గురించి సరైన అవగాహన లేకపోవడం, అధ్యయనం లేకపోవడం, పరిశోధన ద్వారా విషయాన్ని వెలికితీయడం కాకుండా, గాలి కబుర్లు, అభాండాలనే నిజాలుగా చూపడం, ఆయా విషయాల మీద తగిన పరిజ్ఞానం లేని పాత్రికేయులు అన్ని అంశాల మీద తీర్పులు ఇవ్వడం ఒక ఎత్తు.

సంచలనం పేరుతో దురుద్దేశపూర్వకంగా అవాస్తవాలను, వక్రీకరణలను, పాక్షిక సత్యాలను ప్రసారం చేయడం, తెలిసీ

కొత్తగా పార్టీలు స్థాపించి, పత్రికారంగంలోకి జొరబడి, తమ పార్టీ ప్రయోజనాలను కాపాడుకోవడమే కాకుండా, ప్రత్యర్థి పార్టీల మీద దుమ్మెత్తిపోయడానికి, అబద్ధాలు ప్రచారం చేయడానికి పత్రికారంగాన్ని ఒక ముసుగుగా వాడుకుంటున్నారు. ఈ ధోరణికి ఇప్పుడే అడ్డుకట్ట వేయకపోతే, ప్రజల్లో ముందుముందు పత్రికాస్వేచ్ఛ పట్ల వ్యతిరేక వైఖరి ప్రబలే ప్రమాదం ఉంది.

ఆరోపణలను వాస్తవాలుగా రాయడం, కావాలని అభాండాలు వేయడం, చేతిలో పత్రికో, టివి ఛానలో ఉందని బురద చల్లడం, నందిని పంది చేయడం మరో ఎత్తు.

మొదటి సమస్య పాత్రికేయ ప్రమాణాలకు, విశ్వసనీయతకు సంబంధించిన అంశం. యాజమాన్యాలు దృష్టి సారిస్తే, ఈ లోపాలను సరిచేసుకోవడం పెద్ద సమస్య కాదు. రెండో ధోరణి కుట్రపూరితమైంది. లక్ష్యం ప్రజాహితం కానప్పుడు, దుర్బుద్ధితో మీడియాను గుప్పిట్లో పెట్టుకున్నప్పుడు దానికి విరుగుడు లేదు. మీడియా రంగానికి సంబంధించి విధివిధానాల్లో చట్టం ద్వారా మార్పులు చేయడం తప్ప.

ఇటీవలి కాలంలో కొన్ని తెలుగు పత్రికలు, టెలివిజన్ చానళ్లలో పత్రికాస్వేచ్ఛ దుర్వినియోగం పతాక స్థాయికి చేరుకుంది. దీనికి ప్రధాన కారణం రాజకీయ పార్టీలే స్వయంగా పత్రికలు, చానళ్లు నడపటానికి సిద్ధం కావడం. మనదేశంలో వ్యాపారవేత్తలు గానీ, రాజకీయ పార్టీలు గానీ మీడియా రంగంలోకి రావడం మీద ఎటువంటి ఆంక్షలు లేవన్న మాట నిజమే. పరిపూర్ణ ప్రజాస్వామ్య విలువలు పాటించాలన్న ఉద్దేశ్యంతో ఆనాడు పత్రికారంగానికి అపరిమిత స్వేచ్ఛ ఇచ్చారు. అయితే, ఈ స్వేచ్ఛను అడ్డం పెట్టుకొన్న కొన్ని రాజకీయ పార్టీలు మీడియా ముసుగు తొడుక్కొని, ప్రజాస్వామ్యానికే మూలస్థంభంగా భావించే ఈ రంగాన్ని తమకు ఊడిగం చేసేందుకు ఉపయోగించుకుంటున్నాయి.

రాజకీయ పార్టీలు, వ్యాపార సంస్థలు పత్రికారంగంలోకి ప్రవేశించడం ఎప్పటినుంచో ఉన్నా, ఇంతపెద్ద ఎత్తున ఈ రంగంలోకి అరాచక శక్తులు ప్రవేశించడం మాత్రం ఇటీవలి కాలంలో ప్రబలింది. కొత్తగా పార్టీలు స్థాపించి, పత్రికారంగంలోకి జొరబడి, తమ పార్టీ ప్రయోజనాలను కాపాడుకోవడమే కాకుండా, ప్రత్యర్థి పార్టీల మీద దుమ్మెత్తిపోయడానికి, అబద్ధాలు ప్రచారం చేయడానికి, ప్రత్యర్థి పార్టీల నాయకుల పరువుప్రతిష్టలను దిగజార్చడానికి పత్రికారంగాన్ని ఒక ముసుగుగా వాడుకుంటున్నారు. వీళ్లు చేసేది కుట్రపూరిత రాజకీయం, ఈ నీచ కార్యకలాపానికి రాజ్యాంగం ప్రసాదించిన పత్రికాస్వేచ్ఛని నిస్సిగ్గుగా అడ్డం పెట్టుకుంటారు.

ఇటీవలి కాలంలో రెండు సంఘటనలను ఇందుకు నిదర్శనంగా ఉదహరించవచ్చు. ఒకటి, ఉమ్మడి హైకోర్టులో ఒక కేసులో తమకు అనుకూలంగా కోర్టు తీర్పు రాలేదని, ఒక రాజకీయ పార్టీకి చెందిన పత్రిక, హైకోర్టు, సుప్రీం కోర్టు న్యాయమూర్తుల మీద అభాండాలు వేసింది. న్యాయమూర్తులు తమ ప్రత్యర్థి పార్టీకి చెంచాగిరీ చేస్తున్నారని, తమ ప్రాంతం వారు న్యాయమూర్తులుగా లేకపోవడమే దీనికి కారణమని దారుణంగా ఈ పత్రికలో వార్తలు, వ్యాఖ్యలు, వ్యాసాలను ప్రచురించారు. ప్రాంతీయ విద్వేషాలను రెచ్చగొట్టి, పబ్బం గడుపుకోవడంలో ఆరితేరిన ఈ పత్రిక, దానికి అనుబంధమైన టివి ఛానల్, పత్రికాస్వేచ్ఛ పేరుతో ఇతర పార్టీల మీద విషం కక్కడం చాలాకాలంగా జరుగుతున్నదే.

ఇక మరొక పార్టీ పత్రిక, ఛానల్ – పెట్టుబడికి, కట్టుకధకి పుట్టిన విషపుత్రికలు. అధికారాన్ని అడ్డం పెట్టుకొని, వేలాది కోట్ల అక్రమ సంపాదనకు పాల్పడ్డారనే ఆరోపణల మీద విచారణను ఎదుర్కొంటున్న ఒక రాజకీయ నాయకుడి పచ్చి స్వార్థప్రయోజనాలకు నిచ్చెనమెట్లు. ఈ రెండు మీడియా సంస్థలు అబద్ధాలు వండివార్చని రోజుండదు. పాలనావ్యవస్థ మీదా, అధికార పార్టీ మీదా అయినదానికీ, కానిదానికీ రచ్చ చేసి, పబ్బం గడుపుకోవడమే వీటి పని. తాజాగా, వికీలీక్స్ వ్యవహారం ఇందుకు ఒక ఉదాహరణ. దేశంలోని అన్ని ప్రభుత్వాలు కొన్ని సంవత్సరాల నుంచి నిఘా వ్యవస్థను ఏర్పాటు చేసుకోవడానికి ప్రయత్నాలు చేస్తున్నాయి. రాష్ట్రం ఉమ్మడిగా ఉన్నప్పుడే, ఇక్కడ పోలీసు వ్యవస్థ ఇటువంటి అత్యాధునిక పరికరాలను ఏర్పాటు చేసుకోవడానికి ప్రయత్నించింది. ఈ తర్వాత కూడా ఇటువంటి నిఘా పరికరాలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంతో పాటు, కేంద్ర, ఇతర రాష్ట్ర ప్రభుత్వాలకు కూడా అమ్మేందుకు ఆయా కంపెనీలు ప్రయత్నించాయి. అయితే, ఈ మొత్తం విషయాన్ని పూర్తిగా వక్రీకరించి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమేదో ఫోన్ ట్యాపింగ్ ఎక్విప్‌మెంట్‌ను కొనుగోలు చేయడానికి ఊరంతా తిరిగినట్టు ఈ రొచ్చు పత్రిక, టివీ ఛానల్ చేసిన హడావుడి అంతా ఇంతా కాదు. ఇందుకు, పైన చెప్పిన మరో పార్టీ పత్రిక, ఛానల్ సహజంగానే వంత పాడాయి.

ఇంత పచ్చిగా, నిజానిజాలతో నిమిత్తం లేకుండా, పాత్రికేయ విలువలన్నిటికి తిలోదకాలు ఇచ్చి, తమ అధికార దాహానికి మీడియాను దాసోహం చేసినా, ఇటువంటి అరాచక రాతలను ప్రశ్నించడానికి వీల్లేదు. అదేమంటే, గురివింద గింజల్లాగా వీళ్లు పత్రికాస్వేచ్ఛ గురించి వల్లిస్తారు. భావప్రకటనా స్వేచ్ఛకు భంగం కలుగుతోందని సన్నాయి నొక్కులు నొక్కుతారు. సామాజిక హితం కోసం కాకుండా, సొంత ప్రయోజనాల కోసం చేసే పనులకు



వికీలీక్స్ వెల్లడించినట్లుగా కొన్ని ఛానళ్లలో వచ్చిన కథనాలు పూర్తిగా అవాస్తవాలు, నిరాధారాలు. ట్యాపింగ్ పరికరాల కొనుగోలుకు, సింగపూర్ హ్యాకింగ్ టీముకు బాధ్యతలు అప్పగించినట్లుగా చేస్తున్న దుష్ప్రచారాన్ని ఖండిస్తున్నాము. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని అప్రదిష్టపాలు చేసేందుకే కొందరు సొంత ఛానళ్లను అడ్డం పెట్టుకుని ఇటువంటి కుట్రలకు పాల్పడుతున్నారు. ఈ కథనాలతో గానీ, మెయిల్స్ తో గానీ, ఏపీ ప్రభుత్వానికి సంబంధంలేదు. ఈ మెయిల్స్‌కు ఎటువంటి సాధికారత లేదని వికీలీక్స్ స్పష్టంగా పేర్కొన్నా దానిని మరుగుపర్చడం ఆ ఛానళ్ల దుర్నీతికి నిదర్శనం. రాష్ట్రప్రభుత్వాన్ని బద్నాం చేయడమే అజెండాగా ఈ ఛానళ్లు పనిచేస్తున్నాయి. ఇటువంటి అసత్య ప్రచారానికి ఛానళ్లు పాల్పడడం మంచి పద్ధతి కాదు. రాజకీయపార్టీలే సొంత ఛానళ్లను, పత్రికలను ఏర్పాటు చేసుకుని ప్రత్యర్థులపై ఇటువంటి నిందాపూర్వక ప్రచారం చేయడం శోచనీయం. ఆకాశం మీద ఉమ్మాలని చూస్తే అది వారి ముఖం మీదే పడుతుంది. వారి కుట్ర రాజకీయాలను తెలుగు ప్రజలు తిప్పికొడతారు.

**– యనమల రామకృష్ణుడు, సీనియర్ మంత్రి**

పత్రికలను, టివి ఛానెళ్లను అడ్డం పెట్టుకుంటారు.

అందుకే, ఇవాళ రాజకీయ పార్టీలు తమ అక్రమ కార్యకలాపాలకు అడ్డాగా, అధికారాన్ని కైవసం చేసుకోవడానికి సోపానంగా పత్రికారంగాన్ని చూస్తున్నాయి. ఈ రంగంలోకి దొడ్డిదోవన ప్రవేశిస్తున్నాయి. పత్రికారంగానికి ఉన్న గౌరవమర్యాదలను ఉపయోగించుకొని, పత్రికాస్వేచ్ఛకు మన రాజకీయ వ్యవస్థ ఇచ్చిన ప్రత్యేక రక్షణలను కవచంగా ఉపయోగించుకొని, తమ అధికార కాంక్షను నెరవేర్చుకోవడానికి అడ్డదారులు తొక్కుతున్నాయి.

ఈ ధోరణిని అరికట్టకపోతే, ప్రజాస్వామ్య వ్యవస్థకే పెనుముప్పు ఏర్పడనుంది. దురదృష్టవశాత్తూ, మనదేశంలో ఇటువంటి అడ్డమైన రాతల మీద ప్రెస్ కౌన్సిల్ ఆఫ్ ఇండియా కూడా చేయగలిగింది ఏమీ లేదు. అడ్డగోలు రాతలను ఆపడానికి గానీ, జరిమానా విధించడానికి గానీ, ప్రభుత్వ ప్రకటనలను ఉపసంహరించడానికి గానీ, పచ్చి అబద్ధాలు ప్రచురించినందుకు జైలుశిక్ష విధించడానికి గానీ ప్రెస్ కౌన్సిల్‌కి ఎటువంటి అధికారాలు లేకపోవడంతో, మీడియా పేరుతో ఈ రాజకీయ పార్టీలు చేసే దురాగతాలకు అడ్డేలేకుండా పోయింది.

టెలికాం రెగ్యులేటరీ రెగ్యులేటరీ అథారిటీ ఆఫ్ ఇండియా (ట్రాయ్) 2014లో ఏర్పాటు చేసిన ఒక కమిటీ మీడియా యాజమాన్యానికి సంబంధించిన అనేక అంశాలపై విస్తృత చర్చలు జరిపి, ఒక పత్రాన్ని వెలువరించింది. మీడియాలో పెచ్చరిల్లుతున్న విపరీత ధోరణులకు మూలకారణం వీటి యాజమాన్యం రాజకీయ పార్టీలు, నాయకులు, వ్యాపార సామ్రాజ్యాల కనుసన్నల్లో ఉండటమేననీ, మిగతా అన్ని అవలక్షణాలను నిరోధించాలంటే ముందుగా ఈ అంశం మీద దృష్టి పెట్టాలని కమిటీ సూచించింది. ఇందుకోసం, ముందుగా టెలివిజన్ రంగంలోకి రాజకీయ సంస్థలు ప్రవేశించకుండా, తగిన విధివిధానాలను రూపొందించాలని కూడా కమిటీ సిఫార్సు చేసింది.

ప్రభుత్వాలను విమర్శించే హక్కు, అవసరం మీడియాకు ఉంది. అయితే, రాజకీయ పార్టీలు ఈ రంగంలోకి ప్రవేశించినప్పుడు, అధికారంలో ఉన్ననాడూ, లేనినాడూ, తమ పార్టీ ప్రయోజనాల కోసమే పనిచేస్తాయి. తమ పార్టీల ప్రయోజనాలే ప్రజల ప్రయోజనాలుగా భ్రమింపజేయడానికి విశ్వప్రయత్నం చేస్తాయి. తమ పార్టీలకు లబ్ధి చేకూర్చడం కోసం, సత్యాసత్యాలతో సంబంధం లేకుండా, విశాల ప్రజా ప్రయోజనాలతో నిమిత్తం లేకుండా, కుత్సితంగా, కుతంత్రంతో వ్యవహరిస్తాయి. అందుకే, పార్టీల అండలో నడిచే మీడియా ప్రమాదకరం.

ఆంధ్రప్రదేశ్ వంటి సరికొత్త రాష్ట్రం ఏర్పడినప్పుడు, విభజన గాయాలతో కోలుకోలేని పరిస్థితులు ఉన్నప్పుడు, ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వానికి అన్ని వర్గాల నుంచి మద్దతు అవసరం. ఇలాంటప్పుడు, నిజానికి మీడియా ఒక చారిత్రక పాత్రను పోషించాల్సిన ఆవశ్యకత ఉంది. ఒక జాతి జీవనయానంలో ఒక కొత్త అధ్యాయం మొదలైనప్పుడు, తమ భవిష్యత్తు కోసం, తమ పిల్లల భవిష్యత్తు కోసం అందరూ ఒకే తాటి మీద నిలబడ్డ ఘటనలు చరిత్రలో ఎన్నో. దురదృష్టవశాత్తూ, నవ్యాంధ్రప్రదేశ్ ఒక కీలక ప్రస్థానానికి సన్నద్ధమైన తరుణంలో, అధికార దాహాన్ని తీర్చుకునేందుకు మీడియా పేరుతో కుట్రపూరితంగా వ్యవహరించడానికి సంకోచించని ప్రజావ్యతిరేక వర్గం ఒకటి తయారైంది. అందుకే, రాజకీయ పార్టీల కనుసన్నల్లో నడుస్తున్న మీడియా మీద దేశవ్యాప్తంగా చర్చ జరగాలి. ట్రాయ్ కమిటీ దీనికి సంబంధించి చేసిన సిఫార్సులను అమలు చేసేందుకు కేంద్రం మీద ఒత్తిడి తీసుకురావాలి.



కందుల రమేష్

# నవ్యాంధ్రకు భారీ పెట్టుబడుల నజరానా

## ఫలించిన మంత్రి పల్లె అమెరికా పర్యటన

ఏపీలో పెట్టుబడులకు 15 కంపెనీలు ఆసక్తి చూపడం ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సమాచార, ఐటి, ఎన్ ఆర్ ఐ మంత్రి డా. పల్లె రఘునాథరెడ్డి అమెరికా పర్యటనలో హైలైట్‌గా నిలిచింది. అమెరికాలోని ప్రవాసాంధ్రులు రూ. 5 వేల కోట్ల పెట్టుబడికి పెట్టుబడులు పెట్టడానికి ముందుకు వచ్చారు. తత్ఫలితంగా ఆంధ్రలో సుమారు 10 వేల మందికి ఉపాధి కలగనుంది.




నవ్యాంధ్రను అభివృద్ధి చేయడంలో మేము సైతం అంటూ అమెరికాలోని 10 లక్షల మంది ప్రవాసాంధ్రులు ఎంతో ఆసక్తి, ఉత్సాహం చూపించారు. ఉత్తర అమెరికా తెలుగు సంఘం (తానా), ఉత్తర అమెరికా తెలుగు సొసైటి (నాట్స్), బే ఏరియా తెలుగు అసోసియేషన్ (బాటా), సిలికానాంధ్ర అసోసియేషన్ తదితర సంఘాల విజ్ఞప్తి మేరకు ఆయా వేడుకల్లో పాల్గొనడానికి రాష్ట్ర ప్రభుత్వ ప్రతినిధిగా మంత్రి పల్లె రఘునాథరెడ్డి హాజరయ్యారు. డా. పల్లె ఆరు రోజుల అమెరికా పర్యటనలో ప్రవాసాంధ్రులు ఎంతో ఆసక్తి కనబరచి, పెట్టుబడులతో ముందుకు రావడం నవ్యాంధ్రప్రదేశ్ అభివృద్ధిపై రెట్టింపు నమ్మకాన్ని కలిగించింది.

జన్మభూమి వదిలి, ఉపాధి కోసం విదేశాలలో ఉన్నా కూడా అందరితో సఖ్యంగా ఉంటూ దాదాపు 10 లక్షల మంది ప్రవాస తెలుగు ప్రజలు అమెరికాలో ఎంతో మంచిపేరు సంపాదించారు.

తానా, నాట్స్ వేడుకల అనంతరం మంత్రి డా. పల్లె రఘునాథరెడ్డి అమెరికాలోని డెట్రాయిట్, లాస్ ఏంజిల్స్, శాన్‌ఫ్రాన్సిస్‌కో, కాలిఫోర్నియా, సిలికాన్ వ్యాలీ, శాంటాక్లారా, మిల్ పిటాస్, హాలీవుడ్, బే ఏరియా వంటి నగరాల్లో పర్యటించారు. దాదాపు 500 మంది ప్రవాసాంధ్ర పారిశ్రామికవేత్తలు, సిఈవోలతో మంత్రి డా. పల్లె రఘునాథరెడ్డి పలు విడతలుగా సమావేశమయ్యారు. దేశంలో ఎక్కడాలేని విధంగా రాష్ట్రంలో పెట్టుబడులు పెట్టడానికి అనుసరిస్తున్న విధానాలను, ప్రోత్సాహకాలను, రాయితీలను, దేశంలోనే అత్యుత్తమైన ఐటి పాలసీని వివరించివచ్చారు. దేశంలో తొలి డిజిటల్ రాష్ట్రంగా ఏపీని తీర్చిదిద్దడానికి ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు చేస్తున్న కృషిని తెలిపారు. నవ్యాంధ్ర రాజధాని నగరం అమరావతి నిర్మాణంతోపాటు, జన్మభూమి- మావూరు, స్మార్ట్ వార్డులు, స్మార్ట్ విలేజ్ కార్యక్రమాల్లో ప్రవాసాంధ్రులు భాగస్వామ్యం కావాలని పిలుపునిచ్చారు.

రాష్ట్ర అభివృద్ధికి చంద్రబాబు చూపిస్తున్న చొరవ, బాబు విజన్ పట్ల ఆకర్షితులైన 15 మంది ప్రవాస పారిశ్రామికవేత్తలు ఏపీలో దాదాపు ఐదు వేల కోట్ల రూపాయల పెట్టుబడులు పెట్టడానికి ముందుకువచ్చారు. రానున్న కంపెనీల ద్వారా సుమారు 10 వేలమందికి ఉపాధి లభించనుంది. అనంతపురం జిల్లాలో రూ.3600 కోట్లతో సౌర, పవన విద్యుత్ పరిశ్రమలు నెలకొల్పడానికి పేరుగడించిన హిల్లియర్డ్ ఎనర్జీ కంపెనీ చైర్మన్ స్టెర్లింగ్ హిలియర్డ్ అంగీకార పత్రాన్ని ఇచ్చారు. అలాగే రవి చీరాల అనే ప్రవాస ఆంధ్ర పారిశ్రామికవేత్త రాష్ట్రంలో సుమారు 600 కోట్ల రూపాయల పెట్టుబడితో స్టీల్, అల్యూమినియం, పవర్ ప్లాంట్‌లను నెలకొల్పడానికి అంగీకరించారు. మిరకిల్ సాఫ్ట్‌వేర్ సిస్టమ్స్ చైర్మన్ ప్రసాద్ లోకం వైజాగ్‌లో తన సాఫ్ట్‌వేర్ కంపెనీని నెలకొల్పడానికి, మరో కంపెనీ నోవా సర్వీసెస్ ఎండి వంశీ కూడా విశాఖపట్నంలో కంపెనీ పెట్టడానికి అంగీకారం తెలిపారు. విజయవాడలో సుహాన్ ఇన్ఫోటెక్ ఏర్పాటు చేయడానికి సురేష్ అనే ప్రవాసభారతీయుడు అంగీకరించారు. అనంతపురంలో ఈ-ప్రామ్టెక్ కంపెనీ నెలకొల్పడానికి ఎండి నాగేంద్ర అంగీకరించారు. అలాగే ప్రముఖ హెల్త్ అండ్ ఫార్మా బిజినెస్ కంపెనీ ఎండీ పరాస్ పంచోలి తన కంపెనీని ఏపీలో నెలకొల్పేందుకు ముందుకు వచ్చారు.

మరో ప్రముఖ సాఫ్ట్‌వేర్ కంపెనీ క్లౌడ్ రాక్ సిస్టమ్స్‌ను నెలకొల్పడానికి చైర్మన్ దేవీ ప్రసాద్, గుంటూరులో యూనైటెడ్ ఐటి సొల్యూషన్స్ కంపెనీ నెలకొల్పడానికి ఆ కంపెనీ ఎండీ శేఖర్ అంగీకరించారు. ఇవిగాక టెక్ ఎనర్జీ అనే కంపెనీ విజయవాడలోనూ, గ్లామెన్ టెక్నాలజీస్ కంపెనీ ఎండి హరిప్రసాద్ నాయుడు, ఈబీఎన్ టెక్ ఫోర్ట్ కంపెనీని ఒంగోలులో స్థాపించడానికి ఆ కంపెనీ ప్రతినిధులు అంగీకరించారు.

అమెరికా పర్యటన ఫలితాలు ఆచరణలో చూడటం ఎంతో సంతోషంగా ఉందని మంత్రి పల్లె సంతృప్తి వ్యక్తం చేశారు. వాల్యూ థాట్ ఐటి సర్వీసెస్ ప్రైవేట్ లిమిటెడ్ కంపెనీ ఎండి మహేష్ అనిల్ సంద్యాల జూలైలో 24న 60 మంది ఉద్యోగులతో ఐటి స్టార్టప్ కంపెనీని అనంతపురం పట్టణంలో ప్రారంభించడమే ఇందుకు నిదర్శనం.

వీటితోపాటు అమెజాన్ డాట్ కామ్, వీసా లాంటి ప్రముఖ కంపెనీల సీఈవోలు కూడా ఏపీలో పెట్టుబడులు పెట్టడానికి ఆసక్తి ఉన్నట్లు మంత్రి పల్లెతో జరిపిన సమావేశంలో వెల్లడించారు. ఉత్తర అమెరికాలో తన పర్యటనను ఆన్‌లైన్ స్ట్రీమ్ ద్వారా వీక్షించిన న్యూజెర్సీలో ఉన్న ప్రవాసాంధ్రులు కూడా ఏపీలో పెట్టుబడులు పెట్టడానికి ముందుకు రావడం విశేషమని పల్లె వెల్లడించారు.

రొద్దం శ్రీనివాస్
పీఆర్వో, సమాచార శాఖ

# జలసిరిని ఒడిసి పట్టేసి...



అనంతపురంలో హంద్రీనీవా సుజల స్రవంతి పనులను పరిశీలిస్తున్న చంద్రబాబు, మంత్రి దేవినేని

పాలకులు వస్తుంటారు, వెళుతుంటారు, హామీలు గుప్పిస్తారు.. వాటిని నెరవేర్చడంలోనే కార్యదీక్ష కొరవడుతోంది. కానీ అందుకు భిన్నంగా సాగుతోంది రాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబు పాలన. మరే ముఖ్యమంత్రి చేయని విధంగా సాగు నీటి ప్రాజెక్టుల సత్వర నిర్మాణం కోసం తనదైన శైలిలో కాలువగట్లపై నిద్రిస్తున్నారాయన. ముఖ్యమంత్రి బాటలోనే జలవనరుల శాఖా మంత్రి దేవినేని ఉమా మహేశ్వరరావు అహర్నిశలు శ్రమిస్తున్నారు. ఎంచుకున్న లక్ష్యాలు పెద్దవే అయినా వాటిని సాధించి ఆంధ్రప్రదేశ్ ప్రజలకు ఏదో చేయాలన్న తపన జలవనరుల శాఖలో స్పష్టంగా కనిపిస్తోంది. దేశంలోనే తొలిసారిగా పోలవరం రూపంలో చేపట్టిన నదుల అనుసంధానం కావచ్చు, రాయలసీమ ప్రజల దాహార్తి తీర్చేందుకు రూపొందించిన పట్టిసీమ ప్రాజెక్టు కావచ్చు, రానున్న నాలుగేళ్లలో పూర్తి చేయాలని భావించిన ప్రాధాన్యతా ప్రాజెక్టులు కానూవచ్చు. అన్నీ సవాళ్లే. వీటిని అధిగమించే క్రమంలో తొలి వసంతం సంపూర్ణ ఫలితాలను ఇచ్చింది. చురుగ్గా ప్రారంభమైన ఈ నడక రానున్న కాలంలో స్వర్ణాంధ్రప్రదేశ్‌లో సాక్షాత్కరింపబోయే జలసిరిని కళ్లకు కడుతోంది.

## నదుల అనుసంధానం

నదుల అనుసంధానం.. ఈ పదం తరచుగా నేతల నోటి నుంచి వినిపించే మాట. వాస్తవానికి ఇప్పటికీ అది కలగానే మిగిలిపోయింది. ఆ కలను సాకారం చేస్తూ అటు చంద్రబాబు, ఇటు దేవినేని కృష్ణా, గోదావరి నదులను అనుసంధానం చేస్తూ పోలవరం ప్రాజెక్టును వేగిర పరిచారు. దశాబ్దాలుగా కాగితాలకే పరిమితమైన ఈ ప్రాజెక్టును 2019 నాటికి పూర్తి చేయడమే లక్ష్యంగా రాష్ట్ర ప్రభుత్వం ముందడుగు వేసింది. అధికారంలోకి వచ్చిన మరుక్షణం పోలవరం ప్రాజెక్టుకు ఆటంకంగా వున్న ముంపుగ్రామాలను ఏపీలో విలీనం చేసేలా కేంద్రం ఆర్డినెన్స్ తీసుకురావడంలో చంద్రబాబు ప్రభుత్వం సఫలీకృతమైంది. పోలవరం నిర్మాణ కాలంలో కూడా డెల్టా రైతులు ఇబ్బంది పడరాదన్న ధ్యేయంతో పాటు, రాయలసీమ కరువు తీర్చాలన్న సంకల్పంతో చేపట్టిన పట్టిసీమ ప్రాజెక్ట్ ట్రయిల్ రన్ నెలల వ్యవధిలోనే జరగనుంది.

## ప్రాధాన్యతా ప్రాజెక్టులు వేగిరం

ప్రాధాన్యతా ప్రాజెక్టులలో రెండోదిగా వున్న తోటపల్లి ద్వారా 1.02 లక్షల ఎకరాల నూతన ఆయకట్టుకు మార్గం సుగమమవుతోంది. ఇప్పటివరకు 81 శాతం పనులు పూర్తికాగా.. భూసేకరణ, నిర్వాసితులకు పరిహారం చెల్లింపు పనులు వేగవంతం చేయాలని మంత్రి దేవినేని ఉమామహేశ్వరరావు అధికారులను ఆదేశించారు. విజయనగరం జిల్లా నాగావళి నదిపై ఈ ప్రాజెక్ట్ రూపుదిద్దుకుంటుండగా 64 వేల ఎకరాల ఆయకట్టు స్థిరీకరణ కూడా అంతర్భాగంగా వుంది. ఎవిఆర్ హెచ్ఎన్ ఎస్ఎస్ ప్రాజెక్ట్ ద్వారా కృష్ణానది నుంచి 40 టిఎంసిల వరద నీటిని రాయలసీమలోని నాలుగు జిల్లాలకు మళ్లించేందుకు విశేష ప్రయత్నం జరుగుతోంది. ప్రాజెక్ట్‌కు రూ.6,850 కోట్లు వ్యయం చేసేందుకు పరిపాలనాపరమైన ఆమోదం లభించగా దేవినేని నేతృత్వంలో పనులు శరవేగంగా సాగుతున్నాయి.

కడప, చిత్తూరు, నెల్లూరు జిల్లాల్లో 2.60 లక్షల ఎకరాలకు సాగునీటిని అందించడంతో పాటు, ఐదు లక్షలకు పైబడిన జనాభాకు తాగునీటి అందించేందుకు ఉద్దేశించిన శ్రీకృష్ణదేవరాయ గాలేరు-నగరి సృజల స్రవంతి మొదటి దశ పనులను నిర్దిష్ట కాలంలో పూర్తి చేయాలన్న లక్ష్యంతో జలవనరుల శాఖ అహరహం శ్రమిస్తోంది. భారీ పరిమాణంలో వున్న ఈ ప్రాజెక్ట్ పనులను సత్వర ప్రయోజనాల కోసం దశలవారీగా చేపడుతున్నారు.

ఇక బిఆర్ఆర్ వంశధార ప్రాజెక్ట్ రెండో దశ స్టేజ్-2 ద్వారా 62,200 ఎకరాలు సాగులోకి తీసుకొచ్చేలా రూపొందించిన ప్రణాళికను యుద్ధప్రాతిపదికన పూర్తి చేసేలా మంత్రి దేవినేని ఉమామహేశ్వరరావు ఇప్పటికే పలుమార్లు ప్రాజెక్ట్‌ని సందర్శించారు. ప్రకాశం జిల్లా మార్కాపురం దగ్గర నిర్మిస్తున్న పూలసుబ్బయ్య వెలిగొండ ప్రాజెక్ట్ ద్వారా 4.7 లక్షల ఎకరాలకు సాగునీటిని అందించేందుకు ఎదురవుతున్న అవాంతరాలను ఈ సంవత్సరకాలంలో అధిగమించారు. ప్రకాశం జిల్లాలో 3.36 లక్షల ఎకరాలు, నెల్లూరు జిల్లాలో 84 వేల ఎకరాలు, కడప జిల్లాలో 27 వేల ఎకరాలకు నీటిని అందిస్తూ అనావృష్టి పీడిత, ఫ్లోరైడ్ ప్రభావిత 30 మండలాల ప్రజలకు తాగునీటిని అందించడం కూడా ఈప్రాజెక్ట్ లక్ష్యాలలో కీలకమైనది. ప్రకాశం జిల్లాలో నిర్మిస్తున్న కందుల ఓబుల్ రెడ్డి గుండ్లకమ్మ ప్రాజెక్ట్ ద్వారా రెండున్నర లక్షల జనాభాకు తాగునీటిని అందించే ప్రయత్నం జరుగుతుండగా ఆరు మండలాల్లో 80 వేల ఎకరాలకు సాగునీటి అందించడం కూడా దీని లక్ష్యాలే.

### చంద్రబాబు అడుగుజాడల్లో దేవినేని

ప్రాధాన్యత ప్రాజెక్టులను త్వరితగతిన పూర్తి చేసేందుకు ముఖ్యమంత్రి మార్గనిర్దేశకత్వంలో జలవనరుల శాఖా మంత్రి దేవినేని ఉమామహేశ్వరరావు పాటుపడుతున్నారు. గత పది సంవత్సరాలలో ప్రాజెక్టుల పురోగతి మంద గమనంలో వుండగా.. ప్రాజెక్టులు, ప్యాకేజీల వారీగా సవివరమైన అధ్యయనం కోసం మూడు రీజనల్ కమిటీలు ఏర్పాటు చేశారు. కమిటీల సూచనల మేరకు ప్రభుత్వానికి వ్యయమే అయినా జీవో.22 ని జారీ చేయడంతో పనులు వేగవంతమయ్యాయి. ఫలితంగా లక్ష్యం మేరకు సకాలంలో ప్రాజెక్టులు పూర్తి చేసేందుకు మార్గం సుగమమైంది. ఆయకట్టు ప్రాంతాభివృద్ధికి సంబంధించిన పనులతో పాటు ప్రాజెక్టులు, చెరువులు, ఎత్తిపోతల పథకాలకు సాగునీటి సౌకర్యాలను సమకూర్చే ఈ శాఖకు ఇప్పటివరకు "సాగునీరు, ఆయకట్టు ప్రాంతాభివృద్ధి శాఖ" అనే పేరుండగా, అది పరిమిత పాత్రను తెలియచేస్తోంది. ఈ నేపథ్యంలో నీటికి సంబంధించిన అన్ని అంశాలను పర్యవేక్షించేలా ఈ శాఖ పేరును "జలవనరుల శాఖ"గా నామకరణం చేసి ఉన్నత లక్ష్యాలను నిర్దేశించుకోవడం కూడా నేటి పాలకులకు రైతులపై వున్న అవ్యాజ ప్రేమానురాగాలను బహిరంగ పరుస్తోంది.



### సాగునీటి వివరణ

| | |
|---|---|
| మొత్తం భౌగోళిక ప్రాంతం | 395.13 లక్షల ఎకరాలు |
| సాగుకు అనువైన ప్రాంతం | 199.04 లక్షల ఎకరాలు |
| సాగునీటి సౌకర్యం కల్పించిన భూమి | 101.72 లక్షల ఎకరాలు |
| భారీ సాగునీటి ప్రాజెక్టుల పరిధి | 63.56 లక్షల ఎకరాలు |
| మధ్యతరహా ప్రాజెక్టుల పరిధి | 5.52 లక్షల ఎకరాలు |
| చిన్న తరహా ప్రాజెక్టుల పరిధి | 25.60 లక్షల ఎకరాలు |
| ఎపిఎస్ఐడిసి పరిధిలోని భూమి | 7.03 లక్షల ఎకరాలు |
| సాగునీరు అందివ్వాల్సిన ప్రాంతం | 97.80 లక్షల ఎకరాలు |

- ప్రత్యేకించి 2014-15లో కల్పించిన నూతన సాగునీటి సామర్థ్యం 47,858 ఎకరాలు కాగా, దాదాపు 33.20 లక్షల ఎకరాల మేర వున్న వ్యత్యాస ఆయకట్టును రానున్న ఐదేళ్లలో సరిచేసేందుకు రాష్ట్ర ప్రభుత్వం తీవ్రంగా ప్రయత్నిస్తోంది.
- జలరవాణాకు వున్న ప్రాధాన్యతలను గుర్తెరిగిన ఈ ప్రభుత్వం.. కాలువల ద్వారా ఐదు వేల కిలోమీటర్ల రవాణా మార్గాన్ని సిద్ధం చేసేందుకు ప్రణాళికలు రూపొందించింది. ఇప్పటికే కాకినాడ, పుదుచ్చేరి కాలువ వ్యవస్థను జాతీయ జలమార్గంగా కేంద్రం ప్రకటించగా అదే స్థాయిలో మిగిలిన కాలువలను కూడా తీర్చిదిద్దేందుకు జలవనరుల శాఖా మంత్రి దేవినేని ఉమామహేశ్వరరావు ప్రయత్నిస్తున్నారు.
- నీరు చెట్టు కార్యక్రమం ద్వారా నీటి సంరక్షణ, నిర్వహణలకు పెద్దపీట వేస్తున్నారు. జలవనరుల శాఖతో పాటు అటవీ, గ్రామీణాభివృద్ధి శాఖలను మిళితం చేసి చెరువుల పూడికతీత పనులను పెద్దఎత్తున చేపట్టారు. తొలకరి ప్రారంభం కావడంతోనే నీరు చెట్టులోని మలి అంకంగా మొక్కల పెంపకానికి శ్రీకారం చుడుతున్నారు.
- ముఖ్యమంత్రి కార్యాలయ రియల్ టైమ్ ఎగ్జిక్యూటివ్ డ్యాష్ బోర్డ్ ద్వారా భారీ, మధ్యతరహా సాగునీటి ప్రాజెక్టులలోని నీటి నిల్వల సమాచారాన్ని నిత్యం ప్రజలకు ప్రభుత్వం అందుబాటులో వుంచుతోంది.
- కొనసాగుతున్న ప్రాజెక్టులు పూర్తయిన తర్వాత రాష్ట్రంలో 21.18 లక్షల ఎకరాల స్థిరీకరణ జరగనుండగా, మొత్తంగా 138.20 లక్షల ఎకరాలకు సాగునీటి సామర్థ్యాన్ని కల్పించినట్టవుతోంది.
- వ్యవసాయ విస్తరణ కార్యకలాపాలకు చెందిన మెరుగైన ప్రణాళిక తయారీ ద్వారా ఏకీకృత సమాచార సేవలు అందించడం కోసం రూపొందించిన "హరిత" ప్రాజెక్టులో సాగునీటికి చెందిన వివరాలు అందుబాటులో వుంచారు. రూ. 30 కోట్ల వ్యయంతో మూడు జిల్లాల్లో పైలెట్ ప్రాజెక్టుగా దీనిని చేపడుతున్నారు.



రవికుమార్ బొప్పన
మీడియా లైజన్ అధికారి, జలవనరుల మంత్రిత్వ శాఖ

## అవార్డులు - రివార్డులు

- ఎల్వీ ప్రసాద్ నేత్ర వైద్య విజ్ఞాన సంస్థ సీఎండీ డాక్టర్ గుళ్ళపల్లి నాగేశ్వర రావు జీవిత సాఫల్య పురస్కారం అందుకున్నారు. వైద్యునిగా ఆయన అందించిన సేవలకు గాను ఆస్ట్రేలియా పార్లమెంటరీ కార్యదర్శి స్టీవెన్ సియాబో ఆయనకు ఈ అవార్డును అందజేశారు.
- విజయవాడకు చెందిన 17 ఏళ్ళ సాయి ఆకాష్ 1.75 లక్షల దాతల వివరాలతో అంతర్జాలంలో రక్తనిధి రూపకల్పనకు శ్రీకారం చుట్టి గిన్నిస్ పుస్తకంలో తన పేరును నమోదు చేసుకున్నాడు.
- విశాఖపట్నంలోని ఆంధ్రా యూనివర్శిటీకి అరుదైన గౌరవం దక్కింది. ఇండియాటుడే, నీల్సన్ సంస్థలు సంయుక్తంగా నిర్వహించిన సర్వేలో దేశంలోని అగ్రశ్రేణి వర్శిటీల్లో ఏయూకు అత్యుత్తమ స్థానం దక్కింది. అలాగే దేశంలోని స్టేట్ యూనివర్శిటీల్లో రెండో స్థానం, అన్ని యూనివర్శిటీల్లో ఎనిమిదవ స్థానం దక్కింది.
- పర్యావరణ పరిరక్షణ కోసం సేవలందించేవారికి అమెరికా అధ్యక్ష భవనం వైట్ హౌస్ అందించే 'చాంపియన్ ఆఫ్ చేంజ్' పురస్కారానికి భారత సంతతి అమెరికన్ సునీతా విశ్వనాథ్ ఎంపికయ్యారు. సునీత సహా 12 మంది ఈ పురస్కారానికి ఎంపికయ్యారు.
- సుప్రసిద్ధ నటుడు రావికొండలరావుకు కిన్నెర , కొవ్వలి లక్ష్మీనరసింహారావు స్మారక పురస్కారం ప్రదానం చేశారు.
- కేంద్ర సాహిత్య అకాడమీ అందజేసే భాషా సమ్మాన్ పురస్కారాలను జూన్ 24న ప్రకటించారు. 2013 సంవత్సరానికి దక్షిణాది సాహిత్యానికి కృషి చేసిన కె.మీనాక్షి సుందరం, 2014 సంవత్సరానికి ఆచార్య మునీశ్వర్ ఝా ఎంపికయ్యారు. కమౌని భాషను వెలుగులోకి తెచ్చినందుకు చారు చంద్రపాండే, మధురదుట్ట మథ్‌పాల్‌లకు సంయుక్తంగా భాషా సమ్మాన్ పురస్కారం లభించింది. తెలుగు భాషకు సంబందించి చొక్కాపు వెంకటరమణకు బాల సాహిత్య పురస్కారం దక్కగా, పసునూరి రవీంద్రకు లఘు కథా విభాగంలో యువ పురస్కారం లభించింది.
- మిసెస్ ఏషియా ఇంటర్నేషనల్ వరల్డ్ 2015 పోటీల్లో విశాఖ నివాసి వాలెంటీనా మిశ్రా ఎన్నికయ్యారు.
- 2014 వ సంవత్సరానికి గాను ప్రసిద్ధ గాయని ఎస్.జానకికి జీవిత సాఫల్య పురస్కారం లభించింది. మిర్చి మ్యూజిక్ అవార్డ్స్ ప్రదానంలో భాగంగా ఆమెను ఈ పురస్కారానికి ఎంపిక చేశారు.
- లాటిన్ అమెరికాలో శాంతి అంశాలపై చేసిన కృషికి గాను ఆర్ట్ ఆఫ్ లివింగ్ వ్యవస్థాపకుడు, ఆధ్యాత్మిక గురువు రవిశంకర్‌కు కొలంబియా అత్యున్నత పౌర పురస్కారం 'ఆర్డెన్ డి లా డెమొక్రసియా సైమన్ బలివర్' ప్రదానం చేశారు.
- జిల్లాలో బహిర్భూమి మల విసర్జనను పూర్తిగా నిర్మూలించినందుకు గాను పశ్చిమ బెంగాల్ లోని నడియా జిల్లాకు ఐక్యరాజ్య సమితి పబ్లిక్ సర్వీసు అవార్డు(2015) లభించింది.

## స్మరణ

- స్వాతంత్ర్య సమరయోధుడు, మాజీమంత్రి, మాజీ ఎంపీ భాట్టం శ్రీరామ్మూర్తి (89) విశాఖపట్నంలో అనారోగ్యంతో కన్నుమూశారు.
- హాలీవుడ్ సంగీత దర్శకుడు జేమ్స్ హార్నర్ కాలిఫోర్నియాలో విమాన ప్రమాదంలో మరణించారు. ఆయన టైటానిక్, అవతార్, అపోలో 13, బ్రేవ్ హార్ట్ వంటి చిత్రాలకు సంగీతాన్ని అందించారు.
- సంస్కృత ఆచార్యులు, పద్మశ్రీ అవార్డు గ్రహీత పుల్లెల శ్రీరామచంద్రుడు (88) అనారోగ్యంతో హైదరాబాద్‌లో మరణించారు.
- ప్రఖ్యాత నటుడు ఒమర్ షరీఫ్ (83) గుండెపోటుతో కన్నుమూశారు. లారెన్స్ ఆఫ్ అరేబియా, మెకన్నస్ గోల్డ్ చిత్రాల్లో ఆయన పోషించిన పాత్రలు ప్రత్యేక గుర్తింపునిచ్చాయి. ప్రతిష్టాత్మక ఆస్కార్ అవార్డుకు నామినేట్ అయిన షరీఫ్ గోల్డెన్ గ్లోబ్ అవార్డును దక్కించుకున్నారు.
- సుప్రసిద్ధ సంగీత దర్శకుడు ఎం.ఎస్. విశ్వనాథన్ కన్నుమూశారు. సుమారు ఐదు వందలకు పైగా తమిళ, తెలుగు, కన్నడ, తదితర చిత్రాలకు ఆయన సంగీత సారధ్య బాధ్యతలు నిర్వహించారు.
- ప్రఖ్యాత గాయకుడు వి.రామకృష్ణ కేన్సర్ వ్యాధితో హైద్రాబాద్‌లో కన్నుమూశారు. దాదాపు ఐదు వేల పాటలకు పైగా ఆయన వివిధ భాషలలో పాడారు.

## జాతీయం

- ప్రతిష్టాత్మక ఇండియన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ మేనేజ్‌మెంట్, ఇతర బిజినెస్ పాఠశాలల్లో మేనేజ్‌మెంట్ విద్య అభ్యసించేందుకు ఏటా నిర్వహించే కామన్ అడ్మిషన్ టెస్టులో ఈసారి భారీ మార్పులు తీసుకొచ్చేందుకు యోచిస్తున్నారు. ఈసారి పరీక్ష నిర్వహణను ఐఐఎం చేపడుతుంది. పరీక్షను ఒకే రోజుకు పరిమితం చేసి రెండు విడతల్లో జరిపే ప్రతిపాదన చేస్తున్నారు. గతేడాది 99 పరీక్షా కేంద్రాలుండగా, ఈసారి వాటి సంఖ్య 115కి పెంచారు.
- దేశంలోనే మొదటి సారిగా ఎన్నికలకు సంబందించిన పూర్తి సమాచారాన్ని ఓటర్లు తెలుసుకునే విధంగా ఎన్నికల సంఘం కొత్త పద్ధతిని తీసుకువచ్చింది. ఓటర్ల సహాయక పద్ధతిగా పిలిచే ఈ విధానంలో ఓటర్లకు సంబందించిన పూర్తి సమాచారం ఉంటుందని తెలిపింది. ఈమెయిల్, సంక్షిప్త సమాచారం, ఈ నేత్ర మొబైల్ యాప్ ద్వారా కూడా సమాచారాన్ని పొందవచ్చని తెలిపింది.
- ప్రయాణించాల్సిన రైలు రద్దయితే ఆ విషయాన్ని యాత్రికుల మొబైల్ ఫోన్లకు సంక్షిప్త రూపంలో తెలియ చేయడానికి రైల్వే శాఖ చర్యలు చేపట్టింది.
- అమర్‌నాథ్ యాత్ర సాగే మార్గంలో జంక్ ఫుడ్, శీతల పానీయాల అమ్మకాలను పూర్తిగా నిషేధించారు. ఈ విషయంపై సుప్రీంకోర్టు ఆదేశాల మేరకు నియమించిన కమిటీ ఇచ్చిన నివేదికలో సముద్ర మట్టానికి 12 వేల అడుగుల ఎత్తులో ఆక్సిజన్ సరిగా అందని పరిస్థితుల్లో వీటిని తీసుకుంటే అవి జీర్ణమవడం కష్టమవుతుందనీ, దీని వల్ల శ్వాస సంబంధ ఇబ్బందులు ఎదురవుతాయని వెల్లడించింది.
- ఆర్థిక ఇబ్బందుల వల్లనో ఇతరత్రా కారణాల వల్లనో చదువును పాఠశాల స్థాయి లోనే వదిలి వేసిన వారి కోసం కేంద్ర ప్రభుత్వం ఓ కొత్త పథకానికి సన్నాహాలు చేస్తోంది. దీని ప్రకారం తొమ్మిదవ తరగతి కూడా చదువుకోని లేదా ఉత్తీర్ణులు కాని అభ్యర్థులు పదో తరగతి పరీక్ష రాయవచ్చు. ఏడాదికి కనీసం ఒక్క సబ్జెక్టు చొప్పున పాసవుతూ పదో తరగతి పూర్తి చేసుకోవచ్చు.
- ఏపీలో యువతకు శిక్షణ ఇచ్చేందుకు ప్రత్యేకంగా నైపుణ్యాభివృద్ధి విశ్వ విద్యాలయం ఏర్పాటు చేస్తామని కేంద్రం ప్రకటించింది.
- మైనారిటీ వర్గాలకు చెందిన వారు ఇక నుంచి సంబంధిత సంక్షేమ పథకాల ప్రయోజనాలను పొందేందుకు అధికారుల నుంచి సర్టిఫికేట్లను పొందాల్సిన అవసరం లేదని, స్వీయ ధృవీకరణ మాత్రం సరిపోతుందని కేంద్రం స్పష్టం చేసింది.
- భారత్‌లోని స్మార్ట్ ఫోన్ వినియోగదారులు 47శాతం సమయాన్ని వాట్స్‌యాప్, విచాట్, హైక్, స్కైప్ లాంటి ప్రసార మాధ్యమ యాప్‌ల పైనే వెచ్చిస్తున్నారని తాజా నివేదికలో వెల్లడైంది.
- అనంత వెంకటరెడ్డి హంద్రీనీవా సుజల స్రవంతి ప్రాజెక్టుకు తుది దశ పర్యావరణ అనుమతి లభించింది. ఈ ప్రాజెక్టుకు సంబందించి 1306 ఎకరాల అటవీ భూమి బదలాయింపునకు తుది దశ పర్యావరణ అనుమతి ఇచ్చినట్లు కేంద్రం ప్రకటించింది.
- అవివాహిత అయిన తల్లికే పిల్లల చట్టబద్ధమైన సంరక్షకురాలి బాధ్యతను అప్పగిస్తూ సుప్రీం కోర్టు చారిత్రాత్మకమైన తీర్పు చెప్పింది.
- దేశంలో 10 లక్షల మందికి పైగా ఉన్న పారా మిలటరీ జవాన్ల రోజువారీ భౌతిక వ్యాయామంలో యోగాను కూడా చేర్చాలని కేంద్ర సాయుధ పోలీసు దళాలను కేంద్ర హోంశాఖ ఆదేశించింది.
- కేంద్ర ప్రభుత్వ ఉద్యోగాల్లో నేరుగా నియామకాలు జరిపే అన్ని పోస్టుల్లోనూ అంధులు, బధిరులు సహా ఇతరత్రా శారీరక వైకల్యం గల వ్యక్తులకు గరిష్ట వయోపరిమితిలో పదేళ్ళు సడలింపు ఇవ్వనున్నట్లు కేంద్ర ప్రభుత్వం వెల్లడించింది. అలాగే ఎస్.సి, ఎస్.టి లకు గరిష్ట వయోపరిమితిలో 15 ఏళ్ళ

❖

సడలింపు, ఓబీసి వారికి 13 ఏళ్ళ సడలింపు ఇస్తామని ప్రకటించింది. అయితే దరఖాస్తుదారు వయసు గరిష్టంగా 56 సంవత్సరాలకు మించరాదన్న నిబంధనలకు లోబడి ఈ సడలింపులు వర్తిస్తాయని పేర్కొంది.

- పట్టణాభివృద్ధి, గృహ వసతికి ఉద్దేశించిన మూడు పథకాలను ప్రధాన మంత్రి నరేంద్ర మోడి జూన్ 25న ప్రారంభించారు. అందరికీ ఇల్లు, అటల్ పట్టణ రూపాంతరణ పునర్నవీకరణ పథకం, స్మార్ట్ సిటీలు అనే మూడు పథకాలను ఆయన ప్రారంభించారు.
- కార్మికుల కనీస వేతనాన్ని కేంద్రం ప్రస్తుతమున్న రూ. 137 నుంచి రూ.160 కి పెంచింది.
- జూలై 11వ తేదీ సాయంత్రం 5 గంటలకు భారత జనాభా 127 కోట్లు దాటిందని అధికారిక ప్రకటన వెలువడింది.

## రాష్ట్రీయం

- ప్రాథమిక రంగం మిషన్‌కు రైతుకోసం అనే పేరును ఖరారు చేస్తూ రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది.
- బార్లలో మద్యం విక్రయాలకు సంబందించిన నిబంధనకు ఏపీ ఎక్సైజ్ శాఖ కీలక సవరణ చేసింది. ఇక నుంచి ఫుల్ బాటిల్‌తో పాటు పరిమాణంతో నిమిత్తం లేకుండా క్వార్టర్, ఆఫ్ బాటిళ్ళు, లీటర్, అన్ని రకాల పరిమాణాల్లో మద్యం సీసాలను విక్రయించేందుకు అనుమతించనుంది. అలాగే ఇక నుంచి రాత్రి 11 గంటల వరకు మద్యం దుకాణాలను అనుమతించనున్నారు.
- ఆంధ్ర ప్రదేశ్‌లో ఐదు జాతీయ స్థాయి విద్యా సంస్థల్లో ప్రవేశాలు ఈ విద్యా సంవత్సరం నుంచే మొదలవుతాయి. పునర్ వ్యవస్థీకరణ చట్టం ప్రకారం ఏపీలో ఈ విద్యా సంవత్సరం నుంచి ఏడు జాతీయ విద్యా సంస్థలు ఐఐటి, ట్రిపుల్ ఐటీ, ఎన్ఐటి, భారత శాస్త్ర విద్య, పరిశోధన సంస్థ, ఐఐఎం, కేంద్రీయ విశ్వ విద్యాలయం, గిరిజన విశ్వ విద్యాలయం పని చేయాల్సి ఉంది. చివరి రెండు విశ్వ విద్యాలయాలు మినహా మిగిలిన సంస్థల్లో ఈ ఏడాది నుంచి తరగతులు నడుస్తాయని ప్రభుత్వం ప్రకటించింది.
- కృష్ణా జిల్లాలో కేంద్ర యోగా, ప్రకృతి చికిత్స పరిశోధన సంస్థను ఏర్పాటు చేయనున్నారు. ఈ సంస్థ ఏర్పాటుకు కేంద్రం సూత్రప్రాయ ఆమోదం ఇచ్చినట్లు రాష్ట్ర ప్రభుత్వం ప్రకటించింది. ఆ సంస్థను కేంద్ర యోగా, ప్రకృతి చికిత్స పరిశోధన మండలి కింద ఏర్పాటు చేయనున్నారు.
- ఆంధ్రప్రదేశ్‌లోని 13 జిల్లాల్లోనూ జిల్లా ఖనిజ సంస్థలను ఏర్పాటు చేస్తూ ఏపీ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. మైనింగ్ ప్రభావిత ప్రాంతాలు, అక్కడి ప్రజల ప్రయోజనాలను పరిరక్షించే బాధ్యతను ఈ సంస్థలకు అప్పగించారు.
- ఆంధ్ర ప్రదేశ్‌లోని 13 జిల్లాల్లో 19 ఎత్తి పోతల పథకాల నిర్మాణానికి పాలనామోదం ఇస్తూ జల వనరుల శాఖ ఉత్తర్వులు జారీ చేసింది. అలాగే మరో ఎనిమిది ఎత్తిపోతల పథకాలు 17619 ఎకరాల ఆయకట్టుకు నీరందించేలా వీలు కల్పిస్తూ మరో ఉత్తర్వు జారీ చేసింది.
- విద్యార్థులకు కళలపై అసక్తి పెంపొందించడంలో భాగంగా పాఠశాల విద్యలో కూచిపూడి నృత్యం, కర్ణాటక సంగీతాన్ని పాఠ్యాంశాలుగా చేర్చాలని రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించింది. వచ్చే విద్యా సంవత్సరం నుంచి దీనిని అమలు చేస్తారు.
- మహాత్మాగాంధీ జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకంలో 100 రోజుల పాటు పనిచేసిన గ్రామీణ యువతీ యువకులకు శిక్షణలో నైపుణ్యాలు పెంచి, వారికి ఆర్థిక స్వావలంబన కల్పించే సంపూర్ణ జీవనోపాధి కల్పన (లైఫ్)కు ఏపీ ప్రభుత్వం శ్రీకారం చుట్టింది.

### ఆగస్టు నెలలో ముఖ్యమైన రోజులు

స్నేహితుల దినోత్సవం - 2
హిరోషిమా సంఘటనా దినం, ప్రపంచ శాంతి దినోత్సవం - 6
క్విట్ ఇండియా దినోత్సవం, నాగసాకి సంఘటనా దినం - 9
భారత స్వాతంత్ర్య దినోత్సవం - 15
ప్రపంచ ఫొటోగ్రఫీ దినోత్సవం - 19
సద్భావన దినోత్సవం, రాజీవ్ గాంధీ జయంతి - 20
మదర్ థెరిసా జయంతి - 26
జాతీయ క్రీడల దినోత్సవం, మేజర్ ధ్యాన్‌చంద్ జయంతి - 29

- తపాలా శాఖ ఆంధ్రప్రదేశ్, తెలంగాణ సర్కిల్ ఇపుడు నగదు రహిత సేవలను అందుబాటులోకి తెచ్చింది. దేశంలోనే తొలిసారిగా క్రెడిట్ లేదా డెబిట్ కార్డు ద్వారా చెల్లింపులుండేలా చర్యలు తీసుకుంది.
- రాష్ట్రంలో ప్రభుత్వ జూనియర్ కళాశాలల్లో విద్యార్థుల హాజరు నమోదుకు బయోమెట్రిక్ విధానాన్ని ఏర్పాటు చేస్తున్నట్లు ఇంటర్ బోర్డు ప్రకటించింది.
- రాష్ట్రంలో ఆగస్టు ఒకటో తేదీ నుంచి భూములు, ఇళ్ళు, స్థలాలు, ఫ్లాట్ల మార్కెట్ విలువలను పెంచుతూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది.
- ఉద్యోగుల హెల్త్ కార్డుల పథకం ఇంకా పూర్తి స్థాయిలో అమల్లోకి రానందున మెడికల్ రీయింబర్స్‌మెంటును ఈ ఏడాది చివరి వరకూ పొడిగిస్తూ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది.
- జాతీయ రహదారిపై జరిగే ప్రమాదాలను త్వరితంగా తెలుసుకోవడానికి వీలుగా హైవేపై ఫ్రీ ఫోన్ల ఏర్పాటుకు రంగం సిద్ధమైంది. ఈ మేరకు గుంటూరు జిల్లాలోని హైవే మార్గంలో ప్రతి కిలోమీటరుకు ఒక టెలిఫోన్‌తో పాటు వీడియో కెమెరాలను ప్రయోగాత్మకంగా ఏర్పాటు చేశారు.
- ఇందిరాసాగర్ పోలవరం ప్రాజెక్టు పేరు నుంచి ఇందిరా సాగర్‌ను ప్రభుత్వం తొలగించింది. పోలవరం ఇరిగేషన్ ప్రాజెక్టుగా నామకరణం చేసింది.
- ధ్రువీకరణ పత్రాల కోసం విద్యార్థులు, ప్రజలు పడిగాపులు పడాల్సిన పరిస్థితిని నివారించే దిశగా ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. తెల్ల రేషన్ కార్డు ఉంటే ఆదాయ ధ్రువీకరణ పత్రం, ఆధార్, రేషన్ కార్డులు ఉంటే నివాస ధ్రువ పత్రం ప్రత్యేకంగా సమర్పించాల్సిన అవసరం లేదని స్పష్టం చేసింది.
- ప్రజలకు నగదు రహిత లావాదేవీల కోసం పోస్టాఫీసుల్లో ప్రవేశ పెట్టిన తురంత్ సేవలు విజయవాడ, తెనాలిలో ప్రారంభమయ్యాయి. బ్యాంకు డెబిట్, క్రెడిట్ కార్డులతో అన్ని రకాల చెల్లింపులు, ఇతరత్రా లావాదేవీలు ఈ తురంత్ సేవల ద్వారా జరుపుకునేందుకు వీలవుతుంది.

## క్రీడలు

- కెనడా ఓపెన్ గ్రాండ్ ప్రి టోర్నమెంట్‌లో గుత్తా జ్వాల, అశ్విని పొన్నప్పల జోడీ డబుల్స్ టైటిల్‌ను సాధించింది.
- భారత గ్రాండ్ మాస్టర్ పెంటేల హరికృష్ణ ఎడ్మాంటన్ అంతర్జాతీయ చెస్ టోర్నమెంటులో విజేతగా నిలిచాడు. కెనడాలో ముగిసిన ఈ టోర్నీలో హరికృష్ణ 7.5 పాయింట్లు సాధించి అగ్రస్థానంలో నిలిచాడు.
- అమెరికాలోని నేషనల్ బాస్కెట్ బాల్ అసోసియేషన్ లీగ్‌కు పంజాబ్ కు చెందిన సత్నామ్ సింగ్ భమారా ఎంపికయ్యాడు. ఈ ఘనత సాధించిన తొలి భారతీయుడిగా ఆయన రికార్డులకెక్కాడు.
- కామన్వెల్త్ చెస్ చాంపియన్‌షిప్‌లో ఆంధ్ర ప్రదేశ్ గ్రాండ్ మాస్టర్ ఎం.ఆర్. లలిత్ బాబు కాంస్య పతకాన్ని సాధించాడు. ఇదే టోర్నమెంటు అండర్ 14 విభాగంలో ఆంధ్ర ప్రదేశ్ అమ్మాయి జి.హర్షిత 5.5 పాయింట్లతో మూడో స్థానంలో నిలిచి కాంస్య పతకాన్ని సాధించింది.
- ప్రపంచ విశ్వ విద్యాలయ క్రీడల్లో ఆంధ్ర ప్రదేశ్ ఆర్చరి క్రీడాకారిణి వెన్నం జ్యోతి సురేఖ రజత పతకం సొంతం చేసుకుంది.
- భారత టెన్నిస్ స్టార్ సానియా మీర్జా , మార్టిన్ హింగిస్ జంట వింబుల్డన్ మహిళల డబుల్స్ టైటిల్‌ను సాధించింది.



దాసరి దుర్గాప్రసాద్

# ఉపాధి హామీతో ఉద్యానవనాలు

# విరబూసిన బంతిపూసొగసులు



విజయనగరం జిల్లా కొండవెలగాడ గ్రామంలో విరగబూసిన బంతిపూలు

వ్యవసాయం జీవనాధారం అన్నది ఎంత నిజమో, అదే వ్యవసాయం ఒట్టి భుక్తి మాత్రమే కాదని, ఈ జాతిజనుల జీవనవిధానం అనేది కూడా అంతే నిజమని అర్థమౌతుంది. అయితే, సంప్రదాయ వ్యవసాయానికి రోజులు చెల్లిపోతున్నాయి; సంస్కృతిని లాభనష్టాల తోనే కొలిచే వర్తమాన ప్రపంచంలో సాగు ఖర్చు పెరగడం, నీటి అవసరాలు ఎక్కువ కావడంతో ప్రత్యామ్నాయ పంటల దిశగా దృష్టి సారిస్తున్నాడు రైతన్న.

రాష్ట్ర ప్రభుత్వం కూడా ఉద్యాన పంటలకు అధిక ప్రాధాన్యతనిస్తూ, రైతును అన్ని విధాలా ప్రోత్సహిస్తోంది. 'పొలం పిలుస్తోంది' వంటి కార్యక్రమాల ద్వారా రైతులకు ఉద్యాన పంటల సాగుపై అవగాహన పెంచడంతో పాటు విత్తనాలను సబ్సిడీపై అందించడం, మట్టి నమూనా పరీక్షలు నిర్వహించడం, డ్రిప్‌లను సబ్సిడీలపై అందజేయడం, పంటకు గిట్టుబాటు ధరతో పాటు మార్కెటింగ్ సౌకర్యాలను కల్పించే బాధ్యతలను ప్రభుత్వమే తీసుకొని రైతుకు చేయూత నిస్తోంది. తక్కువ నీటితో, అతి తక్కువ ఖర్చుతో ఎక్కువ లాభాల నార్జించే ఉద్యాన పంటల వైపు రైతులు నెమ్మది నెమ్మదిగా దృష్టి సారిస్తున్నారు. ఫలితంగా సంప్రదాయ వ్యవసాయం స్థానంలో ఉద్యాన పంటలైన పూల సాగు, కూరగాయల సాగు చేసి అద్భుతమైన ఫలితాలను అందుకుంటున్నారు. అనేక మందికి ఆదర్శంగా నిలుస్తున్నారు.

## కొండవెలగాడ ఆదర్శం

విజయనగరం జిల్లా కేంద్రానికి అతి దగ్గరలో వున్న కొండవెలగాడ గ్రామానికి చెందిన రైతులు వల్లూరి అప్పన్న, వల్లూరి చెల్లయ్య, బెల్లాన రాములమ్మ లకు ఉపాధి హామీ పథకం క్రింద నేల బావులు మంజూరైనాయి. 22 నుండి 30 అడుగుల లోతు గల ఈ బావుల తవ్వకానికి ఒక్కొక్క బావికి సుమారు లక్ష రూపాయల వరకు ఖర్చయ్యింది. అయితే ఇంత తక్కువ నీటితో ఏం పంటలు వేసుకుంటామనే ఆలోచనతో వున్న వారికి వ్యవసాయాధికారుల ద్వారా పూల సాగుతో లాభాలు ఎక్కువగా వస్తున్నాయనే సమాచారం తెలిసింది. పూల సాగుతో సంవత్సరం పొడుగునా ఆదాయం పొందవచ్చనే వారి ఆలోచనకు అధికారులు సహకరించారు. నీటి వృధాను అరికట్టి, పొదుపుగా వాడటంతో ప్రతి బావి క్రింద సుమారు ఐదు ఎకరాలు సాగుచేసారు. కాగడామల్లి, కనకాంబరాలు, మల్లె, గులాబీ, చామంతి, బంతి పూల సాగుకు శ్రీకారం చుట్టారు. వీటితో పాటు బెండ, టమాటా, చిక్కుడు, నువ్వులు తదితర కూరగాయ పంటలను కూడా వేశారు. గులాబీ సాగు ద్వారా ఎకరాకు 50 వేల రూపాయల ఆదాయం లభిస్తుందని, కూరగాయల సాగుద్వారా ఖర్చులు పోనూ నెలకు 20 వేల రూపాయలు మిగులుతుందని రైతులు తెలిపారు. బంతిపూలు విరగబూశాయని, ఈ సాగు ద్వారా 20 సెంట్లకు గాను రెండు నెలల్లోనే రూ. 10 వేలు ఆదాయం లభించిందని తెలిపారు. అన్ని పంటల ద్వారా సంవత్సరంలో ఒక బావి క్రింద లక్ష రూపాయల వరకు ఆదాయం లభించిందని, ఉద్యాన పంటల వలన ఇంత ఆదాయం వస్తుందని ఇప్పుడే తెలిసిందని హర్షం వ్యక్తం చేశారు. ఉపాధి హామీ అసిస్టెంట్ పి.డి జి.విజయకుమార్ సలహాలు, సూచనలతోనే ఈ విజయాలను అందుకున్నామని చెప్పారు. స్థిరమైన ఆదాయం అందడంలో ఇంటి అవసరాలన్నీ తీర్చుకుంటూ, ప్రభుత్వం అందించిన 15 వేల రూపాయలతో మరుగుదొడ్లు కూడా నిర్మించుకున్నామని చెప్పారు. మా జీవన ప్రమాణాలు పెరగడానికి ఉపాధి హామీ ద్వారా మంజూరు చేసిన బావులే కారణమని ముక్తకంఠంతో చెపుతున్నారు. ఈ బావుల్లో నీరు ఇతర పంటలకు కూడా ఉపయోగపడుతోందని, జిల్లా కలెక్టరు ఎం .ఎం .నాయక్ అందించిన ప్రోత్సాహంతో నీరు-చెట్టు కార్యక్రమం ద్వారా మరో మూడు చెరువులకు పూడికలు తీయడం జరిగిందని, సాగునీటికి ఇకపై ఇబ్బంది వుండదని ప్రభుత్వం అందిస్తున్న ఈ కార్యక్రమాలపై ఆనందం వ్యక్తం చేశారు.



సీపాన జానకి
సహాయ పౌర సంబంధాల అధికారి, విజయనగరం

# ఎల్ఈడి బల్బులతో నవ్యాంధ్రలో కాంతీ... క్రాంతీ!

♦ ముఖ్యమంత్రి ప్రయత్నాలకు కేంద్రం ప్రశంస

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకంగా అమలు చేస్తున్న పథకం వినియోగదారులకు నిరంతర విద్యుత్ సరఫరా. ఇందులో ఒక ముఖ్యమైన భాగం విద్యుత్ పొదుపు.ఒక యూనిట్ విద్యుత్ ఆదా చేస్తే రెండు యూనిట్ల విద్యుత్ ఉత్పత్తి చేసినట్లే. విద్యుత్ పొదుపు మీద చక్కని అవగాహన ఉన్న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి నారా చంద్రబాబునాయుడు విద్యుత్‌ను ఆదా చేసే ఎల్ఈడి బల్బుల వినియోగంపై దృష్టిని కేంద్రీకరించారు.

ఎల్ఈడి బల్బుల వలన అనేక ఉపయోగాలు ఉన్నాయి. సాధారణ ఫిలమెంట్ బల్బులు, ట్యూబ్ లైట్లు మొదలైన వాటితో పోలిస్తే ఎల్ఈడి బల్బులు వివిధ రకాలుగాఅనువైనవి. సాధారణ బల్బు 60 వాట్ల విద్యుత్‌ను వినియోగిస్తే ఎల్ఈడి బల్బు కేవలం 8వ వంతు మాత్రమే విద్యుత్‌ను వినియోగిస్తూ అంతే కాంతిని ఇస్తుంది. ఒక ఎల్ఈడి బల్బు జీవిత కాలం కనీసం 50 వేల గంటలు ఉండగా, సాధారణ బల్బు జీవిత కాలం 1200 గంటలు మాత్రమే ఉంటుంది. విషపూరితమైన పాదరసం లాంటి పదార్థాల వినియోగం ఎల్ఈడి బల్బులు తయారీలో ఉండదు. సిఎఫ్ఎల్ బల్బులతో పోలిస్తే ఎల్ఈడి బల్బులు విడుదల చేసే కార్బన్‌డైఆక్సైడ్ అత్యంత స్వల్పం. అందువలన ఎల్ఈడి బల్బులను పర్యావరణానికి అనుకూలమైనవి గుర్తించారు.

సాధారణ బల్బులను పలుమార్లు ఆఫ్ ఆన్ చేయటం వలన వాటి జీవిత కాలం తగ్గిపోతుంది. కాని ఎల్ఈడి బల్బుల మీద ఆ ప్రభావం ఉండదు. సాధారణ బల్బుల్లో 20 శాతం శక్తి మాత్రమే కాంతి కింద రూపాంతరం చెందగా, ఎల్ఈడి బల్బుల్లో 80 శక్తి కాంతిగా రూపాంతరం చెందుతుంది. ఈ ఎల్ఈడి బల్బులు తక్కువ ఓల్టేజీలో కూడా సమర్థవంతంగా పని చేస్తాయి కాబట్టి మారుమూల గ్రామాల్లో, సౌర శక్తి వినియోగించే ప్రదేశాల్లో కూడా వీటిని ఏర్పాటు చేస్తున్నారు.

ఇన్ని సత్ప్రయోజనాలున్న ఎల్ఈడి బల్బుల్ని సాధారణ బల్బుల స్థానంలో వినియోగించడం వలన విద్యుత్ అధిక మొత్తంలో ఆదా అవుతోంది. అంతేకాక దీర్ఘకాలిక మన్నిక వలన  వినియోగదారునికి బల్బులపై పెట్టే పెట్టుబడి ఆదా అవుతుంది.

ఈ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని సూక్ష్మ దృష్టి, సాంకేతిక పరిజ్ఞానం, ముందు చూపు గల ముఖ్యమంత్రి రాష్ట్రంలో ఎల్ఈడి బల్బులను దశల వారీగా రాష్ట్రం మొత్తం మీద పంపిణీ చేయదలిచారు. దృఢ సంకల్పంతో మొదలు పెట్టిన ఈ కార్యక్రమానికి అనతి కాలంలోనే ప్రజల నుంచి విశేష ఆదరణ లభిస్తోంది.

ఇప్పటి వరకు మొదటి విడతగా వినియోగదారులకు కేవలం పది రూపాయలకే పాత ఫిలమెంట్ బల్బుల స్థానంలో ఎల్ఈడి బల్బులను పంపిణీ చేసి రికార్డు సృష్టించారు. రాష్ట్రంలో గృహ వినియోగదారులతో పాటు వీధి దీపాలకు కలిపి దాదాపు 45 లక్షల ఎల్ఈడి బల్బులను పంపిణీ చేసి రికార్డు సృష్టించారు. రాష్ట్రంలో ప్రయోగాత్మకంగా మొదటి విడతలో ఎల్ఈడి విద్యుత్ బల్బుల పంపిణీ కార్యక్రమం గుంటూరులో రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రారంభించగా, అనంతపురం, శ్రీకాకుళం, పశ్చిమ గోదావరి జిల్లాల్లోనూ ఈ కార్యక్రమం విజయవంతంగా జరుగుతోంది. ఈ నాలుగు జిల్లాల్లో ఎల్ఈడి బల్బులు వెలుగులు వెదజల్లుతున్నాయి. ఈ నాలుగు జిల్లాల్లో ఎల్ఈడి బల్బులు వినియోగంలోకి రావడంతో గతంతో పోలిస్తే విద్యుత్ ఆదా శాతం అనూహ్యంగా పెరిగింది.



గుంటూరు జిల్లాలో ఎల్ఈడి బల్బుల వెలుగులు

ముఖ్యమంత్రి చేపట్టిన ఈ కార్యక్రమానికి కేంద్ర ప్రభుత్వం నుండి అభినందనలు వెల్లువెత్తాయి. అనేక రాష్ట్రాల్లో కేవలం ప్రతిపాదన స్థాయిలోనే ఉన్న ఎల్ఈడి బల్బుల వాడకం ఆంధ్రప్రదేశ్‌లో ముందంజలో ఉండడం ముఖ్యమంత్రి సంకల్ప బలానికి తార్కాణం.

ఇప్పటి వరకు రాష్ట్రంలో డెల్ప్ (DELP) పథకం కింద పంపిణీ చేసిన ఎల్ఈడి బల్బుల వివరాలు ఇంధన శాఖ నివేదిక మేరకు ఈ విధంగా ఉన్నాయి.

| జిల్లా పేరు | ఇంతవరకు పంపిణీ చేసిన ఎల్ఈడి బల్బుల సంఖ్య | విద్యుత్ ఆదా (సంవత్సరానికి) |
|---|---|---|
| గుంటూరు | 18.67 లక్షలు | 114(ఎం.యు) |
| అనంతపురం | 12 లక్షలు | 77 (ఎం.యు) |
| శ్రీకాకుళం | 10.58 లక్షలు | 65 (ఎం.యు) |
| పశ్చిమ గోదావరి | 3.02 లక్షలు | 93 (ఎం.యు) |

ఆంధ్రప్రదేశ్  రాష్ట్రం నడిచిన బాటలోనే మిగిలిన రాష్ట్రలు కూడా నడిచి కాలుష్య రహిత, పొదుపైన ఎల్ఈడి బల్బుల వాడకం పెంచాలని కేంద్రం అభిలషిస్తోంది.

హుద్ హుద్ సందర్భంగా నేలకొరిగిన విద్యుత్ స్థంభాలను పునరుద్ధరించే సమయంలోనే, దూరదృష్టితో సాధారణ బల్బుల స్థానంలో ఎల్ఈడి బల్బులు ఏర్పాటు చేసే విధంగా చర్యలు తీసుకోవడం జరిగింది. ఈ ఆలోచనను ఆచరణలో పెట్టడం ద్వారా రాష్ట్రంలో విద్యుత్ పొదుపుపై ప్రజల్లో అవగాహన కల్పించడమే గాక ఆర్థికంగా దీర్ఘకాల ప్రయోజనాలకు నాంది పలికారు.

సాధారణ బల్బుల స్థానంలో ఎల్ఈడి బల్బులను అమర్చడం వలన విద్యుత్ బల్లులు ఆదా అవ్వడమే కాక, వీటి జీవిత కాలం కూడా ఎక్కువ కాబట్టి పదే పదే బల్బులను మార్చవలసిన అవసరం లేదని విద్యుత్ వినియోగదారులు హర్షం వ్యక్తం చేస్తున్నారు. ముఖ్యమంత్రి నాయకత్వంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం మరెన్నో విజయాలను సాధించి ప్రపంచానికే ఆదర్శంగా నిలుస్తుందని ప్రజలు ఆకాంక్షిస్తున్నారు.




అనూరాధ
పీఆర్ ఓ, ఏపీ ట్రాన్స్ కో



# అపర ధన్వంతరి

## ఆయుర్వేద భూషణ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు రసశాస్త్రంపై పట్టు సాధించి మరో నాగార్జునుడిగా కీర్తి పొందారు.

శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి పేరుతో ఇద్దరు ప్రముఖులు రాజమహేంద్రి కేంద్రంగా గత శతాబ్ది తొలినాళ్ళలో దీపస్తంభాలై నిలిచారు. తెలుగు జన జీవితంలో వెలుగులు నింపిన ఆ ఇద్దరూ ఉద్దండులే! ఒకరు మహాకవి. ఇంకొకరు మహావైద్యులు.

మహాకవి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు (1866–1960) ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థానకవి. జన మనోహర భాషలో పత్రికలు రావాలనే లక్ష్యంతో 1901 లో రాజమండ్రి నుండి "గౌతమి" దినపత్రికని తెచ్చిన జాతీయ వాది. రామాయణం, భారతం, భాగవతం మూడింటినీ తెలుగు వచన అనువాదం చేశారు.

రెండవ వారు మహావైద్యునిగా కీర్తి గడించిన రసవైద్య నిపుణులు, ఆయుర్వేద భూషణ, భిషగ్వర శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారు. రసశాస్త్రంపై పట్టు సాధించి మరో నాగార్జునుడిగా కీర్తి పొందారు. 'అనుభవ దీపిక', 'ఆయుర్వేదౌషధ రత్నాకరం', 'ఆంధ్ర భైషజ్య రత్నావళి', 'భస్మప్రకాశిక' మొదలైన గ్రంథాలను ఒక వైద్యుడుగా, ఒక ఫార్మాసిష్టుగా తన అనుభవాలు రంగరించి రచించారు. 'చరక సంహిత' ఆరు స్థానాలనూ 'స్థానషట్కం' పేరుతో అనువదించి, తులనాత్మక వ్యాఖ్యానంతో ప్రచురించారు. పరిశోధనాత్మకంగా, సాధికారికంగా ఈ వ్యాఖ్యానం సాగుతుంది. చికిత్సా విధానంలో కొత్త పోకడలకు దారులు వేశారు. వైద్యశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిగారి కృషి వైద్య ప్రపంచంలో చిరస్మరణీయమైంది.

"ఔషధం గుణాలూ, వైద్యుడి మనోశక్తి రెండూ తోడైనప్పుడే చికిత్స విజయవంతం అవుతుంది" అంటారాయన. మనసా వాచా పరిశుద్ధుడై "ఈ మందుని ఇస్తున్నాను. ఇది పని చేసి తీరాలి"అనే గట్టి సంకల్పంతో ఔషధ ప్రయోగం చేస్తే అది మరింత పనిచేస్తుందనీ, రోగిని మోసగించో, అబద్ధాలు చెప్పో డబ్బు గుంజాలనే ఆలోచన లేకుండా రోగి బాధ తగ్గటమే లక్ష్యంగా ఔషధం ఇవ్వాలనీ ఆయన నమ్మకం. అలాంటివైద్యుల్ని అమృత హస్తులుగా కొలుస్తారు. శాస్త్రి గారి హస్తవాసి రాజమహేంద్రి, పరిసర ప్రజలకు బాగా తెలుసు. పురప్రముఖులు శ్రీ వై. యస్.నరసింహారావు గారు కోటిపల్లి బస్టాండ్ దగ్గర మెయిన్ రోడ్డు మీదే శాస్త్రి గారి ఆసుపత్రి ఉండేదన్నారు. వైద్యసేవ తప్ప మరో ధ్యాస లేని నిస్వార్ధుడిగా ఆయన గురించి చాలా మంది పెద్దలు చెప్పారు.

'కృష్ణపండితీయం' అనే నామాంతరం కలిగిన తన "ఆయుర్వేదౌషధ రత్నాకరం" గ్రంథంలో ఆయన చెప్పుకున్న ప్రవరను బట్టి, కౌశిక సగోత్రికులైన శ్రీపాద సోమయాజిగారు ఆయన తండ్రి! సుబ్బమ్మగారు తల్లి! కోనసీమలో మోడేకుర్రు గ్రామం ఆయన పుట్టిన ఊరు. బహుశా అది మాతామహుల గ్రామం కావచ్చు! ఏడుగురు మగపిల్లలూ, ముగ్గురు అక్కచెల్లెళ్ళ మధ్య రెండవ సంతానం మన శాస్త్రిగారు.

సహజంగా స్థితిమంతులు కావటాన, ఒకరిపైన ఆధారిత జీవనం లేనందున, వైద్యపరంగానూ, ఔషధపరంగా కూడా తాను తేదలచిన మార్పుల్ని నిస్సంకోచంగా తీసుకు వచ్చారాయన. నేటికీ అవి ప్రామాణికమే! వైద్యంలో తనదైన ముద్ర, తన వంతు పాత్ర, తను సూచించే మెరుగులు, తాను ప్రదర్శించిన మెరుపులు. ఇవి కృష్ణమూర్తి శాస్త్రి గారిని చిరంజీవిని చేశాయి. గోదావరీ తీరం పండిత పరివేష్టితం కాబట్టి, తన కృషికి కావల్సిన సహృదయత ఆయనకు దొరికింది. అదొక కలిసొచ్చిన అంశం.

1925–27 మధ్య కాలంలో శాస్త్రిగారు బెజవాడ రామమోహన కళాశాలలో ప్రతివాద భయంకర కృష్ణమాచార్యుల వారు తి.ప.రామానుజ స్వామి గార్లతో కలిసి ఉపాధ్యాయులుగా పనిచేశారు. దగ్గరగా విద్యార్థిని కూచోబెట్టుకుని లాలించి బోధించే పద్ధతిలో ఆయన రచనలు ఉండటానికి ఆయనలో ఉన్న ఆ ఉపాధ్యాయుడే కారణం.

భయమూ ఉదాసీనతల వలన ఆయుర్వేద వైద్యులు శాస్త్రంలో చెప్పిన ఎన్నో ముఖ్య ఔషధాలను ప్రయోగించటానికి జంకుతున్నారు. ఆ భయాన్ని పోగొట్టటానికి శాస్త్రంలో చెప్పిన అనేక యోగాల

తయారీని, పాటించవలసిన మెళకువల్నీ తెలియ చెప్పటం ఒక అవసరంగా భావించారాయన. వాటి తయారీ విధానాన్ని మెరుగు పరచి, మార్పులు చేసి, తేలిక పరిచి, తయారు చేసి చూసి, తన అనుభవాన్ని డైరీల్లో నమోదు చేశారు. రస, గంధకాదుల శుద్ధితో మొదలు పెట్టి, పుటం పెట్టింది లగాయితూ ఔషధం తయారయ్యే వరకూ వండుతున్నప్పుడు ఆ ఔషధంలో వచ్చే పరిణామ క్రమాలు , రంగు రుచి వాసనలతో సహా వివరాలన్నీ ఘడియ కొకసారి నమోదు చేశారు. దానినే అనుభవదీపిక గ్రంథంగా సలహాలూ సూచనలతో ప్రచురించారు.

"ఇంతయేల? ఈ పుస్తకమును వ్రాయునప్పుడు మేము అనేక చిత్ర విచిత్రములగు మార్పులను చేయుటచే, షుమారు 20 సంవత్సరముల నుండియు సంపాదించిన జ్ఞానము కంటె అనేక విధములగు జ్ఞానమును సంపాదించితిమి. ఇంతకంటె మేమేమి వ్రాయవలయునో మాకే తెలియ కున్నది" అని 'అనుభవదీపిక' గ్రంథం గురించి చెప్పుకున్నారాయన. వ్రాయవలసిందంతా వ్రాశానన్న ఆత్మవిశ్వాసం ఆ మాటల్లో తొణికిస లాడుతుంది. తెలుగులో ఇలాంటి పుస్తకం లేదని సగర్వంగా చెప్పగల రచనలు అనేకం చేశారాయన.

వైద్య రహస్యాల్ని ఇలా అచ్చువేయటం వలన 'గుట్టు' పోతుందని, గౌరవం ఉండదనీ కొందరు అభ్యంతర పెట్టినప్పుడు కృష్ణమూర్తి శాస్త్రిగారు "రహస్యములు బయలు పడుట చేతనే ఏ శాస్త్రమైననూ అభివృద్ధి నొందగలదనియు, గౌరవమును పొంద గలదనియు నా యభిప్రాయము" అని సమాధానం చెప్పారు.

సూతికాభరణము, త్రైలోక్య చింతామణి, నవరత్న చింతామణి లాంటి ఔషధాల తయారీ అందరికీ సాధ్యం అయ్యేది కాదు. వాటి తయారీకి, వాటిని వైద్యులు ప్రయోగించటానిక్కూడా ప్రావీణ్యం కావాలి. ఆ ఔషధాల తయారీ, అందులో కలిసే ద్రవ్యాల గురించిన అవగాహన ఉంటే ఆత్మవిశ్వాసంతో చికిత్స చేయగలుగుతారు. రజతలోహా రసాయనం, కస్తూరి మాత్రలు ఇలాంటివి తెప్పించి రోగులకు వాడుతున్న వైద్యులు వాటిలో ఏవేవి కలిశాయో, వాటి తయారీ ఎలా జరిగిందో, ఆలోచించ కుండానే వాడేస్తున్నారని, తయారీదారులూ ఆ వివరాలను చెప్పటం లేదనీ, ఇలా చేయటం న్యాయమా అని ప్రశ్నిస్తారాయన. ఇంచుమించు వందేళ్ళ క్రితం ఏ సమస్యని ఆయన లేవనెత్తి ప్రశ్నించారో ఆ సమస్య అంతో ఇంతో పెరిగిందే గానీ, తగ్గలేదు.

ఒకవైపు రోగుల్ని చూసుకుంటూ, ఇంకో వైపు, ముడిఖనిజాలు, లోహాలు, మూలికలను శుద్ధులు చేసుకుంటూ వైద్యుడి పాత్రనీ, తయారీదారు పాత్రనీ ఒకేసారి పోషించారాయన. అందరికీ అది సాధ్యపడకపోవచ్చు! ప్రామాణికత కలిగిన ఫార్మసీలు నమ్మకమైన ఔషధాలు ఇచ్చినప్పుడు వైద్యులకు చికిత్సపైన ప్రయోగాలకు ఎక్కువ అవకాశం ఉంటుందంటారాయన.




1957లో ఓ పత్రికలో ప్రచురితమైన ప్రకటన

శాస్త్రి గారు ప్రముఖంగా చెప్పిన ఔషధాలలో 'కాంతవల్లభరసం' ఒకటి! క్షీణింప చేసే వ్యాధుల్లో రోగిని బతికించేందుకు విష్ణువే స్వయంగా చెప్పిన ఔషధంగా దీన్ని ఆయన పేర్కొన్నారు. దీని గురించి శాస్త్రిగారు సూచించిన విధంగా రోగులకు ఇచ్చినప్పుడు టిబీ, ఎయిడ్స్, హెపటైటిస్, డెంగ్యూ లాంటి క్షీణింప చేసే వ్యాధుల పైన, అర్థరైటిస్, చికుంగున్యా లాంటి వాత వ్యాధుల పైన ఇది గొప్పగా పనిచేస్తోన్నతీరుని ఈ వ్యాసకర్త కూడా గమనించటం జరిగింది. శాస్త్రిగారు చెప్పిన మెళకువలు ఆయుర్వేద ప్రాక్టీషనర్లకు బాగా ఉపయోగపడతాయి.

'కాంతవల్లభరసం' ఔషధాన్ని నాలుగైదు కుప్పెల్లో ఉంచి ఇసుక నింపిన పాత్రలో (వాలుకాయంత్రం) ఉంచి, ఐదారు రోజుల పాటు వండే విధానం వివరిస్తూ, గాజుకుప్పెలో ఔషధం పాకానికి వచ్చిందో లేదో తెలియటానికి ఒక గాజు కడ్డిని ముంచి తీసి చూస్తే, మణిశిల పచ్చగా అంటుకుని ఉంటుందనీ, పాదరసం తెల్లగా పట్టుకుంటుందనీ, గంధకం వాసన పూర్తిగా పోయాక పాకం పూర్తవుతుందనీ వివరించారు. ఇలా ఔషధం సక్రమంగా తయారైందని నిర్ధారించే పరిక్షలెన్నో ఆయన చెప్పారు.

రోగి కోరే ఔషధం కాబట్టి 'కాంతవల్లభ రసం' అని, వసంత ఋతువులో పూసే పూవుల రసంతో భావన (నానబెట్టటం) చేసి ఔషధం తయారు చేస్తారు కాబట్టి, వసంత కుసుమాకరం అనీ, పదహారు భాగాలు గంధకం కలుస్తుంది కాబట్టి, చంద్రుడి పదహారు కళలకు గుర్తుగా, 'పూర్ణచంద్రోదయం' అనీ, సిద్ధుల కోసం చెప్పింది కాబట్టి, 'సిద్ధమకరధ్వజం' అని, చంద్రుడిలా చలవచేస్తుంది కాబట్టి 'తారకేశ్వర రసం' అని, ఇలా ప్రతి ఔషధానికి ఆ పేరు ఎలా వచ్చిందో ఆయన చక్కగా విపులీకరించారు.

శీతాంశు రసాన్ని ఆనందభైరవినీ అల్లం రసంతో ఇస్తే దీర్ఘకాలంగా తగ్గని శీతపైత్య జ్వరాలు తగ్గుతాయి, తేలుకాటుకు విరుగుడుగా ఉపయోగపడుతుంది. సిందూరభూషణం వేడి వలన వచ్చే దగ్గు మీదా, సువర్ణ భూపతి కఫ దోషం వలన వచ్చే దగ్గుమీద, లోకనాథ రసం అజీర్తి వలన కలిగే దగ్గు మీద, మహాలక్ష్మీవిలాసరసం ద్వంద్వ దోషాలవలన వచ్చే దగ్గు మీద ఇలా ఒకే వ్యాధి పైన వివిధ ఔషధాలను ఎలా ప్రయోగించాలో తెలియచెప్పే handbook లాగా ఆయన రచనలు వైద్యులకు ఉపయోగ పడతాయి. మాత్రలు చేసేప్పుడు బిగింపు (binding) కోసం తేనె, ద్రాక్షలాంటివాటికి బదులుగా తుమ్మబంకని కలపటాన్ని ఆయన తీవ్రంగా నిరశించారు. కొండవీటి చాంతాడంత ప్రిస్క్రిప్షన్లు ఇచ్చే నేటి కాలపు పద్ధతుల్ని ఆయన ఖండించారు. అనేక ఔషధాల్ని ఒకేసారి ప్రయోగించటం వలన వికృతి కలుగుతుంది. అలాంటప్పుడు మందుల్ని బాగా తగ్గించి, ఒకటికో రెండుకో పరిమితం చేయాలి. లేదా కొన్ని రోజులపాటు ఏ మందూ వేయకుండా ఆపటమే మంచిదంటారాయన.

"కరోమి సూక్ష్మయా బుద్ధ్యా లోక రంజక ముత్తమమ్" ధర్మార్థ సుఖసాధనం అయిన ఆయుర్వేద మహాశాస్త్రాన్ని నేర్పిన గురుదేవులు పండిత దీవి గోపాలాచార్యుల వారికి నమస్కరించి, లోకం మేలు కోసం తన గ్రంథ రచన సాగాలని ఒక లక్ష్యాన్ని పెట్టుకుని ఆయన ముందుకు నడిచారు. లోకం మేలు కోరటం వైద్యుడి కర్తవ్యం.

ఔషధంలో కలప వలసిన మూలద్రవ్యాలు, వాటి శుద్ధి, వండవలసిన తీరు, పక్వానికి పరిక్షలు, దాన్ని ప్రయోగించ వలసిన వ్యాధులు, మోతాదు, అనుపానం ఇన్ని విషయాలనూ సంస్కృత శ్లోకాలలో వ్రాసి, వ్యాఖ్యానం కూడా జోడించి ప్రచురించిన 'ఆయుర్వేదౌషధ రత్నాకరం, అనుభవ దీపిక, భస్మప్రకాశిక గ్రంథాలు వైద్యులకు కరదీపికలు కాగా, చరకానికి వారి వ్యాఖ్యానం గొప్ప మార్గదర్శక గ్రంథంగా నిలిచింది. రస శాస్త్రం పైన, వంటౌషధాల పైన అంతటి పట్టువున్న వైద్యులు అపురూపం..



డా జి వి పూర్ణచందు
ప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులు, సాహితీ వేత్త, పరిశోధకులు

# ఆంధ్రప్రదేశ్ అభివృద్ధి లక్ష్యాలు

మానవ, ఆర్థిక వనరుల ప్రగతి సూచికల ఆధారంగా 2029 నాటికి ఆంధ్రప్రదేశ్‌ను దేశంలోని అత్యుత్తమ రాష్ట్రాలలో ఒకటిగా అభివృద్ధి చేయడానికిగాను, రానున్న ఈ 15 ఏళ్లలో రాష్ట్రప్రభుత్వం నిర్దేశించుకున్న లక్ష్యాలు

- రాష్ట్రస్థాయి స్థూల దేశీయోత్పత్తి (జి ఎస్ డి పి) లో 15 ఏళ్లపాటు నిలకడగా 10 నుంచి 15 శాతం వార్షికాభివృద్ధి రేటు సాధించడం
- పెట్టుబడులకు, పరిశ్రమల ఏర్పాటుకూ బాగా సానుకూలమైన రాష్ట్రంగా 2016 నాటికి అవతరించడం
- 2016 నాటికి సునాయాస వాణిజ్యానికి నెలవైన అత్యుత్తమ రాష్ట్రంగా ఏర్పడటం
- 2018 నాటికి పారిశ్రామిక, మౌలిక వసతులు, సేవారంగాల్లో పెట్టుబడులకు గమ్యస్థానం కావడం
- 2018 నాటికి నైపుణ్యం పెంపు, ఉపాధి కల్పనలో మేటిగా నిలవడం
- ఫలవంతమైన పెట్టుబడులతో సామర్థ్యం, నాణ్యతలపరంగా 2019 నాటికి దేశంలోనే అత్యుత్తమ రాష్ట్రంగా పేరొందడం
- 2019 నాటికి పరిశోధన, నవ్యావిష్కరణ, వ్యవస్థాపకరంగాలకు కీలకమైన కేంద్రంగా ఆవిర్భవించడం
- నాలెడ్జ్ & టెక్నాలజి హబ్, సెంటర్ ఫర్ ఇన్నోవేషన్ అండ్ ఎక్సలెన్స్ ఏర్పాటు ద్వారా 2022 నాటికి ప్రతి ఉద్యోగినీ దేశంలోనే అత్యుత్తమంగా తీర్చిదిద్దడం
- మరో 15 నుంచి 20 ఏళ్లకు పైగా నిలకడైన రెండంకెల ఆర్థికాభివృద్ధి సాధించడం ద్వారా 2035 నాటికి ఆంధ్రప్రదేశ్ ఆర్థిక ముఖచిత్రాన్ని సమూలంగా మార్చడం



# ఏడాదిలో ఏపికి కేంద్ర నిధుల వెల్లువ

## క్రియాశీల ఎంపీల కార్యసాధన



న్యాయశాఖ మంత్రి సదానంద గౌడకి వినతిపత్రం అందజేస్తున్న ఎంపి మురళీ మోహన్, కంభంపాటి

చరిత్రలో ఒక కూడలి మలుపులో ఆంధ్రప్రదేశ్ ఉంది. రాష్ట్ర విభజన ఏపీని సంక్షోభంలోకి నెట్టింది. రాజధాని లేదు, రూ. 16, 000 కోట్ల లోటు బడ్జెట్, పరిశ్రమలు లేవు, ఉపాధి లేదు. మౌలిక సదుపాయాలూ లేవు. ఈ పరిస్థితిలో రాష్ట్ర ఎంపీలు, ఢిల్లీలో ప్రభుత్వ ప్రతినిధిపై ఆంధ్రప్రదేశ్‌కు కేంద్రం నుంచి నిధులు, సంస్థలు సాధించడంలో ఇతోధిక బాధ్యత నెలకొంది. ఈ బాధ్యత అప్పగించిన ముఖ్యమంత్రి నారా చంద్రబాబు నాయుడు నమ్మకాన్ని నిలబెట్టారు.

ఢిల్లీలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రత్యేక ప్రతినిధిగా కంభంపాటి రామమోహనరావు రాష్ట్రానికి పెద్ద ఎత్తున నిధులు, ఎనలేని ప్రయోజనాలు సాధించడంలో ప్రముఖపాత్ర వహించారు. ఆయన బాధ్యతలు చేపట్టి ఏడాది అయింది. ఈ ఏడాదిగా ఆయన ముఖ్యమంత్రి చంద్రబాబు అప్పగించిన బాధ్యతల నిర్వహణ, పనితీరులో సఫలీకృతులయ్యారు. కేంద్ర, రాష్ట్ర మంత్రులు, ఎంపీల సహకారంతో ఆయన రాష్ట్రానికి ఎన్నో ప్రయోజనకరమైన ఫలితాలు సాధించారు.

విభజన చట్టంలో ఇచ్చిన అన్ని హామీలను నెరవేర్చేలా ఎప్పటికప్పుడు ఎంపీలు కేంద్రంపై ఒత్తిడి తెచ్చారు. పోలవరం నిర్మాణానికి ఉన్న ఆటంకాలను తొలగించేందుకు, 7 ముంపు మండలాలను ఏపీలో కలిపేలా ఆర్డినెన్స్ తెప్పించగలిగారు. మొదటి క్యాబినెట్ భేటీలోనే పోలవరం అభివృద్ధి మండలి ఏర్పాటు చేయింకాగలిగారు.రాష్ట్ర ప్రభుత్వం ఖర్చు చేసిన రూ. 250 కోట్లు కేంద్రం నుంచి సాధించగలిగారు. కేంద్ర బడ్జెట్ లో రూ. 100 కోట్లు కేటాయిస్తే పట్టుబట్టి మరో రూ. 900 కోట్లు కేటాయించేలా ఒత్తిడి తెచ్చి సఫలీకృతులయ్యారు.

రాష్ట్రానికి మంజూరైన 11 ఉన్నత విద్యాసంస్థలకు కేంద్ర బడ్జెట్‌లో నిధులు కేటాయించేలా చేశారు. ఇప్పటికే 5 విద్యాసంస్థలకు (ఐఐఎం, ఐఐటీ, ఐఐఎస్ఈఆర్, ట్రిపుల్ ఐటీ, ఎన్ఐడీఎం) శంకుస్థాపనలో ముఖ్యమంత్రితోపాటు కేంద్ర మంత్రులు పాల్గొనేలా చేశారు. గిరిజన విశ్వవిద్యాలయం, కేంద్రీయ విశ్వవిద్యాలయం, అగ్రికల్చర్ యూనివర్శిటీ, ఎయిమ్స్‌లకు త్వరలోనే శంకుస్థాపనకు సిద్ధం కావడంలో కేంద్ర సహకారం లభించేలా చూశారు. రాష్ట్ర రెవెన్యూ లోటు భర్తీకి రూ.2,300 కోట్లు కేంద్రం ఇచ్చింది. ఇంకా నిధులు సాధించడానికి కృషి జరుగుతోంది.

కొత్త రాజధాని అమరావతిలో రోడ్లు, నీటి, సరఫరా, డ్రైనేజీ, మౌలిక వసతులకు రూ.1000 కోట్లు, సచివాలయం, హైకోర్టు రాజ్ భవన్ నిర్మాణానికి రూ. 500 కోట్లు కేంద్రం నిధులు రాబట్టగలిగారు. 7 వెనుకబడిన జిల్లాల అభివృద్ధికి రూ.3500 కోట్లు విడుదల జరిగింది. పరిశ్రమల స్థాపనకు ప్రోత్సాహాలు, 15 శాతం అడిషినల్ డిప్రిసియేషన్, 15 శాతం కేపిటల్ అలవెన్స్ ఇచ్చేలా చేశారు.

13వ ఆర్థిక సంఘం నిధులు రూ. 3,777 కోట్లు విడుదలయ్యాయి. సెంట్రల్ సేల్స్ ట్యాక్స్ కాంపన్సేషన్ రూ. 610 కోట్లు, స్మాల్ సేవింగ్స్ ఫండ్ రూ. 549 కోట్లు, స్టేట్ స్పెసిఫిక్ గ్రాంట్స్ రూ. 215 కోట్లు విడుదల విషయంలో ఎంపీలు చొరవ చూపారు.

దక్షిణ భారత దేశంలో హీరో మోటోకార్ప్ మొదటి ప్లాంట్ ఆంధ్రప్రదేశ్ లో ఏర్పాటు చేయడంలో కీలక భూమిక వహించారు. ఎర్రచందనం దుంగలను విదేశాలకు ఎగుమతి చేయడానికి గడువును పెంచే విధంగా కేంద్రం గజిట్ నోటిఫికేషన్ ఇచ్చేలా కృషి చేసి సాధించారు. రాష్ట్ర మంత్రులు, ఆయా విభాగాల సహకారంతో కేంద్రం అమలు చేసే పలు పథకాలకు మంజూరు చేసే నిధులు రాబట్టేలా కృషి చేశారు.

హిమాచలప్రదేశ్ లో అకస్మాత్తుగా నది పొంగగా కొట్టుకుపోయిన తెలుగు విద్యార్థుల శవాలను వెతికి తల్లిదండ్రులకు అప్పగించడంలో, ఒడ్డుకు చేరిన విద్యార్థులను ఇళ్ళకు చేర్చడంలో, జమ్మూ-కాశ్మీర్‌లో వరదలు, నేపాల్ లో సంభవించిన భూకంపం సందర్భంగా తెలుగు యాత్రీకులను స్వస్థలాలకు చేర్పించే వరకూ సహాయక చర్యలను సమర్థంగా నిర్వహించడంలో తోడ్పాటు నందించారు.

గోదావరి పుష్కరాలకు కేంద్రం రూ. 100 కోట్లు మంజూరు జరిగేలా చూశారు. గుంటూరు జిల్లా మంగళగిరిలో జాతీయ విపత్తుల నిర్వహణ సంస్థ ఏర్పాటులో డీపీఆర్ సమర్పించడంలో సహకారం అందించారు. ఫ్లోరీకల్చర్ ఇన్‌స్టిట్యూట్, ఫుడ్ ప్రాసెసింగ్ ఇన్‌స్టిట్యూట్, సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ప్లాస్టిక్ ఇంజనీరింగ్ అండ్ టెక్నాలజీ, నేషనల్ డిజైన్స్ ఇన్‌స్టిట్యూట్ వంటి కొత్త సంస్థలను ఆంధ్రప్రదేశ్ లో ఏర్పాటు చేయడంలో కేంద్రాన్ని ఒప్పించేందుకు తీవ్ర ప్రయత్నాలను చేస్తున్నారు. నెల్లూరు జిల్లా కామధేనులో బోవైన్ బ్రీడింగ్ సెంటర్ ఏర్పాటుకు రూ. 59 కోట్లు మంజూరు చేయించగలిగారు. అంతర్వేదిపాలెంలో రూ.78 కోట్లతో ఫిషర్‌మెన్ హార్బర్ ఏర్పాటు, కరవు సహాయ చర్యలకు రూ. 237 కోట్ల మంజూరు చేయించగలిగారు. నెల్లూరు జిల్లా కృష్ణపట్నంలో మెగా లెదర్ పార్క్ మంజూరు చివరి దశకు చేరుకుంది. ఏడాదికాలం తక్కువ సమయమైనా, గతంలో ఎప్పుడూ లేనంత స్థాయిలో రాష్ట్ర ఎంపీలు, మంత్రులు, ప్రభుత్వ ప్రతినిధులు, ఉన్నతాధికారుల కృషి మాత్రం ఘనమైనదనే చెప్పాలి.



పెరుమాళ్ళ నాగరాజు
మీడియా లైజనింగ్ అధికారి

# గోదావరికి నడక నేర్పిన బ్రిటిష్ దొర

"అఖండ గౌతమీ తీరే
అపర భగీరథీన కాటన్
మహాశయేన నిర్మితే
గౌతమి సేతుబంధి
నిత్య గోదావరీస్నాన
పుణ్యోదయోమతిః
స్మరామాంగ్లోదేశీయం
కాటనంతం భగీరథం"

మహారాష్ట్రుల ఆడపడుచుగా అవతరించిన గోదావరి నది తెలుగు వారి కోడలుగా అఖండ గౌతమిగా ఆరాధింపబడుతోంది. పుణ్యప్రదమైన గోదావరిలో తీర్థవిధులు నిర్వర్తించే తర్పణ సందర్భంలో ఒక బ్రిటిష్ దొరను తలుచుకోవడం, తీర్చుకోలేని ఋణానుబంధంతో సంస్మరించడం, కృతజ్ఞతాంజలి ఘటించడం అపురూపమైన సందర్భం.

ఒకప్పుడు దండకారణ్య దైవతీర్థమైన గోదావరి నదీ ప్రవాహానికి నడక నేర్పవలసి వచ్చింది. ఐహిక, ఆముష్మిక జీవ ప్రదాతగా యుగాల తరబడి పుణ్యప్రదమైన గోదావరి, తూర్పుకనుమల ప్రకృతి రమణీయతతో పాపికొండలను తరింపచేసి, రాజమహేంద్రి మీదుగా బంగాళఖాతం వైపు ప్రవహించి, ధవళేశ్వరం వైపు కదిలి సముద్రంలో కలుస్తోంది. 1832–33 సంవత్సరాలలో నందనక్షామం (దీన్నే గుంటూరు కరువు అంటారు) విపరీత ప్రకృతి వైపరీత్యంగా తెలుగు జనావళిని అతలా కుతలం చేసింది. ఘోరమైన కరువు కాటకాలతో, త్రాగునీరు కూడా లేక 3లక్షల మంది ప్రజలు, 2లక్షల పైగా పశువులు మృత్యువాత పడ్డాయి. నాటి కృష్ణా, గుంటూరు జిల్లాలు పీనుగుల కుప్పలుగా మారిపోయాయి. వర్షాధారంపై ఆధారపడే మెట్ట పంటలు పండించి జీవించే ముతక సాగు తరచు నదికి సంభవించే వరద ఉధృతిలో కొట్టుకు పోయేది. సాగునీటి మాట దేవుడెరుగు. త్రాగటానికి నీటి కరువుతో వరదలు, కరువు కాటకాలతో



జనం మలమలమాడిపోయారు. రెండు శతాబ్దాల నాటి దుర్భర జీవన హేల అది.

### మానవతావాది కాటన్ దొర

గోళ్ళూడగొట్టి పన్నులు వసూలు చేసే ఈస్టిండియా కంపెనీ, లేదా బ్రిటిష్ ప్రభుత్వానికి, కొల్లగొట్టి దోచుకొనే పాలనా దుష్టత్వం తప్ప బానిస జనావళిపై కనికరం, జాలి, దయలేదు. 1821 సెప్టెంబరులో ఇండియాలోని మద్రాస్ చీఫ్ యింజనీరు ఆఫీసులో ఉద్యోగంలో చేరేనాటికి సర్ ఆర్థర్ కాటన్ వయస్సు కేవలం 18 సంవత్సరాలు. 1825–27లలో మద్రాసు తటాక విభాగంలో ఇంజనీరుగా విధులు నిర్వర్తించేవాడు. నాటి దక్షిణాది కావేరీ, గోదావరి, కృష్ణానదులు సృష్టించే వరద బీభత్సం, మృత్యుహేల ఆ యువ ఇంజనీర్ హృదయాన్ని కదిలించాయి. మే 15, 1803న ఇంగ్లాండులో పుట్టిన కాటన్ ఇండియాలో అడుగుపెట్టడమే దైవ సంకల్పంగా భావించవలసి ఉంది. తదనంతర భవిష్యత్ స్వతంత్ర భారతదేశంలో, ఇరిగేషన్ ఇంజనీర్లుగా నవజీవన ప్రదాతలైన మోక్షగుండం విశ్వేశ్వరయ్య, కె.ఎల్.రావు వంటి మహనీయులకు ఎందరికో కాటన్ ఆదర్శప్రాయుడు. జీవనదీ జలాలను ఆనకట్టలు నిర్మించి అదుపుచేసి, జనజీవన సౌభాగ్యానికి వినియోగించాలని అదే ప్రభుత్వ ధర్మమని బ్రిటిష్ రాజనీతికి కనువిప్పుకలిగించిన మహోన్నత స్వభావి కాటన్. కరువు కాటకాల జన జీవన్మరణ సంక్షోభం ఎదుర్కోవటానికి లాభనష్టాల పెట్టుబడిదారీ బేరీజు తగదని హెచ్చరించిన మానవతా వాది కాటన్ దొర. లెఫ్టినెంట్ కాటన్ ఈస్టు ఇండియాకంపెనీలో వుండగా కోయంబత్తూరు, మధురై, తంజావూర్ జిల్లాలలో చెరువుల మరమ్మత్తులు, వాటి నిర్వహణ, సాగునీటిని నిల్వచేసి వినియోగించే ఇంజనీరింగ్ ప్రక్రియలకు స్వీకారం చుట్టారు. 1828లో కెప్టెన్‌గా పదోన్నతి పొంది కావేరీ డెల్టానీటి పారుదల, వరదల సమస్యలు పరిష్కరించాడు. 1830 ప్రాంతం నాటికి అతివృష్టి, అనావృష్టి, వరదలు, తుఫాన్‌లు గోదావరి ప్రాంతాలను తీవ్ర దుర్భిక్షంలోకి నెట్టివేసిన దుర్భిక్ష దినాలవి. 1789లో ఈస్టిండియా కంపెనీ అధికారి టోపింగ్, గోదావరి తీర ప్రాంతాన్ని సర్వేచేసి ఆనకట్ట నిర్మాణాన్ని ప్రతిపాదించాడు. ఆ ప్రతిపాదన బుట్టదాఖలయ్యింది. కానీ, ఆనకట్ట నిర్మాణం జనం చావుబతుకుల సమస్యగా 1844లో స్పెషల్ కమిషనర్ హెన్రి మోంట్గోమెరీ ప్రభుత్వాన్ని హెచ్చరించాడు. ఆ సిఫార్సుల మేరకు

మద్రాస్ ఇంజనీర్ కెప్టెన్ కాటన్, నాటి మద్రాస్ గవర్నర్ మార్టిన్ ట్వీడేల్ ప్రోత్సాహంతో 1845లో నివేదిక మళ్ళీ సమర్పించాడు. 1846 డిసెంబరు 23న లండన్‌లోని కోర్టు ఆఫ్ డైరక్టర్స్ ప్రాజెక్ట్ మంజూరు యిచ్చారు.

## డెల్టా శిల్పి - ఆనకట్ట ఆలయం

ఇంజనీరింగ్ మేథావి సర్ ఆర్థర్ కాటన్ 1848 నుంచి రాత్రింబగళ్ళు శ్రమించారు. అశ్వం వాహనంగా అరటి పళ్లు ఆహారంగా, గోదావరీ పరీవాహక ప్రాంతాలు, నదీగర్భంలోని వైవిధ్య స్థితిగతులు క్షుణ్ణంగా అధ్యయనం చేసి ఆనకట్టకు రూపకల్పన చేశారు. సిమెంటు, కరెంటు లేని రోజులలో రాజమండ్రి సమిప ప్రాంతాల క్వారీల రాయి తరలించటం ఎంతో ప్రయాసతో కూడిన విషయం. కాటన్ పూనికతో కార్యాచరణ ప్రారంభమైంది. మొత్తం సబ్సిడరీ పనులు కూడా కలిపి 12 లక్షల అంచనా సిద్ధమైంది. ధవళేశ్వరం నుంచి 11,85.17 అడుగుల ధవళేశ్వరం, ర్యాలీ, మద్దూరు, విజ్జేశ్వరం నాలుగు సెక్షన్‌ల, బృహత్తర నిర్మాణం చేపట్టారు. ధవళేశ్వరం దగ్గర 9.75 మైళ్ళ గోదావరి వెడల్పు ఉండగా పిచ్చికల లంక, బొబ్బర్లంక, మద్దూరులంక ఐలండ్‌లున్నాయి. ముందు 12 అడుగులు ఎత్తు నిర్ణయించినా దూరదృష్టితో డిజైన్ మార్పులు చేశారు. దానితో 26.6 మిలియన్‌ల వ్యయానికి పెరిగింది. సాంవత్సరికంగా లభించే ఆదాయం పెరగటంతో బ్రిటిష్ ప్రభుత్వం కొంత సమాధానపడింది. 1854 నాటికి ఆనకట్ట పూర్తయింది. 1850, 1852, 1853, 1857, 1878, 1886 గోదావరి వరదలు, ఇతర ఇంజనీరింగ్ సాంకేతిక అవాంతరాలను కాటన్ అత్యంత ఇంజనీరింగ్ నిపుణుడైన మేథావిగా పరిష్కరించి విజయవంతం చేశారు. తూర్పు, పశ్చిమ డెల్టా శిల్పిగా, పంటకాలువల నిర్మాణం, స్లూయిస్‌లు గోదావరి జిల్లాలలో 12 లక్షలకు పైగా సాగుకు అవకాశంలో సస్యశ్యామలమై రాష్ట్రానికే ధాన్యాగారంగా వాసికెక్కింది. జల మార్గరవాణాకు శ్రీకారం చుట్టారు. 1847నుంచి 1862 అయిదేళ్ళ అద్భుత కట్టడ నిర్మాణానికి మొత్తం 16 లక్షల 50 వేలు నాటి అంచనా వ్యయంకాగా 1894 నాటికి ప్రత్యక్షంగాను, పరోక్షంగాను మార్పులు, చేర్పులు యితర అభివృద్ధి పనులకు కోటి యిరవై ఎనిమిది లక్షలు వినియోగంగా నిర్ధారించారు. తొలి అయిదేళ్ళలో 10,000 మంది శ్రామికులు, 500 మంది వడ్రంగులు, 500 మంది కమ్మరులు, ఓవర్సీర్ వీరన్నవంటి ఎందరో కష్టించే ఉద్యోగులు ఎన్నో ఒడిదుడుకులను ఎదుర్కొంటూ నిర్మాణంలో రాత్రింబగళ్ళు శ్రమించారు. ఆధునిక పరికరాలు, వసతులు, రవాణా,కనీస భోజన ఏర్పాట్లు లేని ఆ రోజులలో గుర్రంపై మైళ్ల కొద్దీ తిరుగుతూ శక్తివంచన లేకుండా కష్టపడిన త్యాగధనుడు కాటన్. కలరావంటి అనారోగ్య స్థితిగతులు, పాములు వరదనీటి ముంపుతో కుటీర నివాసాలు ఏ యిబ్బందీ, ఏ సమస్య ఎదురయినా కాటన్‌ను చలింప చేయలేదు. కుమార్తె లేడీహోప్, ఆరోజులలో తమ కుటుంబం పడిన కష్టాలు తన పుస్తకంలో వివరించారు.



రాజమండ్రి వద్ద ధవళేశ్వరం బ్యారేజి

రెండవ చిన్న బాలిక సమాధి యిప్పటికీ రాజమండ్రిలో ఉంది. 1848 లో మేజర్ కాటన్ సమర్పించిన కృష్ణానదిపై ఆనకట్ట నిర్మాణ నివేదికకు 1850 జనవరి 5న బ్రిటిష్ ప్రభుత్వ ఆమోదం పొంది 1855 నాటికి పూర్తయింది. 1899 జూలై 14న 96వ ఏట ఇంగ్లండ్‌లో కన్నుమూసిన డెల్టాశిల్పి కాటన్ గోదావరి ప్రవహిస్తున్నంత కాలం చిరస్మరణీయుడే. డెల్టాలో యించుమించు ప్రతీ ఊళ్లో అశ్వారూఢుడైన ఆ బ్రిటిష్ దొర విగ్రహాలు కనబడుతుంటాయి. బ్యారేజ్, మ్యూజియం వంటి స్మృతిచిహ్నాలు ఎన్నో ఉన్నాయి. మ-రణించి 116 ఏళ్ళయినా, పుష్కర పవిత్రతలోనూ ఆరాధ్యనీయునిగా గుర్తు చేసుకొంటారు.



జయసూర్య

# చేనేత ఉద్యమ సారధి

## ప్రజాబంధు ప్రగడ కోటయ్య

శతజయంతి నివాళి (1915- 2015)



అప్పటి ప్రధాని నెహ్రు, ముఖ్యమంత్రి సంజీవరెడ్డిలతో ప్రగడ కోటయ్య. 1959లో చీరాల సహకార నూలుమిల్లు శంకుస్థాపన సందర్భంగా తీసిన చిత్రం. ఎమ్మెల్యేగా ఉన్న కోటయ్య ఈ మిల్లుకు ఛైర్మన్‌గా వ్యవహరించారు.

అట్టడుగు ప్రజల నాయకుడు, భూమి మీద నిలబడి పార్లమెంటు ఎగువసభలో సామాన్యుల గొంతుకగా మారిన మహోన్నత వ్యక్తి ప్రగడ కోటయ్య. చేతి మగ్గంతో బట్టలు నేసే నేతగాళ్ళ కుటుంబంలో పుట్టి పెరిగి పెద్దవాడైన కోటయ్య చేనేత వర్గం పక్షాన నిలబడి దేశవ్యాప్తంగా ఉన్న చేనేత కార్మికుల ప్రయోజనాలే లక్ష్యంగా కొన ఊపిరి వరకు నిరంతరం శ్రమించారు. చేనేత రంగంతో పాటు రైతులు, జిన్నింగ్, స్పిన్నింగ్, కాంపోజిట్ మిల్లులపై ఆమూలాగ్రం అధ్యయనం చేసిన పరిశోధనా విద్యార్థి కోటయ్య. జాతీయ ఉద్యమంలో పాల్గొంటూనే చేనేత ఉద్యమ నిర్మాణం చేసి వస్త్రోత్పత్తిదారులకు ప్రయోజనం కలిగించేందుకు సహకార సంఘాలు ఒక మార్గంగా సూచించిన దూరదృష్టి ఆయనది.

చీరాల నుండి మూడు సార్లు ఎమ్మెల్యేగా, ఒక పర్యాయం ఎమ్మెల్సీగా, రాజ్యసభ సభ్యునిగాను తాడిత పీడిత ప్రజల పక్షాన నిలబడి పోరాడారు ప్రగడ కోటయ్య. కోటయ్య అంటేనే కామన్ మాన్. ఆయన ప్రసంగం సగటు భారతీయుల గుండెగొంతుక. ఆయన ఆలోచన పేదవాడి గుడిసె నుండి వచ్చేది. గ్రామీణ జీవనోపాధులను కాపాడేందుకోసం, అధికార పక్షంలో ఉన్నా ప్రతిపక్షపాత్ర పోషించిన నిబద్ధత ఆయన సొంతం. గాంధీజీ బోధించిన "నా జీవితమే నా సందేశం" అన్న సూక్తి ప్రగడ కోటయ్యకు అక్షరాలా వర్తిస్తుంది.

### కుటుంబం -జీవితం

గుంటూరు జిల్లా నిడుబ్రోలులో చేనేతవృత్తి చేసుకొనే ప్రగడ వీరభద్రుడు, శ్రీమతి కోటమ్మ దంపతులకు 1915 జులై 26న రెండవ కుమారుడుగా ప్రగడ కోటయ్య జన్మించారు. ఐదుగురు అక్కచెల్లెళ్ళ, ఆరుగురు అన్నదమ్ముల పెద్ద కుటుంబం వీరిది. 1931లో ఎస్ఎస్ఎల్‌సి స్కూలు ఫైనల్ పాసయ్యారు. కొంతకాలం బాపట్ల తాలుకా బోర్డులో ఉపాధ్యాయ ఉద్యోగం చేశారు. వీరి

కుటుంబం చీరాల ఈపురుపాలెంలో కొంతకాలం నివాసం ఉంది. అప్పట్లో ఐఎల్‌టిడి కంపెనీలో గుమాస్తాగా పనిచేశారు. కోటయ్యగారి వివాహం ఇందిరాదేవి గారితో జరిగింది. వీరికి ఆరుగురు ఆడపిల్లలు, ఒక అబ్బాయి. రైతుబంధు ఎన్.జి. రంగా సలహాతో మద్రాస్ టెక్స్‌టైల్స్ ఇన్‌స్టిట్యూట్‌లో సూపర్‌వైజర్‌గా పనిచేసారు. ఇదే అనుభవంతో 1935లో ఏర్పడిన మద్రాసు రాష్ట్ర చేనేత పారిశ్రామికుల సహకార సంఘంలో ప్రొడక్షన్ ఇంచార్జిగా ఉద్యోగంలో చేరి, సర్కారు జిల్లాలలో ప్రాథమిక చేనేత సహకార సంఘాలు ఏర్పాటు చేసేందుకు విశేషంగా కృషిచేసారు.

1952 నుండి 1962 వరకు రెండు పర్యాయాలు, తర్వాత 1967 నుండి 1972 వరకు ఎమ్మెల్యేగా, 1974 నుండి 1980 వరకు ఎమ్మెల్సీగా పనిచేశారు. అనంతరం 1990 నుండి 1995 వరకు – మరణించేంత వరకు – రాజ్యసభ సభ్యునిగా ఉన్నారు. 1974 నుండి 1978 వరకు పిసిసి ప్రధాన కార్యదర్శిగా పనిచేశారు. 1945లో ఏర్పడిన ఆల్ ఇండియా హాండ్లూమ్ వీవర్స్ కాంగ్రెస్‌కు ప్రధాన కార్యదర్శిగా బాధ్యతలు నిర్వహించారు. నిరంతరం ప్రజాజీవితం గడిపిన కోటయ్య అనారోగ్యం కారణంగా 1995 నవంబరు 26న మరణించారు. 70వ జన్మదినం సందర్భంగా చీరాలలో జరిగిన సభలో ఆనాటి ఉత్తరప్రదేశ్ గవర్నర్ శ్రీ బెజవాడ గోపాలరెడ్డి ప్రగడ కోటయ్య గారికి "ప్రజాబంధు" బిరుదునిచ్చి సత్కరించారు. మరణానంతరం రాష్ట్రప్రభుత్వం వెంకటగిరిలోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హాండ్లూం టెక్నాలజి సంస్థకు ప్రగడ కోటయ్య పేరు పెట్టింది. చీరాల సెంటర్లోనూ, హైదరాబాద్ ఆప్కో భవన్‌లోనూ కోటయ్యగారి కాంస్య విగ్రహాలు ఏర్పాటు చేయబడ్డాయి. వీరు లక్షలాది అభిమానులను సంపదగా పొందారు. అందుకే నేటికీ ప్రగడ కోటయ్య జయంతి, వర్ధంతి కార్యక్రమాలు నిరంతరం జరుగుతున్నాయి.

## చేనేత ఉద్యమ సారథిగా..

1937 జూన్‌లో నిడుబ్రోలులో గుంటూరు జిల్లా చేనేత మహాసభ జరిగింది. ఈ సభను వెనుక ఉండి నడిపించింది కోటయ్యగారే. ఎన్. జి. రంగా ఈ సభలు ప్రారంభిస్తే తాడిపర్తి శ్రీకంఠ, దామర్ల రమాకాంతరావు, రామనాథం రామదాసు, పెండెం వెంకట్రాములు నాయకత్వం వహించారు. ఆ తర్వాత గుంటూరులో చెన్న రాష్ట్ర చేనేత మహాసభ ఘనంగా జరిగింది. ఈ సభలో అప్పటి మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ సి.రాజగోపాలాచారి ముఖ్యఅతిథిగా పాల్గొన్నారు. చేనేత అభివృద్ధికి ప్రభుత్వం కట్టుబడి ఉందని ఆయన ప్రకటించారు. 1939లో జరిగిన మద్రాసు రాష్ట్ర కేంద్ర చేనేత సహకార సంఘం ఎన్నికల్లో డైరక్టర్లుగా చేనేత నాయకులు ఎన్నికయ్యేలా కోటయ్యగారు పథకం రచించి కృతకృత్యులయ్యారు. 1941లో బ్రిటిష్ ప్రభుత్వం దేశవ్యాప్తంగా చేనేత రంగం స్థితిగతులను అధ్యయనం చేసేందుకు థామస్ కమిటిని నియమించింది. ఈ కమిటీని కోటయ్యగారు గుంటూరు జిల్లాకు ఆహ్వానించారు. వందపేజీల మెమోరాండాన్ని ఆ కమిటికి అందజేశారు. 1942లో చెన్న రాష్ట్ర చేనేత పారిశ్రామిక సంఘాన్ని చైతన్యవంతం చేసేందుకు దామెర్ల రమాకాంతరావు అధ్యక్షులుగా, కోటయ్యగారు ప్రధాన కార్యదర్శిగా


ప్రగడ కోటయ్య

కృషి చేశారు. నూలు కొరతను అధిగమించేందుకు, నూలు ధరలను స్థిరీకరణ కోసం చేనేత రక్షణ యాత్రలు నడిపారు.

## "చేనేత" వారపత్రిక

1947 ఆగస్టు నెలలో చేనేత కాంగ్రెస్ తరుపున దామెర్ల రమాకాంతరావు సంపాదకులుగా, ప్రగడ కోటయ్య నిడుబ్రోలులో "చేనేత" పేరుతో వారపత్రికను ప్రారంబించారు. చేనేత కులాలవారి వాణిగా 1952 వరకు ఈ పత్రికను సమర్ధవంతంగా నడిపారు. ఆర్ధిక స్థోమత చాలక ఈ పత్రికను ఆపేసారు.

## మద్రాసులో సత్యాగ్రహం

చేనేత పారిశ్రామికులకు చాలినంత నూలు సరఫరా చేయాలని, నూలు ధరలు అదుపులో పెట్టాలని, నూలు ఎగుమతులు ఆపాలని, నినదిస్తూ ఆందోళనలు చేపట్టారు కోటయ్యగారు. 1950 వరకు పరిస్థితులలో మార్పు రాలేదు. దాంతో చేనేత కాంగ్రెస్ సమరశంఖం పూరించింది. అన్ని జిల్లాలలో ఆకలి యాత్రలు, సత్యాగ్రహాలు పెద్ద ఎత్తున చేపట్టారు. అయినా ఫలితం రాలేదు. దాంతో మద్రాసు నగరంలో 1950 ఏప్రిల్ 16వ తేదీ నుంచి జూన్ 30 వరకు, 75 రోజులు పాటు సత్యాగ్రహం నడిపారు. దాదాపు పదివేల మంది చేనేత కార్మికులు ఈ సత్యాగ్రహంలో పాల్గొన్నారు. 75 రోజుల అనంతరం కేంద్ర పరిశ్రమలశాఖ మంత్రి హరేకృష్ణ మెహత మద్రాసు వచ్చారు. చేనేత కాంగ్రెస్ నాయకులతో చర్చలు జరిపారు. మంత్రి గారు ఇచ్చిన హామీలతో సత్యాగ్రహాన్ని విరమించారు. 1949లో కేంద్ర ప్రభుత్వం అఖిల భారత కుటీర పరిశ్రమల బోర్డును నెలకొల్పి దానికి అనుబంధంగా ఆచార్య ఎన్.జి. రంగా అధ్యక్షతన చేనేత స్థాయి సంఘాన్ని ఏర్పాటు చేసింది. ప్రగడ కోటయ్య, మాచాని సోమప్పలు ఆంధ్ర ప్రాంతం నుండి సభ్యులుగా ఉండేవారు. చేనేత పరిశ్రమకు చీరలు, ధోవతులు ఉత్పత్తిని రిజర్వుడు చేయటానికి కోటయ్యగారు విశేషకృషి చేశారు. 1952 శాసనసభ ఎన్నికల్లో కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ అభ్యర్థిగా చీరాల నియోజకవర్గం నుండి పోటి చేసిన కోటయ్యగారు మద్రాసు శాసనసభకు ఎన్నికయ్యారు. 1953 తర్వాత చేనేత వర్గాల ప్రయోజనాల కోసం రేపల్లెలో సత్యాగ్రహం చేపట్టారు. ఫలితంగా కోటయ్యగారు జైలు శిక్ష అనుభవించాల్సి వచ్చింది. కనుంగో కమిటీ సిఫార్సులకు వ్యతిరేకంగా ఆయన ఉద్యమించారు. పవర్ మగ్గాల ఏర్పాటుతో చేనేత కార్మికుల కష్టాలు కడతేరవని ఆయన బలంగా నమ్మారు.

## పార్లమెంటేరియన్‌గా..

రెండున్నర దశాబ్దాలు చట్టసభలో సభ్యుడిగా పనిచేసిన అనుభవంగల ప్రగడ కోటయ్య చేనేతనే తన శ్వాస, ధ్యాస అన్నట్లుగా బ్రతికారు. కోటయ్యగారి వాగ్దాటికి ప్రతి సభ్యుడూ మద్దతు పలుకుతూ వచ్చారు. ఎందుకంటే ఆయన చర్చించే అంశం మొత్తం భారత దేశ వ్యాప్తంగా ఉన్న చేనేత పారిశ్రామిక వర్గానికి చెందినది కాబట్టి. చేనేత కార్మిక వర్గ ప్రయోజనాల కోసం నిరంతరం అప్రమత్తతతో ఉంటూ వచ్చారు. పి.వి.నరసింహారావు ప్రభుత్వంలోనూ చేనేత వాణి– బాణిని నిష్కర్షగా వినిపించారు. చేనేతకు సంబంధించి ప్రభుత్వం ఏ నిర్ణయం చేయాలన్నా కోటయ్య గారిని సంప్రదించాల్సిందే! శతాబ్దం క్రితం ఇటువంటి మనిషి జీవించి, గ్రామాల్లో నివసిస్తూ కాలినడకన వేలాది గ్రామాలు తిరిగి ప్రజలను చైతన్యపరిచారని చదివితే విశ్వసించలేని పరిస్థితి. ఎమ్మెల్యేగా, ఎమ్మెల్సీగా, రాజ్యసభ సభ్యులుగా పనిచేసినప్పటికీ సాధారణ పౌరుడిగా జీవనయాత్ర సాగించారు. చివరి వరకు నిజాయితీగా, నిష్కర్షగా ఉంటూ ఎలాంటి ఆస్తులు సమకూర్చుకోకుండా, సాదాసీదాగా బ్రతికారు కోటయ్యగారు. ఆయన జీవితం నేటి తరం నాయకులకు ఆదర్శం. కోటయ్యగారు శతజయంతి ఉత్సవాల సందర్భంగా ఆయన నిబద్దత, నిజాయితీ, నిరాడంబరత, కార్యదీక్ష, పోరాట పటిమలను ముందుకు తీసుకుపోవాలి. ఆయన జీవితం భవిష్యత్ తరాల వారికి ఆదర్శంగా నిలిపేందుకు, వారి స్పూర్తిని దశ దిశల వ్యాపింపచేయాల్సిన బాధ్యత మనందరిపైనా ఉంది.



తడక యాదగిరి
మెంబర్, ఆలిండియా హ్యాండ్లూమ్ బోర్డ్


డా.చింతకింది శ్రీనివాసరావు

# లండనోడు..

డా. చింతకింది శ్రీనివాసరావు

“నీ కళ్లు కన్నాలడిపోనూ.. నీ సేతులిరిగిపోను.. నీ కాళ్లు సలవలుగమ్మీయా.. నీ రోజ్జెయ్యా.. నిన్ను నక్కలెత్తుకుపోను.. లండన్నాకొడకా.. కసకంత్రీఎదవా..” పాత్రిని ఎల్లయ్యమ్మ తిడుతున్న తిట్లకి పాతూరు గ్రామం ప్రతిధ్వనించిపోతోంది. ఊళ్లోని పాడుబడిన రామాలయం తలుపులు తపతపా కొట్టుకుంటున్నాయి. ఊరిచెరువు నిమ్మలబంద నిలువునా ఒణికిపోతున్నట్టు తెరలిపోతోంది.

ఎల్లయ్యమ్మ తిట్టిందంటే తిట్టదేంటి. ఆ లండనోడు అలాంటి పనిచేస్సేడు. దాని పెరట్లో జొరబడి గౌరమ్మదుబ్బులాంటి గడ్డికుప్పకి అగ్గిపెట్టీసేడు. పెట్టీసినోడు ఊరుకోకుండా..

“ఓలత్తా! నా గుడ్డిమాలచ్చివీ. నా నూకాల్తల్లీ. నీ కుప్పకి నిప్పెట్టేనే. నీ కొంపకి అగ్గెట్టీనేదు సంతోసించవే” అంటూ, అప్పుడే సత్తుగిన్నెలో చల్దిగంజి తాగి మధ్యాహ్నం కునుకు తీస్తున్న ఎల్లయ్యమ్మని లేపి మరీ చెప్పేడు. ఎక్కడికో వుడాయించీసేడు. ఆ దెబ్బకి, ఎటాముటీ నిద్రలోంచి లేచిన ఎల్లయమ్మ గుండె లయ తప్పింది. అది స్వాధీనంలోకి రాడానికి టైం పట్టింది.

గడ్డిమంటలు గుడిసెని తాకకుండా నలుగురూ కలిసి నిమ్మలబందనుంచి కుండలకొద్దీ నీళ్లు తెచ్చిపోసేరు. నిప్పులారిపోయాక ఎల్లయమ్మ రాగాలు పెడుతూ సరాసరి పంచాయితీదిమ్మకి చేరుకుంది. అప్పటికి సాయంత్రం కావొస్తోంది. కబురువిన్న ఊరిపెద్దలంతా బిలబిలమంటూ రచ్చబండకి వచ్చీసేరు.

“ఏటే, ఎల్లయ్యమ్మా. ఆడు నీవొక్కులుకే దూల్దీరిసీసినాడేటే. మాకూ తీరిసినాడు కదేటే. మావూ నీనాగ అర్నేకేటి. కిందామీదా మూసుకుని కూకోనేదేటి” విసుగ్గా అన్నాడు పంచాయితీబోర్డు మెంబరు సిరిసోళ్ల కోటేసు.

ఆ మాటలకి గొప్పగా మనసు కష్టపెట్టీసుకుంది ఎల్లయ్యమ్మ.

“ఒరే, నీకేటిపోనాదిరా కోటిగా. అత్తామావలు బలిసినోల్లు. ఆల్లెడితే నువ్వు తింతన్నావు. బరువా బాజ్జితా. నువ్వూ ఆ లండనోడికి తక్కువేటిగాదు. ఇద్దరూ పోరంబోకులే” గయ్‌మంది.

పాత తగవు తీర్చడానికని కూచుంటే, కొత్త గొడవేదో వచ్చిపడేలా ఉందని మునసబు గుర్రాన నారాయణ మనసులోనే అనుకున్నాడు.

“పోనీలేయే అప్పా. గడ్డి పోతేపోనాది. ఆడింకా ఏ అగాయిత్తమూ సేసీనేదు. అదే నెరవ” అనీసేడు.

ఆ మాటకి ఎల్లయ్యమ్మ భద్రకాళిలా అయిపోయింది.

“ఓరి నా మునిసీబు. ఓరి నా గీరమానం మునిసీబు. ఓరి నా సెండాలం మునిసీబు. నీకొవుడిచ్చినాడ్రా ఈ ఉజ్జొగం. నువ్వేదో గొడబ తీరుత్తావంతే. ఆడికి కొత్త అవిడియాలిచ్చినాగున్నావే. బోడెద్దుకి పోట్లు మప్పీనాగున్నావే” ఝుణఝుణలాడించీసింది.

ఇంతలోనే మహిళాసంఘం నాయిరాలు కురసాల నాగరత్నం కలుగజేసుకుంది.

“వొల్లకోయే పిన్నీ. ఆ లండనోడి సంగతి మనకి తెల్దేటి. ఓపాలయితే ఆడు నా కూతురు జెడలొట్టుకుని నాగనేదేటి. అలాంటి గోసిగోడితో ఎందుకెట్టుకున్నావే” అనీసింది ఎల్లయ్యమ్మనుద్దేశించి ముసిముసిగా.

“సిగ్గునేదేటే మాటాడతన్నావు. ఆడపుట్టక పుట్నేదేటి. పిల్ల జెడ నాగుతుంతే లండనోడి ఎంట్రూముక్కా తెంపనేపోనావా. నువ్విలగే ఎర్రిమొకం ఎయ్యి. రేపు నీ కూతురుగుంట లంగాబొందు నాగుతోడు గొల్లిగోడు” ఒంటికాలిమీద నాగరత్నం మీద పడిపోయింది ఎల్లమాలక్ష్మి.

ఇంతకీ, ఇంతలా పాతూరును నంచుకుతింటున్న ఆ లండనోడు ఎవడు? వాడి వ్యవహారం ఏంటి? ఆ కమామీషు ఏంటి? అని మీరు అడిగారనుకోండి. అదో కథ. అసలు కథలో చిన్న కథ. కట్టే.. కొట్టే.. తెచ్చే.. అంతగా కాకపోయినా కొంచెం చిన్నగా చెప్పుకున్నా ఇదీ ఆ కథ.



మన్యంవీరుడు అల్లూరి సీతారామరాజు బ్రిటీష్ దొరలను గడగడలాడించిన రోజుల్లో, విశాఖ ఏజన్సీకి అటూ ఇటుగా ఉన్న లోతుగెడ్డ, మోతుగూడెం, చింతపల్లి, రాజవొమ్మంగి, కృష్ణదేవీపేట, డౌనూరు, నాగాపురం, పాతూరు.. ఇలా పల్లెలన్నింటా ఆయనే సాక్షాత్తూ భగవంతుడు. ఆయన పెట్టిన పితూరీ చిన్నది కాదు. పిశాచంలాంటి బాస్టియన్ దొరే బెంబెలెత్తిపోయేడు. కవర్ట్, హైటరు అనే సీమదొరలను చంపిన రామరాజు దళంలో పాతూరు గ్రామవాసులూ లెక్కకుమిక్కిలిగానే ఉన్నారు.

అల్లూరి చిచ్చును అణచేయడానికి దిగిన భద్రతాదళాలు కత్తులూకటార్లతో కృష్ణదేవీపేట సమీపాన అప్పట్లో క్యాంపులేసీవి. వాల్తేరు ఏజెన్సీకి, మైదానానికీ మధ్యనుండే పాతూరు గ్రామంలోనే సైనికులంతా గుడారాలు దించుకునీవారు. వచ్చినవాళ్లు మనవాళ్లే. వాళ్లను తీసుకువచ్చిన ఆఫీసర్లే లండను, స్కాట్‌ల్యాండు, వేల్స్ వాళ్లు. వారి పనేంటంటేను.. ఉదయాన్నే పాతూరు గుడారాల్లో బ్రెడ్లు, బటర్లు, జామ్‌లు పోతుల్లా మేసి కృష్ణదేవీపేట పోయీవారు. అటునుంచి రామరాజుకోసం సైనికులచేత కొండల్ని గాలింపించీవారు. సాయంత్రం అయ్యాసరికి పాతూరొచ్చిపడిపోయీవారు. ఒకరూ ఇద్దరూ కాదు. జాస్తీగానే ఉండీవారు.

రాత్రి భోజనాలకి పొయ్యిలు వెలగ్గానే వీళ్లకోసం గ్రామప్రజ నీసూగీసూ సిద్ధంచెయ్యాలి. కోళ్లూగీళ్లు కొయ్యాలి. మేకలుగీకలు నరకాలి. మాంసం చేసిపెట్టాలి. వండాలి. వడ్డించాలి. వీళ్లు తిన్న పింగాణీప్లేట్లు తళతళలాడేలా తోమాలి. తాగిన గాజుగ్లాసులు కళకళలాడేలా కడగాలి. అవిగనుక చెయ్యిజారి పగిలిపోతే మూతిపళ్లు విరగ్గొట్టించు కోవాలి. కాదూకూడదూ అని నీలిగితే తుపాకీమడమలతో గుమ్కీలు తప్పవు. ఇనపనాడా బూటుకాళ్లతో కుర్రపోట్లూ తినవలసిందే.

గొంతువరకూ మెక్కిన బ్రిటిష్ కమాండర్లు చీకటివేళ టార్పాలిన్ల తెరల్లోకి దూరొచ్చుకదా. కొండచలికి దుప్పట్లు కప్పుకుని హాయిగా పడుకోవచ్చుకదా. అలా చేసేవారు కాదు. ఆ హాయితోపాటుగా వాళ్లకి వేరే హాయి ఏదో కావలసివచ్చీది. తమకం తీర్చుకోవడానికి పాతూరుమీద పడిపోయీవారు. కొందరు ఆడకూతుళ్లు కుదరదనేవారు. అయినా కుదిరేది కాదు. పిచ్చికొట్టుడు కొట్టి దొరగార్లు వారిని సొంతం చేసుకునీవారు. మరికొందరు మాత్రం ఆంగ్లసైనికాధికారుల ఎర్రని శరీరాలు చూసి, వారి ఎర్రెర్రని పెదాలు తిలకించి, అదోరకం ఆంధ్రభాష వాళ్లనోట పలుకుతుంటే పులకించి, వాళ్ల ప్రేమమాటలను విశ్వసించి, వాళ్ల పక్కల్ని పంచుకునీవారు. దారుణంగా మోసపోయీవారు. అలా దెబ్బయిపోయిన చాలామంది పల్లెపడుచులు కడుపులు తెచ్చుకునీవారు. ఆనక, గన్నేరు పిక్కలు మింగి గర్భాలు వదిలించుకునీ ప్రయత్నం చేసీవారు. లేదంటే కాయోకసరో తిని కన్నుమూసీవారు.

ఆ విధంగా గన్నేరు మింగకుండా, విషముష్టి తినకుండా అప్పట్లో మిగిలింది ధరంశెట్టి నీలవేణి ఒక్కర్తే. అలా

అని అదేదో మామ్మూలుగా మిగల్లేదు. కడుపులో పెరుగుతున్న బీజంకోసం కన్నతల్లి ప్రేమతో మిగిలింది. తను చావొచ్చుగానీ, ఉదరంలో ఉన్న ప్రాణిని చంపకూడదన్న పాపం వెంటాడగా మిగిలింది. లండన్ తీసుకువెళ్తానని చెప్పిన ఫౌజుదారు రూజ్‌ఫోర్డ్ మాట నమ్మి మిగిలింది. చెప్పాపెట్టకుండా ఒకానొకనాడు విశాఖలో ఓడెక్కి లివర్‌పూల్ వెళ్లిపోయిన అతగాణ్ణి గుర్తుచేసుకుంటూ మిగిలింది. ఆ తర్వాత ఎర్రగాబుర్రగా పుట్టిన కొడుకు మోదరాము కోసం మిగిలింది.

వాంఛలు తీర్చుకుని నీలను వదిలిపెట్టేసిన రూజ్‌ఫోర్డు ఒకపని మటుకు చేసిపోయేడు. వెళ్తూవెళ్తూ రెండు బంగారు గొలుసులు ఆమెకిచ్చి పోయేడు. రెంటినీ నర్సీపట్నం షావుకారుకి అమ్మి డబ్బుచేసుకుంది నీలవేణి. అలా వచ్చిన డబ్బుకంటేను, ఫోర్డ్‌తో డేరాల్లో గడిపిన వెచ్చని క్షణాలే ఆమెకు చచ్చేదాకా నచ్చేవి. కాగా, కొన్నాళ్లకి అల్లూరి పితూరీ అణిగిపోయింది. రామరాజును గుడాల్‌దొర కాల్చి చంపేసేడు. మన్యవంతా చల్లబడిపోయింది.



లండన్‌మొగుడి గొలుసుడబ్బుల్తో నీలవేణి పాతూరు జంక్షన్లో టీకొట్టుపెట్టింది. పెళ్లి సంబంధాలు వచ్చినా ఎవణ్ణీ మనువాడలేదు. పెళ్లాడితే ఏం సుఖం. ఆ వచ్చే మొగుడు బ్రిటీషోడు ఉన్నట్టుండదు కదా. చుట్టుపక్కలోల్లందరూ నల్ల నాకొడుకులే కదా.. అనీసుకుని ఊరుకుండిపోయింది. ఆమెచేసిందల్లా ఏంటంటే, కొడుకు మోదరామును క్రమశిక్షణగా పెంచింది. వాడి పుట్టుకవెనక కథ తెలిసిన కొందరు వాణ్ణి ‘దొరగారు’ అని గౌరవించినట్టు పిలిచేవారు. ఇంకొందరయితే పక్కలంటపోయి రంకులాడికొడుకంటూ ఇకిలించేవారు.

పాతూరు పక్కనే నాగాపురం. ఆ ఊరి పిల్ల రత్నాన్నే కోడలిగా తెచ్చుకుంది నీలవేణి. మనవడు రంగబాబు పుట్టేడు. వాడూ పెరిగేడు. వాడు మాత్రం పాతూరు మనిషిలాగానే నల్లగా పుట్టేడు. పాతూరు మనిషిలాగానే పెరిగేడు. ఈ లోగా నీలమ్మ టీకొట్టు పెద్దదయింది. కాఫీహొటలయింది. నగదు పెరిగింది. ధర్మవడ్డీకి తిప్పింది. అయినాగానీ, ఆ నగదు ఇంకా ఇంకా పెరిగిపోయింది. గల్లాపెట్టె పగిలిపోయేంతగా పెటేపకాయలా పేలిపోయింది. రంగబాబు పుట్టగానే జరిగిన మొదటి పని, వాడి తల్లిదండ్రులిద్దరూ రెండునెలల వ్యవధిలోనే మశూచి సోకి చచ్చిపోయేరు.

నీలవేణికి పెద్ద కష్టంవచ్చిపడిపోయింది. రంగణ్ణి సాకవలసిన స్థితి. మళ్లీ మొదటికొచ్చిన గతి. కండలో కండ, నెత్తురులో నెత్తురు. ఎలా వదిలీగల్దు. కాలూచేయీ కూడదీసుకుంది. వ్యాపారం చేస్తూనే మనవడి ఆలనాపాలనా చూసింది. వాడు పద్దెనిమిదికి రాగానే దౌనూరు వాస్తవ్యులు దుడ్డు వీరన్నగారి మనవరాలు చిరంజీవి సౌభాగ్యవతి వరలక్ష్మితో వివాహం జరిపించింది. వీరన్న ఎవరో కాదు. నీలకి దగ్గరచుట్టమే. కాపోతే, నీలవేణిని దుడ్డువారి ఫ్యామిలీ మొదట్లో ఎర్రనియాగాణీ కిందా చూసేది కాదు. దేశంకాని దేశపోడి పక్కలో బజ్జుందని వెక్కిరించేవారు. నీలమ్మ నాలుగు కాసులు వెనకేసుకునేసరికి



అపవాదులన్నీ తొలగిపోయేయి. డబ్బు జయించుకొచ్చింది.

నీలవేణి మనవడు రంగబాబును కట్టుకున్న వరాలు తగుమనిషి. మావగారి తల్లిగారయిన మహారాజశ్రీ నీలమ్మగారి మాటల్ని తు.చ. తప్పకుండా పాటించింది. కాఫీహొటల్లో కప్పులు కడగింది. బల్లలు తుడిచింది. ఆ ముసిల్దాని కాళ్లు పిసికింది. ఇవన్నీ కానిస్తూనే పెళ్లయిన ఏడాదికే కొడుకుని కనేసింది. రంగబాబు మోదం చెప్పనలవి కాదు. పాపడు పసందుగా ఉన్నాడు. వాణ్ణి పురిటికొట్టులోంచి పైకితెచ్చి నాయనమ్మ నీలవేణికే ముందర చూపించేడు. పసికందును పరికించిన నీలమ్మ అమితాశ్చర్యానికి లోనయింది.

“ఓర్నాయినోయ్. ఈడు నికారసయిన లండనోడురోయి. నా బిటీస్‌మొగుడు నన్నుద్దరించేడానికి మళ్లీ దిగిపోనాడ్రో. పారొచ్చేనాడ్రో” గావుకేకపెట్టినట్టుగా అరిచేసి సంతోషించేసింది. నీలవేణి అన్నది నిజమే. వాడు పాతూరోడిలా లేడు. తెలుగువాడిలా లేనేలేడు. భారతీయుడిలా అస్సల్లేడు. నెంబర్‌వన్ స్టీమరుసరుకులాగున్నాడు. ఫస్టురకం ఫారెనోళ్లాగున్నాడు. వాడి కళ్లు నీలం అల్లీకాయల్లా ఉన్నాయి. వాడి రంగు ఆనాటి రూజ్‌ఫోర్డు రంగులో ఉంది. వాడి జుత్తు వైట్‌వార్నీషు వేసినట్టుంది. మాంఛి బందోబస్తుగా పుట్టేడు. “అందర్నీ బందించి బొక్కలో తొయ్యగలన్రో” అన్నట్టుగా అగుపించాడు.

“ఇత్తనం మూమూల్దేటి. ఈరత్వం సీపించేదేటి” పిల్లగాణ్ణి పరిశీలనగా చూసినవారంతా మనసులో అనుకున్నమాటే ఇది. నీలవేణి మహదానందం పొందింది. పసివాణ్ణి పక్కలో వేసుకుంటే, ఒకనాటి పరదేశం మొగుడు పక్కలో ఉన్నట్టే సంబరపడేది. మునిమనవణ్ణి చూస్తే చాలు. ముసిలినీల పదుచుగుంటలా సిగ్గుపడిపోయేది. ఆ గుంటడికి పెదబాబు అని పేరుపెట్టుకుని ముద్దుగా చూసుకుంది. మద్దుమరీ హెచ్చయిపోతే “లండనోడు” అంటూ నోరారగా పిలుచుకునేది.

నీలవేణి ఏ పేరు పెట్టినా, అది గారంగా పిలిచే లండనోడన్న నామధేయమే ఆ మునిమనవడిగారికి

పాతూరు గ్రామంలో స్థిరపడిపోయింది. పెదబాబును జాగ్రత్తగా పెద్దవాణ్ణి చేసి, డబ్బంతా వాడి చేతుల్లో పోసి, పైకి పోదామని నీల అనుకుంది. దేవుడు మాత్రం అలా అనుకోలేదు. ముందు నువ్వు కాదు. నీ మనవడు వాడి పెళ్లామూ రావాలన్నాడు. కావలిస్తే లండనోణ్ణి వదిలెస్తానన్నాడు. ఆ ప్రకారమే అంతా జరిగినట్టుంది. అర్జంటుపనిమీద డౌనూరు వెళ్లిన రంగబాబు దంపతులు పాతూరు రావడానికి యేరు దాటుతుండగా అది ఉప్పొంగిసింది. అమ్మా అని పిలుపులేకుండా ఇద్దరూ మునిగిపోయేరు. శవాలుగా ఎక్కడో కొండగెడ్డల్లో తేలిపోయేరు.

కంటికీమంటికీ ఏకధారగా ఏడ్చింది నీలమ్మ. కళ్లముందే కొడుకూకోడలూ పోయేరు. మనవడూభార్యా వెళ్లిపోయేరు. తనది కష్టజీవితమనుకుంది. వయోభారమూ ఎక్కితొక్కడంతో బాగా లొంగిపోయింది. లండనోణ్ణి చేతుల్లోకి తీసుకుని పొగిలిపొగిలి దుఃఖించింది. తనకున్నడబ్బులో సగం పెట్టి వాడికోసం పక్కాగా ఇల్లూవాకిలీ కట్టించింది. వైరాగ్యం కుమ్ముకురాగా మరోసగంపెట్టి ఊళ్లో రామాలయానికి రంగులు పులివించింది. పదిమందో పదిహేనుమందో అనాథపిల్లలకి వివాహాలు జరిపించింది. పాఠశాల కట్టడానికి చందా ఇచ్చింది. ఒకరోజు ఉదయం ఎవరో పిలిచినట్టుగా పదేళ్ల లండనోణ్ణి వదిలి పైలోకాలకు పోయింది.

నీలమ్మ గ్రామానికి చేసిన మంచిని తల్చుకుని ఒంటరి లండనోణ్ణి ప్రేమగా చూసుకుంటూ బతికేయాలని పాతూరు గ్రామస్తులు నిర్ణయానికి వచ్చేరు. లండనోడికి తిండీతిప్పలూ చూసేరు. కొన్నేళ్లు బాగానే గడిచింది. పదిహేడు ప్రాయం వచ్చేసరికి ఏమైందో ఏమో. లండనోళ్లో చాలా మార్పులొచ్చేయి. ఆరున్నర అడుగుల పొడుగయిపోయేడు. ఎవరో పెట్టింది తింటున్నా ఎంతగా బలిసిపోయాడో. మరెంతసత్తువగా ఉండీవాడో. పెద్దమొహం. పెద్దపెద్ద చెంపలు. వాటిమీదుగా కిందకి దిగిన తమ్మెలు. చేపాటికర్రల్లాటి చేతులు. స్తంభాల్లాంటి కాళ్లు. పెద్దపెద్ద కండలు. కొడితే పదిమంది చస్తారన్నట్టుగా ఉండీవాడు. వాణ్ణి గుర్రం ఎక్కించి, నెత్తిన పళ్లెంటోపీ పెట్టేవాళ్లుంటే జేమ్స్‌బాండ్‌లా కచ్చితంగా కనిపిస్తాడు. మిలటరీ డ్రస్సుతొడిగి, పిస్టల్ నడముకి దోపీవారుంటే హైకమిషనర్ అమ్మమొగుళ్లా ఉంటాడు.

అయితే, ఘనంగా తయారవడమే కాకుండా ఘనమైన వెధవపనులూ లండనోడు మొదలెట్టీసేడు. అనతికాలంలోనే ఊరికి భారంగా తయారయిపోయేడు. చిన్నపిల్లల్ని వదిలిపెట్టేసేవాడు. వయసుకొచ్చిన ఆడాళ్లతో ఆసికాలాడకుండా ఊరుకునీవాడు కాదు. విరగకాసిన పైరులోకి పశువులను తోలడం, పేడకళ్లు ఎత్తుకొచ్చి ఇళ్లకిటికీల్లోంచి లోపలికి విసరడం, రాములవారి కల్యాణంలో పానకం బిందెలు పట్టుకెళ్లి కుడితి గోలేల్లో ఒంపడం, వరికుప్పలు కాల్చడం, ఊళ్లో పశువుల్ని వేరే ఊళ్లో వదిలేసిరావడం.. ఇలా ఒకటేంటి. చాలా చేసీవాడు. అందరి చేతా తిట్లు కాసీవాడు. బలాదూర్ తిరిగీవాడు.

"పోలికలు ఎక్కడికి పోతాయ్. రండాగర్భం వెధవ. రండాగర్భం వెధవ. ఇంగిలీషువాడి జన్యువులు బాగా వచ్చిపడిపోయేయి వెధవకి. మన బడుద్ధాయిలకి అంత పోతరం ఎక్కడుంటుంది" రామాలయం అర్చకస్వామి కృష్ణమాచార్యులుగారయితే ఎప్పుడూ వాడిగురించి విసిరే విసుర్లే ఇవి.

ఇదండీ అసలు కథకి కొసరు కథ. లండనోడితో పాతూరు ప్రజలు పడుతున్న వ్యథ.

మళ్లీ మనం వర్తమానంలోకి వచ్చేస్తే..

> ఆశలరెక్కల ఆకాశం, ఆ నింగిని తాకే పర్వతం, ఆ కొండ వెనక దిగంతం, ఆ దిక్కుల అంచు నుంచి కదిలొచ్చే కడలి, ఆ సముద్రపుటొడ్డున అనావృత మైదానం ... .... ఇవన్నీ గవ్వంత కూడా లేని సగటు కంటిలో ఒదగటం సర్వసాధారణం అనిపించే వింతే. ఇంతకు మించిన విశేషం మరొకటి ఉంది! ఆ మహా దృశ్యాదృశ్యాలు మరుపై చెరిగిపోయే రూపంగా కాకుండా, అనంతమైన వాటి సారంగా అంతర్నేత్రంలో ఇముడ్చుకోగలగటం మాత్రం అసాధారణమే. ఆ అసాధారణత్వమే రచనా కౌశలంగా ఉన్న రచయితల్లో కళింగాంధ్ర సాహిత్య నవతరం వారసునిగా పేరొందిన డా. చింతకింది శ్రీనివాసరావు ఒకరు.
>
> కథకుడు, చరిత్రకారుడు, సోషల్ యాంత్రోపోలజిస్ట్, సామాజిక కార్యకర్త, మాండలిక భాషావేత్త.... వంటి పలు రంగాల్లో నిష్ణాతులైన వారు కలిసి కూడబలుక్కొని సమష్టిగా రూపొందించాల్సిన దాన్ని చింతకింది ఒక్కరే "లండనోడు" అనే ఈ కథగా మలచడం మించి ఆయన ప్రతిభకు వేరే నిదర్శనం అక్కర్లేదు. అధోజ్ఞాపికల, ఉటంకింపు ప్రతిపత్తుల పటాటోపానికి తావివ్వని వినమ్ర సారళ్యానికి మించి ఆయన సాధించిన రచనా పరిణితికి మరో ఉదాహరణ లేదు.



లండనోడి వ్యవహారం ఎటూ తేల్చలేక పాతూరు పెద్దలు రచ్చబండకు బుర్రకొట్టుకున్నంత పనిచేశారు. వాణ్ణి మరిడమ్మో, నూకాలమ్మో, పసరమారమ్మో ఫలహారంగా పట్టుకుపోయినా బాగుండునని గడ్డికుప్పను పోగొట్టుకున్న ఎల్లయ్యమ్మ గొంతుచించుకుంది. చివరగా అందరూ కలిసి ఒక పనిచేసేరు. ఎప్పటిలాగానే వాడిపాపానికి వాణ్ణే వదిలేద్దామని అనుకున్నారు. ఎల్లయ్యమ్మ తొలీతా గింజుకుంది. చివరికి తెప్పరిల్లింది. ఇంటికిపోయింది.

సరిగ్గా ఇదే సమయానికి పాడుపడిన రామాలయంలో కూర్చుని ఏవో పదాలు పెద్దగొంతుతో పాడుకుంటున్నాడు లండనోడు. వాడి భీకరస్వరానికి "రామచంద్రాయజనక రాజజా మనోహరాయ" మంగళగీతం శ్రుతి తప్పి గొంతున పలుకుతుండేసరికి తడబడిపోయారు ఆచార్యులుగారు. గర్భగుళ్లో ఉన్నానన్న సంగతీ మరచి లండనోణ్ణి ఛెడామడా తిట్టుకున్నారు.

"వీడి తాతమ్మ భక్తిశ్రద్ధలతో గుడికి రంగులుపూయిస్తే, ఈ వెధవాయి రకరకాలుగా ప్రాణం తీస్తున్నాడు" మనసులోనే మొత్తుకున్నారు.

ఆ రోజు లండనోడు తిన్నాడో తినలేదో ఎవరికీ తెలీదు. రామకోవెల అరుగుమీదనే మొద్దునిద్రపోయేడు. ఈ లోపటే పొద్దుగుంకిపోయింది. చీకటిపడినా వాడు లేవలేదు. మబ్బులు మట్టంగా ముసిరినా మెదల్లేదు. గాలి దిట్టంగా వీచినా కదల్లేదు. అర్ధరాత్రి సమయానికల్లా వాన మొదలైంది. కుంభవృష్టిగా మారిపోయింది. బండగాడయిన లండనోడికి ఇదంతా పట్టలేదు. కొద్దిసేపటికి అరుగుమీద పడుక్కున్నవాడల్లా వానజల్లు ఒంటిమీద పడుతుండగా చికాగ్గా మొహం పెట్టి లేచేడు. బలవంతంగా నీళ్లలోంచి లేపితే లేచే నీటిఏనుగులా లేచేడు. జల్లు కురవని ప్రదేశానికి వెళ్లి మరోసారి పడుకున్నాడు. కొంతసేపటికి అక్కడా నీళ్లు చిందేయి. తిట్టుకుంటూనే ఆ చోటూ మార్చేడు. తెల్లవారుఝాముకల్లా అరుగుమొత్తం తిరిగీసేడు.

తెలతెలవారుతుండగా జనం హడావుడిగా ఊళ్లో పరుగులు తీస్తుండటంతో తెలివితెచ్చుకున్నాడు. కళ్లు నులుపుకున్నాడు.

"వర్సం బాగానే పడుతున్నట్టుగుందే.. నీల్లూగీల్లూ వరదనా పారుతున్నట్టుగుందే.." అనుకున్నాడు.

అప్పుడే ఆదరాబాదరాగా మునసబు, పూజారిగారు, కమాటీల్లాంటి మరో పాతికమంది మనుషులు పలుగు పారలతో భోరున కురుస్తున్న వానలో అటుగా జోరున వెళుతున్నారు. అప్పటికిగానీ ఈ లోకంలోకి పూరాగా రాలేదు లండనోడు. వచ్చినవెంటనే ఆలీసం చెయ్యలేదు. పూజారిగారిని రెండు చేతులూ పట్టుకుని ఆపేడు.

"ఎందుకేటి పరుగులు" కిచకిచలాడుతూ ప్రశ్నించేడు.

"పరుగులు తీయకపోతే చచ్చిపోతావురా భ్రష్టా" కోపం, ఆందోళన మిళితంకాగా పంతులుగారు కసురుకున్నారు.

"ఎందుకు పోతామేటి" సెకాలీగా అడిగేడు.

"ఓరి దయిద్రుడా. లండనోడా. నిమ్మలబంద తెగిపోనాదిరా గుటా. వొరదనీరు ఊళ్లోకి పారొత్తందిరా. ఒల్లక్కూకుంతే కట్టకట్టుకుని పైకిపోతాంరా" మునసబు నారాయణ ఒగర్పు తీర్చుకుంటూ చెప్పేడు.

"ఓసే. అంతేనా" అన్నాడు లండనోడు.

వాననీళ్లు చల్లగా ఒంటిమీద పడుతున్నా పూజారిగారికి ఒళ్లు మండినట్టయింది.

"వెధవాయీ. చెరువుతో వ్యవహారమంటే ఊరిజనాన్ని

కాల్చుకు తినడం కాదురా. గండిపడిన చెరువు, రంధ్రంపడిన గుండె ఒకటేరా. నమ్ముకున్నవారిని ఎప్పుడు అన్యాయం చేస్తాయో తెలీదురా" కటువుగా అన్నారు.

"ఏటిసేస్తే పెమాదం పోద్ది. అందరూ బతికిపోతారు" విసురుగా అడిగేడు లండనోడు.

"ఏం చేస్తేనా! తెగిన చెరువుగట్టుకు అడ్డంగా ఇంత మట్టిపోస్తేనో, ఏదన్నా తెచ్చి అడ్డుపెడితేనో మిగులుతాం. ఆలస్యం కుదరదు. అందుకే వెళు తున్నాం" వీడితో మాటలేంటన్నట్టుగా చిరాగ్గా పలికారు పూజారిగారు.

వెంటనే పన్లోకి దిగిపోయేడు లండనోడు.

"ఓహో. దానికేనేటి ఈ నీలుగుడంతాని. దయిరం ఉన్నోలొవులయినా నాతో రండి. నాను గండికి ఏదోవోటి అడ్డెడతాను. మీరంతా విప్పుడెక్కడికిపోతారు. వొప్పుడు మన్నూమసేనం తెత్తారు" ఇలా అంటూనే ఉన్నాడు. చకచకా రామాలయం అరుగుమీదికి దూసుకుపోయేడు. పైకప్పుపాడయిన మండపంలోకి చేరిపోయేడు. తలుపులు వేసి ఉన్న మందిరప్రధానద్వారాన్ని అందరూ చూస్తుండగా పాళంగా అమాతం పెకలించిసేడు. ఏనాటి బరువైన ద్వారబంధమో ఫెళఫెళలాడుతూ వాడి చేతుల్లోకి ఊడొచ్చేసింది. దానికి అనుకున్న గోడల పెచ్చులు జలజలా రాలిపోయేయి. మనసబు సహా అక్కడివారంతా ఆ దృశ్యాన్ని కన్నార్పకుండా చూసేరు. ఒక్కమనిషి అంత ద్వారబంధాన్ని ఎలా లాగేశాడోనని నిశ్చేష్టులై చూసేరు.

ఎవరేమనుకున్నా తనకేమీ సంబంధం లేనట్టుగా ద్వారబంధాన్ని రెండుచేతులతోనూ పైకిలేపి పర్వతాన్ని మోస్తున్నట్టుగా మోసుకుంటూ చెరువువైపు దారితీశాడు లండనోడు. ఆంజనేయుని మాదిరిగా అంగలేసేడు. వాడంతగా పరుగులమీద వెళుతుంటే, వెనకాడకూడదన్న మొండిధైర్యంతో మనసబుబృందమూ కదిలింది. వరదనీళ్లలో గట్టిగా అడుగులేసుకుంటూ భారంగా చెరువు చేరుకుంది.

గట్టు పగలవలసిన చోటే పగిలింది. పెనుగంగలా నిమ్మలబంద నీరు ఊరిమీద విరుచుకుపడుతోంది. ఆ ప్రవాహవేగం ప్రళయంలా ఉంది. అయినా లండనోడు జంకలేదు. వీలయినచోటునుంచి ఈదులాడుకుంటూ జబర్దస్తీగా చెరువు గట్టుమీదికి ద్వారబంధంతో సహా పాకీసేడు. మునసబు అనుచరగణంలోని బలమైన మరో పదిమందికూడా మెల్లగా గట్టెక్కగలిగారు. గండిపడిన ప్రదేశానికి ఆ వైపు కొందరు ఈ వైపు కొందరు కమ్ముకున్నారు.

లండనోడు చొరావరీచేసేడు. రెండు చేతులతోనూ ద్వారబంధాన్ని గట్టిగా పట్టుకున్నాడు. కట్టతెగి చెరువునీళ్లు ఘోరంగా వెల్లువెత్తుతున్న స్థలంలోకి గట్టుమీదినుంచి ఒక్క ఉదుటన దూకీసేడు. దూకినవాడు దూకినట్టుగానే గండికి అడ్డంగా ద్వారబంధాన్ని నిలబెట్టీసేడు. రాత్రినుంచీ కురుస్తున్న వానకి చిల్లులుపడ్డ నీళ్లకుండలా ఉంది చెరువు. ఇష్టారాజ్యంగా వరదజలాలను వదిలిపెడుతోంది. లండనోణ్ణి ఎక్కడికో తోసిపారేయాలని చాలా ప్రయత్నాలు చేస్తోంది. వాడు చెరువుకంటే ముదురు. ఎగసిపడుతున్న ప్రవాహాన్ని తట్టుకుని నిలిచేందుకు నానా పాట్లూపడ్డాడు. జారిపోతున్న మట్టిలో.. ఎగదన్నుకు వస్తున్న నీటిలో.. పడిపోతున్న ద్వారబంధాన్ని కాచుకుంటూ.. ఒక్కోసారి ఒరిగిపోతూ.. ఒక్కోసారి నిలదొక్కుకుంటూ.. పదినిమిషాలు పెనుగులాడేడు. అలా వాడు పెద్దపోరాటం చేశాక చేసేదేమీ లేదనుకుంది చెరువు. వాడి ముందు చచ్చినట్టు చేతులు కట్టుకుంది. ద్వారబంధంతో నిటారుగా గండిని మూసేస్తూ నిలుచుండిపోయాడు లండనోడు. గజ్జెఘల్లుమన్నట్టుగా నవ్వునవ్వేడు.

అప్పటివరకూ వాడుపడిన శ్రమదమాదులు కళ్లారాచూసిన పూజారి, మనసబు, మిగిలినవారు ఆశ్చర్యపోయేరు. వాన కూడా తగ్గుముఖం పట్టి తుంపర్లుగా మారింది. మరునిమిషంలోనే లండనోడు ఖంగున గొంతుపెగిల్చేడు.

"దోరబంధాన్ని ఎంతసేపు ఒట్టుకోవాలి. ఎంతసేపు కాయాలి. సవటల్లా సూత్తన్నారేటి. మన్నుపోసిండి. మన్నుపోసిండి" అంటూ ఆర్డరేసినట్టుగా కేకలేసేడు. లండనోడి మాట సరైందేనని, మట్టిపోసి తీరవలసిందేననీ మనసబూ తీవ్రస్వరంతో చెప్పేడు.

చెరువుగట్టుమీదున్న బంకమట్టిని పారలతో తవ్వుతున్నారు మనసబు మనుషులు. దాన్ని గండిలో పోస్తున్నారు. ద్వారబంధంపై నుంచి లండనోడి బుర్రమీదుగా ఆ మట్టి ముద్దలుగా ముద్దలుగా, పెళ్లలు పెళ్లలుగా కిందికి జారుతోంది. క్రమంగా గోడలా తయారవుతోంది. కాసేపయ్యేసరికి లండనోడి మోకాళ్లవరకూ వచ్చింది మట్టి.

"ఇంకా పోసిండి. ఇంకా పోసిండి. గబగా. గబగబా" హడావిడి పెట్టేడు లండనోడు.

ఇంకాపోసేరు. ఇంకా పోసేరు. ఇంకా ఇంకా తవ్విపోసేరు. ఈ సారి మట్టి వాడి నడుందాకా వచ్చింది. మట్టిబలం ఎప్పుడైతే పెరిగిందో స్థిరంగా నిలబడగలుగుతున్నాడు లండనోడు. వాడుపట్టుకున్న ద్వారబంధమూ కుదమట్టంగా కుదురుకుంది. వాడికి స్థిరత్వం చిక్కింది. సులువు తెలిసిపోయినట్టయింది.

"సూస్తారేటి. మరుకొంచెం మట్టిపోసిండి. మీరికను ఆగొద్దు. బయపడకండి. సెరువును ఆపాలంతే తప్పదు" కసిరినట్టు మాటాడేడు. పలుగూపారా పట్టినవారిని ఒకటే తొందరపెట్టేడు. దీంతో, పనిముట్లు అలుపులేకుండా పనిచేసేయి. పలుగులు తవ్వుతూనే ఉన్నాయి. పారలు ఎత్తిపోస్తూనే ఉన్నాయి. చెరువుకు బేడీలు పడుతున్నట్టయింది.

అప్పటికి పీకల్లోతు మట్టిలో కూరుకుపోయాడు లండనోడు. అయినాకూడా..

"మట్టిపోసిండి. మట్టిపోసిండి" గగ్గోలు పెట్టేడు.

చెరువుకు మరోసారి గండిపడితే తట్టుకోలేమన్న భయంతోనో.. వాడు పెడుతున్న ఘోషవల్లనో.. మనసబు అనుచరులు తమ పని మరింత వేగిరంగా చేస్సేరు. చకచకా మరికొన్ని పలుగుల దెబ్బలు పడ్డాయి. పారల బరువులు లేచేయి. ఆ మేరకు మన్ను మొత్తం ద్వారబంధం మీదికి చేరిపోయింది. ఆఖరికి అదే కనబడకుండాపోయింది. గండి పూర్తిగా పూడుకుపోయింది.

"లండనోడు రచ్చించీనాడ్రోయ్. లండనోడు రచ్చించీనాడ్రోయ్" పెద్దపెట్టున సంబరంగా పలికేరు మట్టిపని చేసినవారు.

నీరుపారుడు ఆగిపోవడంతో " శెభాష్.. శెభాష్.." అని చప్పట్లు కొడుతూ గట్టుదగ్గరికి వచ్చేరు మునసబు, పూజారి.

"లండనోడి ధైర్యం వల్ల, దయవల్ల ఊరునిలిచింది" పూజారిగారు ఆదరంగా మాట్లాడేరు.

ఇంతలోనే గావుకేకలాంటిది వినబడింది. మనసబుబృందంలోని ముఖ్యుడైన కసిరెడ్డి రామునాయుడు గగ్గోలుగా..

"లండనోడు మట్టిలో ఉండిపోనాడండోయ్. మట్టిలోనే దిగబడిపోనాడండోయ్" భూమ్యాకాశాలు దద్దరిల్లేలా కెవ్వుమన్నాడు.

అప్పటికిగానీ లండనోడు బంకమన్నులోనే సజీవంగా కూరుకుపోయాడన్న సంగతి ఎవరికీ గుర్తురాలేదు. గుర్తుకువచ్చిన ఉత్తరక్షణమే..

"ఒరేయ్ మట్టి తియ్యండ్రా. మట్టి తియ్యండ్రా. వెర్రివెధవాయి చచ్చిపోతాడ్రా. ప్రాణంమీదికొచ్చేస్తుందిరా" దీనంగా అరిచేరు పూజారయ్య.

"వాడికి ఊపిరాడదురోయ్. గబీగుబీమని నాలుగు పారలెయ్యండ్రా" అరుపులంకించుకున్నాడు మునసబు.

అక్కడున్నవారికి చిటికెలోనే అసలు విషయమంతా బోధపడిపోయింది. వారి గుండెలు గుబగుబలాడిపోయేయి. శీతగాలివేళా ముచ్చెమట్లు పట్టీసేయి. నాలుగు పారల మట్టి ఎడాపెడా తవ్విపోసేరు. మరో పుంజీడుపారల మన్నూ జాగ్రత్తగా పక్కలకి తీసేరు. అప్పుడు బయటపడింది లండనోడి తల. ముఖమంతా తడిమన్ను మెత్తుకుపోగా కొనఊపిరితో కొట్టుమిట్టాడుతూ కనిపించేడు. వాడి పరిస్థితి చూసినవారంతా భీతావహులయిపోయేరు.

"ఎంతపనయిపోయిందిరా" అనుకుంటూ బుర్రకొట్టుకున్నారు. అప్పటికే, మన్నుతగ్గిన కారణంగా గండిపడిన ప్రదేశంనుంచి చెరువునీళ్లు బయటకు రావడం మరోసారి మొదలైంది. మరోతూరి దుముకులాడేందుకు వరదజలం సిద్ధమైంది.

ఊరు మునిగిపోయినా సరే, మట్టితవ్వి లండనోణ్ణి పైకి లేపడానికే అందరూ సమకట్టేరు.

శ్వాస ఆగిపోతున్న నిస్త్రాణలోనూ..

"మట్టి పోసిండి. మట్టి పోసిండి. తీసినమన్ను తీసినట్టుగా పోసిండి. నేపోతే ఊరందరూ మునిగిపోతారు. నా మాటినండి" లండనోడు సన్నగా వల్లిస్తూ మెల్లగా ఊపిరి వదిలీసేడు. తలవాల్చీసేడు.

ఆ సమయానికి వర్షం మొత్తం వెలిసిపోయింది. ఊరందరి కళ్లల్లోనూ అది భోరుభోరున మొదలైపోయింది.

❖




ఆ చూపు కొత్తగా ఏం ఉండదు,
చెప్పి ఆపేసిన కథను కొనసాగిస్తున్నట్టు ఆనవాలుగా,
కాస్త వేడుకోలుగా, కాస్త ఒప్పుకోలుగా, కాస్త చెరిపేయడాలుగా, కాస్త మామూలు స్నేహాలుగా
క్షణాల అరవంతుల్లోనే కళ్ళల్లోంచి ఏదో ఒంపుకుని నింపుకునే ఖాళీ ప్రయత్నాలుగా,
రెప్ప ఆరే లోగా రంగులుగా, లేదంటే నలుపుతెలుపులుగా,
పేరుకున్న నిశ్శబ్ద నాదాన్ని కదిలించే బరువైన కణమేదో ఇంకా కలిసిరానట్టుగా,

తెలిసిపోతూనే ఉంది, ఆచూపు కొత్తగా లేదని
విస్ఫోటనం –మౌనం ఒకే నిష్పత్తిలో ఆవరించాయని!

ఆ చూపు కొత్తగా ఏం లేదు
ఏదో ప్రయత్నంగా, కలుపుతూ విడిపోయే మార్గమేటన్నట్టుగా,
అప్పుడే విదిల్చుకున్న మోమాటాలను అంతలోనే అతికించుకుంటున్నట్టుగా,
కలిసేదారి కాసేపే అన్నట్టుగా, అయినా ఏదో సరిపెట్టుకోలేనితనంగా
కోపం కొండెక్కుతున్నట్టుగా, నవ్వుల కలువలు విరుస్తున్నట్టుగా
ఏదో పాతలో గమ్మత్తుగా, నచ్చిన పాట విన్నా విననట్టుగా

తెలిసిపోతూనే ఉంది, ఆచూపు కొత్తగా లేదని
ఓ వర్షించని మేఘం – ఒక వివరణకి రాని క్షణం పూర్తిగా కమ్ముకున్నాయని!



రామినేని మోహనతులసి, చికాగో

# ద్వంద్వ... అతీతం!



నిన్ను భేతాళుని శవంలా భుజాలకెత్తుకున్నాను
వదలనూ లేను. వెనక్కి తిరగనూ లేను.
నీ దృష్టి సోకిన క్షణానే నేనొక విలపిస్తున్న గాయాన్నయ్యాను.
గుండె పగలదు, గాయం మానదు.
అనంత మూలాల్నించీ నీ కోసమే
బ్రతికినట్టు స్పృహ
ఒక్క ప్రేమమయ స్పర్శ నాకొక పునర్జన్మ
నీ గుండె చప్పుళ్ళు వినికిడి
జరామరణ దు:ఖాలను అదృశ్యం చేసే ఇంద్రజాలం
నిద్రలో నిన్ను బాకిన తలపులు
అనుక్షణం మెలకువను వెన్నంటుతుంటాయి
నీ ఊపిరి సలపని ఆలింగనంలో
నేనొక దు:ఖాన్నై
కరిగిపోని, ఆవిరివనీ...



కొప్పరం శివజ్యోతి

# ఏకత్వాన్ని చూడగలగటమే పరమానందం



- అందరిలోనూ దైవాన్ని చూడగలిగితే, అదే దివ్యత్వం.
- అన్నిటినీ ప్రేమించగలిగితే, అదే జ్ఞానస్పర్శ.
- స్వార్థం, సంకుచితం ఎరుగని సువిశాల భూమిక ప్రేమ.
- మోక్షానికి అందరూ అర్హులే. కాకపోతే సాధనతో అర్హతను సాధించుకోవాలి.
- అంతా బ్రహ్మమైనపుడు అందరూ బ్రహ్మమే.
- వెలుగు మూలం వెలుగే. ఆ వెలుగు బయటా ఉన్నది, లోపలా ఉన్నది.
- దైవం, ప్రకృతి, పదార్థం, శక్తి.... ఏ పేరుతో అనుకున్నా ఉన్నదొకటే.
- తాత, తండ్రి, కొడుకు, భర్త, యజమాని, గురువు, శిష్యుడు, పరిచారకుడు, అన్న, మామ, వంటివి పురుషుడి పరంగా, తల్లి, చెల్లి, కూతురు... వంటివి స్త్రీ పరంగా అనేక స్థితులున్నా ఉన్న వ్యక్తి ఒక్కరే! తనువుతో ఏర్పడేవన్నీ బాంధవ్యాలు, అనుబంధాలు, తనువుతోనే తెల్లవారే కల్లలు. దీన్నంతటినీ పరచుకుని ఉన్నది ఆత్మే.
- ఆత్మైక స్థితిని అనుభవించాలేగానీ, ఆవిష్కరించలేం.
- దర్శించగలిగితే ఆత్మ తప్ప అన్యం లేదు. అంతా అదే అయినపుడు మరొకటి అంటూ లేదు.
- కనబడుతున్న దానిని ప్రపంచమని, కనబడనిదాన్ని దైవమనీ అంటున్నాం. కానీ వున్నదంతా దైవమే.
- తాడుకి రెండు కొసలున్నట్లు, విజ్ఞానం, ప్రజ్ఞానం ఉన్నయ్. రెండిటినీ సమన్వయం చేసుకోవటమే సాధన.
- కదిలేదంతా కనపడుతున్నది. కదిలించేది కనబడటం లేదు. కనబడటం లేదు కనుక, అది లేదనుకోరాదు. కనబడుతున్నదంతా శాశ్వతంగా ఉంటుందని అనుకోవటం అజ్ఞానమే.
- కడలిలోనే కెరటాలున్నయ్. అవి సముద్రం కంటే భిన్నం కావు. స్థితి, గతి, రూపం, నామం భిన్నంగా కనబడుతున్నయ్. అంతే!
- అసమత్వమే సృష్టి. వైరుధ్యమే ప్రకృతి. ఈ సత్యాన్ని గ్రహించగలిగితే, యాతనలుండవు.
- జరుగుతున్న దాన్ని అంగీకరించటం, సాక్షిగా ఉండగలగటం స్థిమితాన్నిస్తుంది. ఎదురీదటంలో అహంకారం, అలసట, నిర్వేదం, శ్రమ ఒదిగి ఉన్నయ్.
- ప్రతి సంఘటనలో దాగిన ఘటనను స్పష్టంగా అనుభవించగలిగితే, శాంతి సైతం కైవసమౌతుంది. కావలసిందల్లా హేతువును గుర్తించగలగటం.
- అహం స్ఫురణను పెంచుకోగలిగితే అహంకారం నశిస్తుంది.
- దేన్నో ఆశిస్తూ ధ్యానించకు. అంతరంగంలో శూన్యస్థితిని, అంటే నిర్వికార స్థితిని అనుభవించటం కోసం ధ్యానించాలి. అదే అసలైన పూర్ణస్థితి.
- తృప్తే సంపద, ఆనందం, శాంతి.
- పరిస్థితులు మంచివీ కావు. చెడ్డవీ కావు. అర్థం చేసుకోగలిగితే, అవి గురు స్వరూపాలే. వాస్తవాన్ని ఆవిష్కరించే అవకాశాలవి.
- అధ్యాత్మ భావంతో పెనవేసుకున్న వినయమే నిజమైన సాధన.
- కింద పడిపోతే ఏడవటం చూస్తాం. అదే ఆటలో పడిపోతే హాయిగా నవ్వుతూ మళ్ళీ ఆట మొదలుపెట్టడం సహజంగా జరిగిపోతుంది. జీవితాన్ని ఆటగా అనుకోగలిగితే కిందపడ్డా ఆనందమే.
- అన్నింటిలో ఏకత్వాన్ని చూడగలగటమే పరమానందం.
- పుట్టుకకీ, మరణానికి మధ్య తేడా లేదనుకోవటమే అమృతత్వం.
- ఏది సాధ్యమో అదే సాధన. శోధిస్తున్నంత సేపూ అసాధ్యంగా కనిపిస్తుంది. శోధన పూర్తై, ఫలితం దొరికినపుడు కలిగే పులకింతే ఒక ఆనందరేఖ.
- మతాలు సూచించిన మార్గాలన్నీ మంచివే. అర్థం చేసుకోవటంలోనూ, ఆచరించటంలోనూ ఉన్న అస్పష్టత వల్ల, అసమగ్రత వల్ల భేదం ఉన్నట్లనిపిస్తుంది.
- మతానికి ధర్మం ఉన్నది. ధర్మం మతాతీతం, దేశ కాలాతీతం. ధర్మంలోనే మిగిలిన మూడు పురుషార్థాలు ఇమిడి ఉన్నయ్.
- జీవుడిదంతా ప్రయత్నమే. అది కనిపిస్తుంది. దైవానిది ప్రేరణ. అది కనిపించదు. కానీ అదే సత్యం.
- సాధనలో ఒక స్థాయిని అందుకున్న తరుణంలో సాధకుడు తిరిగి వెనక్కి చూడకూడదు. ప్రాపంచిక ఆకర్షణలు ఎన్ని ఎదురైనా పతనం చెందకూడదు. అంతరంగ దర్శనానికై తీవ్ర ప్రయత్నం చేయాలి.
- స్వార్థం మానవ ప్రవృత్తిలో ఒక భాగం. దాన్ని అధిగమించే ప్రయత్నమే సాధన. స్వార్థాన్ని దాటగలిగితే మానవుడు తనలోని మాధవత్వాన్ని అనుభవంలోకి తెచ్చుకోగలడు.
- ఆధ్యాత్మ సాధన మన చేతుల్లోనే ఉన్నది. చేయగలిగినంత సాధన మనం చేయగలం. చేయలేనిది చేస్తామనటం అహంకారమే.
- అరిషడ్వర్గాలను జయించటం మాత్రమే కాదు. ఆరు రకాల వికారాలను సాధన ద్వారా, అనుభవం ద్వారా రూపాంతరీకరణం చేసుకోవాలి. కాలగమనంలో సాధనా తీవ్రతతో అవే తమ ప్రభావాన్ని తగ్గించుకుని, సరైన సమయంలో సమశక్తిగా అభివ్యక్తమౌతయ్. వికృతి నుండి ప్రకృతి వైపు మరలటమే జరగవలసింది.
- విధి ఉన్నది! దాన్ని దాని పనిచెయ్యనిద్దాం. మన ప్రవృత్తి ద్వారా, జీవన విధానం ద్వారా, జీవన దృక్పథం ద్వారా, జీవన శైలి ద్వారా విధిని అనుసరిస్తూ అంగీకరించటమే మన విధి. కావలసిందల్లా సమన్వయమే, సంఘర్షణ కాదు.
- సర్వాత్మ భావనే, సర్వేశ్వర భావన! ఏది ఎట్లా జరగాలో అట్లాగే జరుగుతుంది! అన్ని పరిస్థితులనూ ఆకళింపు చేసుకోవాలి. అన్ని రూపాలూ ఆయనవే. అన్ని పేర్లూ ఆయనవే. అన్ని గుణాలూ ఆయనవే. భగవంతుడంటే ప్రత్యేకం కాదు. ఉన్నదంతా దైవమే!

వి.యస్.ఆర్. మూర్తి
ఆధ్యాత్మిక శాస్త్రవేత్త

# సినిమా జగద్గురువు కె వి రెడ్డి

సినిమా దర్శకత్వం – అన్నది ఒకటే అయినా, దర్శకుల ధోరణి వేరు వేరుగా వుంటుంది. ఒక కథకి ఒక్కో దర్శకుడు ఒక్కో రకమైన ట్రీట్‌మెంట్ ఇస్తాడు. టేకింగ్‌లోనూ తేడాలు వుంటాయి. 'మాయాబజార్' (1957) సినిమా వుందనుకోండి, అది కె.వి రెడ్డి గారి ట్రీట్‌మెంట్, టేకింగ్. అదే కథని బి.ఎన్ రెడ్డి గారు తీస్తే అలా వుండదు. ఇంకోరకంగా వుంటుంది. ఇద్దరూ గొప్ప దర్శకులే, 'జగదేకవీరుని కథ' వుందనుకోండి ఆ కథ బి.ఎన్. కి ఇష్టం లేదు. కె.వి తీసి, హిట్ చేశారు. సాంఘికాలైనా అంతే, కె.వి రెడ్డిగారి చిత్రాలు వినోద ప్రధానంగా వుంటాయి. బి.ఎల్ రెడ్డిగారివి సీరియస్‌గా ఉంటాయి.

నేను కె.వి రెడ్డి గారి చిత్రాల్లో నటించలేదు గాని, ఆయన దర్శకత్వ విధానం తెలుసు. స్క్రీన్‌ప్లే రాయడంలో ఆయన్ను మించిన వారు లేరని సినిమా పరిశ్రమ కొనియాడుతుంది. కె.వి ముందు – రోహిణి, వాహిని సంస్థల్లో కాషియర్‌గా పనిచేసినా, నిర్మాణ వ్యవహారాలు చూసినా ఆయన దృష్టి దర్శకత్వం మీదనే వుండేది. ఇంగ్లీషులో స్క్రీన్‌ప్లే రైటింగ్ మీద వచ్చిన పుస్తకాలు, దర్శకత్వం మీద వచ్చిన పుస్తకాలు బాగా చదివేవారు. వాహిని సంస్థకు గురువైన కె.రామ్‌నాథ్ దగ్గర చాలా విషయాలు తెలుసుకున్నారు. కె.వి రెడ్డి తొలిచిత్రం 'భక్తపోతన' (1943) కి కె.రామ్‌నాథ్ స్క్రీన్‌ప్లే రాశారు. అలాగే బి.ఎన్ రెడ్డి తొలి సినిమా 'వందేమాతరం' (1939) కీ ఆయనే స్క్రీన్‌ప్లే రాశారు. ఆయనే రెండు చిత్రాలకు ఛాయాగ్రాహకుడు. "రామ్‌నాథ్ దక్షిణదేశ సినిమాకి గొప్పవరం" అని కీర్తించింది పరిశ్రమ. 'భక్తపోతన' అఖండమైన విజయం సాధించింది. తొలి సినిమాతోనే కె.వి.కి గొప్ప పేరొచ్చింది. "కథ చెప్పడం వేరు సినిమా కథ చెప్పడం వేరు. సినిమాకథ జనరంజకంగా వుండాలంటే కొద్ది మార్పులు చెయ్యాలి. 'పోతన'లోనూ 'వేమన'లోనూ వేరే పాత్రలు ప్రవేశపెట్టి కథకి బలం చేకూర్చడానికి ప్రయత్నించాను అని చెప్పేవారు కె.వి. "పోతన మహకవి. సామాన్యుడైన రైతు. తను రచించిన భాగవత గ్రంథాన్ని రాజులకు అంకితం ఇచ్చి ధనం సంపాదించాలనే కాంక్ష లేదు. అది శ్రీరామచంద్రుడికే అంకితం. అంతే కథ. దీన్ని ప్రజారంజకంగా ఎలా చెప్పాలన్న ఆలోచనకి ఆరునెలలకు పైగా ఆలోచనలు చేశాను" అని చెప్పారు కె.వి ఒక సందర్భంలో.

కె.వి రెడ్డి సాంఘికాలు, జానపదాలు, పురాణాలూ అన్నీ తీశారు. ఏవో రెండు మూడు చిత్రాలు బాక్స్ ఆఫీసు పరంగా అపజయం పాలు కావచ్చుగాని, ఆయన కృషిలో లోపం కనిపించదు. సినిమా నిజంగా వుండాలి. అన్ని శాఖలూ తృప్తిగా పనిచెయ్యాలి. పాత్రలకి తగిన నటులు వుండాలి. అక్కడ రాజీపడకూడదని చెప్పేవారు రెడ్డిగారు. ఆయన సినిమాల్లో కథాగమనం స్పష్టంగా వుంటుంది. లోటుపాట్లు లేకుండా చూసుకుంటారు. ప్రేక్షకులకి ఎలాంటి అనుమానమూ రాకూడదు.



'పాతాళభైరవి' (1951) ఆనాటి జానపదాల్లో మేటిగా నిలబడింది. అంతకు ముందు వచ్చిన 'గుణసుందరి కథ' (1949) కూడా అంతే, సినిమా నిండా వినోదం వుంటుంది, ఉత్కంఠ వుంటుంది. పాటలు సరళంగా వుండి, ప్రజలు పాడుకునే రీతిలో వుంటాయి.

పాండవుల ప్రసక్తి చిత్రం అంతా వస్తున్నా కూడా పాండవులు లేకుండా 'మాయాబజార్' (1957) తీసిన ఘనత కె.వి రెడ్డిది. అంత పటిష్టమైన స్క్రీన్‌ప్లే అది. ఎక్కువగా పాండవులు కనిపించలేదే' అన్న ఆలోచన ఎవరికీ రాదు. 'మాయాబజార్' విశ్లేషణకు అనువైన సినిమా గ్రంథం. పూనా ఫిలిం ఇన్‌స్టిట్యూట్‌లో 'మాయాబజార్' ప్రదర్శించి విశ్లేషణ ఇస్తూనే ఉంటారు బోధకులు. ఎక్కడా విసుగుపుట్టించకుండా వున్న సినిమాయే – ఉత్తమ స్క్రీన్‌ప్లే లక్షణాలతో వుంటుంది. 'మాయాబజార్' చూచినప్పుడు, చూసిన తర్వాత "ఈ సినిమాలో ఈ దృశ్యం అనవసరం" అనిగాని, "ఇంకోదృశ్యం వుండి వుంటే స్పష్టత వుండేది" అని గాని, అనిపించదు. అందుకే సిఎన్ఎన్–ఐబిఎన్ ఛానల్ నిర్వహించిన 100 సంవత్సరాల్లోని గొప్ప సినిమాలు జాబితాల్లో 'మాయాబజార్' ప్రథమ స్థానంలో నిలబడింది. అది తెలుగు సినిమాకు గర్వకారణం. ఆ కారణానికి కారణం కె.వి రెడ్డి.

కె.వి. మొత్తం స్క్రిప్ట్ రాసుకుని గాని షూటింగ్ ఆరంభించరు. ప్రతి దృశ్యం చదివించుకుని – ఎంత నిడివి వచ్చిందో రాసుకుంటారు. పాటు కొలత లెక్కవేస్తారు. ప్రతి దృశ్యం ముందుగానే, స్క్రిప్ట్ చదవగానే ఎడిటింగ్ అయిపోతుంది. సినిమా పూర్తయిన తర్వాత, ఎడిటింగ్‌లో తీసేసిన దృశ్యాలంటూ కె.వి చిత్రాల్లో కనిపించవు. అంత నిర్దిష్టంగా ఉంటుంది స్క్రిప్ట్. షూటింగ్ వేళలో ఆయన 'పులి'. మొత్తం నిశ్శబ్దంగా ఉండాలి. అందరూ దృశ్యం మీద, షూటింగ్ మీద ఉండాలి. ఇతర ప్రసక్తులు రాకూడదు. లైటింగ్ సిద్ధమైనాక, రిహార్సులు చేయించి, అన్నీ సరిగ్గా వున్నాయి అనుకున్న తర్వాత టేక్ చేస్తారు. సాధారణంగా, మొదటి టేక్ లోనే ఓకె అవ్వుతుంది. ఐతే, ఆయన అందరిలాగా ఓకే అనేవారు కాదు. 'పాస్' అనేవారు. అంటే పాస్ మార్కులు ఇచ్చేవారన్నమాట.

షూటింగ్ అనుకున్న వేళకి ఆరంభం కావలసిందే. జానపద, పౌరాణిక చిత్రాలకు మేకప్, దుస్తులు, ఆభరణాలకి చాలా సేపు పడుతుంది. అందుకే 9 గంటలకు కాల్ షీటు అయితే, అందరూ 6 గంటల లోపే వచ్చేవారు. కె.వి ఒక తన దర్శకత్వ వ్యవహారమే చూసుకునేవారు కాదు. నిర్మాణ విషయం కూడా చూసుకునే వారు. అన్నీ స్పష్టంగా వుండాలి ఆయనకి. ప్రతి వస్తువూ సిద్ధంగా వుండాలి. అన్నపూర్ణవారికి ఆయన తీసిన 'దొంగరాముడు' స్క్రిప్ట్ నేను చూశాను. అందులో కుడివేపున డైలాగులు, షాట్సు వున్నాయి. ఎడమవైపు కావలసిన వస్తువులు స్వహస్తాలతో రాశారాయన. ఒక దగ్గర 'బిందె, బిందెలో మునిగే చెంబు' అని రాశారు. బిందె, చెంబు అని రాస్తే నిర్మాణ శాఖవారు అవి తెస్తారు. బిందెలో చెంబు ముంచే యాక్షన్ ఉంటుంది. అందుకని, స్పష్టంగా 'బిందెలో మునిగే చెంబు' అని రాశారు. అలాగే ఇంకోచోట 'లివింగ్ స్కార్పియన్' అని రాశారు. తేలు అని రాస్తే తేలుబొమ్మ తెస్తారేమోనని!

ఆయనకి ముందు చూపు చాలా ఎక్కువ. 'జగదేకవీరుని కథ'కి షూటింగ్ షెడ్యూల్స్ అక్టోబర్‌లో వేశారు. జనవరిలో 'జలకాలాటలలో' పాట చిత్రీకరణ వేసుకున్నారు. ఏడు గంటల కాల్‌షీటు అంటే, తెల్లవారు జామున 4 గంటలకే నటులు రావాలి. నలుగురూ నీళ్లలో దిగాలి. జనవరి కాబట్టి, కాస్త చలిగా వుంటుంది. చల్లటి నీళ్లలోకి దిగడానికి, అమ్మాయిలు తటపటాయిస్తారు. అందుకని కె.వి గారు తన స్క్రిప్ట్ లో "సప్లై వార్మ్ వాటర్" అని రాశారు. గొట్టాలతో వెచ్చని నీరు రావడంతో నలుగురూ హాయిగా నీళ్లలోనే వుండి, పాట పూర్తి చేశారు. మూడు పూటల్లో తీయాలనుకున్న పాట, రెండు పూటల్లోనే పూర్తయింది. అదీ కె.వి గారి ముందు ఆలోచన.

ఆయన ఎప్పుడూ రెండు చిత్రాలు ఒకే సారి చేయ్యలేదు. ఒక చిత్రం అయిన తర్వాతే రెండో దాని ఆలోచన. "ఐ డోంట్ హావ్ 2 బ్రైన్స్" అనే వారు ఆయన సినిమా నిర్మాణానికి ఒక శాస్త్రం వుంది. ఆ శాస్త్రాన్ని క్షుణ్ణంగా తెలుసుకుని, అమలు చేసి విజయం సాధించిన దర్శకుడాయన. ప్రతి సినిమాకీ పాత్ర ధారుల నిర్ణయమైన తర్వాత, స్కెచెస్ వెయ్యాలి.. వేలుకి ధరించే ఉంగరం కూడా ఎలా వుండాలో కళాదర్శకుడు స్కెచ్ వెయ్యాల్సిందే! ఇది, చాదస్తంగా కనిపిస్తుందేమోగాని, ఆయన విధానం అది! స్క్రిప్ట్ సిద్ధం కావడానికి ఎన్ని మాసాలు పట్టినా నిరీక్షించవలసిందే. ఇప్పటిలా, నటీనటులు దగ్గర డేట్స్ తీసుకుని, అప్పుడు కథకోసం పరుగెత్తే నైజం కానే కాదు.



రావి కొండలరావు

# చక్కిలిగింత

– మోహన్



షాలినీ ఈజ్ వెరీ వెర్రీ
షార్ప్ యుసీ!




త్రీ సోర్సెస్ అండ్ త్రీ
కాంపొనెంట్ పార్ట్స్ ఆఫ్
మార్క్సిజమ్ ని
డీప్‌గా స్టడీ
చేసింది




ఫ్రెంచ్ రివల్యూషన్ నుంచి
సిమోన్ ది బువా సెకెండ్ సెక్స్
వరకు హిస్టరీని
డయలెక్టికల్
గా ఎనలైజ్
చేస్తుంది




మానవ సంబంధాల పై
ధన బంధాల దండయాత్రని
సకల కోణాల
నుంచి
పరిశీలిస్తుంది
పరిశోధిస్తుంది




మరి, మొన్న
నేనూ
ఐ లవ్
యూ
అంటే




ఉత్తిగా లవ్ సిగ్నల్
తెలీని
బుద్ధమ్మలా
మొహం
పెడుతుందే



## అందాల రాక్షసివే....

పిల్లలూ ఫొటో చూశారుగా.... ఎంత అందంగా, తాజాగా ఉందో. దీని పేరు కూడా అందమైందే– సూర్యబిందు వృక్షం. తెలతెలవారే సూర్యుడి తెలికిరణాలకి మెరిసే మంచుబిందువుల్ని చూడటం బాగుంటుంది కదూ. కానీ, ఇదొక కార్నివోరస్ మొక్క (అంటే– మాంసభక్షి అన్నమాట). అటూఇటూ చాపగలిగే వాటి కొసలల్లో నీటి బిందువుల్లా కనిపిస్తున్నవి అంటుకుపోయే జిగురు పదార్థం. ఇవి తియ్యని వాసనలు కూడా వెదజల్లుతుంటాయి. వీటితోనే ఈ మొక్క కీటకాల్ని బంధించి తినేస్తుంది. అది తినేసే పద్ధతి కూడా గమ్మత్తుగా ఉంటుంది. మతిలేని కీటకం తన పలహారానికి చిక్కాక, ఒక విధమైన రసాయనిక ఆమ్లాన్ని విడుదల చేసి ఆ కీటకానికి ఊపిరాడకుండా చంపి, దాన్ని జ్యూస్ గా మార్చి చివరికి మొక్క ఆకుల్లోకి పోషక ద్రవంగా పీల్చేసుకుంటుంది.





దారి కనుక్కోండి

## చిన్నారి 'చిత్రం'





**జి.ప్రణవ్ వర్మ**
భీమవరం, ఆంధ్రప్రదేశ్
3వ తరగతి

చిన్నారుల పెయింటింగ్స్‌ను apchiefeditor@gmail.com కు ఈ మెయిల్ చేస్తే ప్రచురిస్తాం.



చుక్కలు కలపండి



రంగులు వేయండి

# మీ మన: క్లేశానికి మీరే బాధ్యులు



మనం నిరంతరం కుటుంబ సభ్యులతో, బంధుమిత్రులతో, సహోద్యోగులతో, పరిచయస్తులతో మన జీవన వ్యాపారం సాగించుతుండాలి. ఈ సందర్భంలోనే ప్రతి ఒక్కరూ తోటి వారి నుండి ఆరోపణలు, నిందలు, వ్యాఖ్యనాలు ఎదుర్కొంటూ తీవ్ర మనస్తాపానికి, క్లేశానికి, వేదనకు లోనవుతుంటారు. ఎందుకిలా జరుగుతుంది?

భార్య తీవ్ర పరుష పదాలతో భర్తను నిందిస్తుంటుంది. ఇందుకు ప్రతిగా భర్త తీవ్ర ఆగ్రహావేశాలకు లోనవుతాడు. ఇద్దరి మధ్య తీవ్ర ఘర్షణాపూరిత వాతావరణం నెలకొంటుంది. కాని వీరి మాటలు వింటున్న కుటుంబ సభ్యులెవరూ వీరిలాగా తీవ్ర ఆగ్రహావేశాలకు లోనుకారు. ఎందువలన? అందరినీ ఆగ్రహావేశుల్ని చేయగల శక్తి ఆ మాటలకు లేదు. “నువ్వు సోమరివి”, “నువ్వు చాతగాని వాడివి”, “నువ్వు అబద్ధాల కోరువి” వంటి వ్యాఖ్యానాలు ఆమె భర్తను ఉద్దేశించి మాత్రమే అంటుంది గనుక అతనొక్కడే ఆగ్రహావేశాలకు లోనవుతాడని భావించవచ్చు. కాని అది సరికాదు. భార్య వ్యాఖ్యానాలను, నిందలను భర్తే తనకు అన్వయించుకోవడం వలన అతను నిస్సహాయతకు, ఆగ్రహావేశాలకు లోనవుతున్నాడు. మరి ఇందుకు ప్రత్యామ్నాయం ఏమిటి ? ఆమె చేస్తున్న ఆరోపణల నేపథ్యాన్ని ఆమెకే అన్వయించి చూస్తే ఎలా ఉంటుంది? “నీతో ఎక్కువ సమయం గడపడం లేదన్న బాధను వ్యక్తం చేయడానికి, నన్ను నిందించడమే మార్గంగా ఎంచుకొన్నావు”. “నీకు ఇంట్లో పని బాగా పెరిగిపోయి, అలసటకు లోనయ్యి ఆ చికాకును నాపై ప్రదర్శిస్తున్నావు. “నన్నిలా నిందించడం ద్వారా నువ్వు అసలేం చెప్పదలచుకొన్నావు?” ఇలా ప్రశ్నించడం ద్వారా, “నీ మనస్థితి ఇప్పుడు సరిగ్గా లేదు. అందుకే ఇలా నిందిస్తున్నావు. నీ మనస్థితిని సరిచేసుకోవలసిన బాధ్యత నీదే! అందుకు నేను కూడా సహకరిస్తాను,“ అనే భావాన్ని భర్త వ్యక్తం చేయగల్గుతాడు.

పై అధికారి తన వద్ద పనిచేస్తున్న ఉద్యోగిపై మండిపడతాడు. “నీకు బద్ధకం ఎక్కువయ్యింది. అసలే పనీ సరిగ్గా చేయడం లేదు”. ఇది విని ఉద్యోగి కుంగిపోతాడు. తాను రోజుకు పదిగంటలు పని చేస్తున్నా ఆయనిలా నిందించే సరికి నిస్సహాయతకు లోనవుతాడు. అతనికి కొన్ని రాత్రులు నిద్ర పట్టదు. పై అధికారి తనెప్పుడు పిలిచి, మరెలా నిందిస్తాడోనన్న భావనే అతను వణికి పోయేలా చేస్తుంది. తాను పదిహేను సంవత్సరాలుగా ఉద్యోగం చేస్తున్నా ఎవరూ తననిలా నిందించలేదని, తనపై ఆయనకెవరో ఏవేవోకల్పించి చెప్పారని తనలో తాను కుమిలిపోతాడు. పై అధికారి చేసిన వ్యాఖ్యానాన్ని నిరంతరం తలచుకుంటూ వేదన చెందే ఉద్యోగి, తన ఆలోచనలను పై అధికారి పైకి మళ్ళించడు. పై అధికారి చికాకుతో. తనపై వస్తున్న వత్తిడి వలన, తన ఆగ్రహాన్ని ప్రదర్శించే మార్గంలో తనపై అటువంటి వ్యాఖ్యానాలు చేశాడే తప్ప, లోతుగా ఆలోచించి మాట్లాడిన మాటలు కావని గుర్తించితే ఆ ఉద్యోగి అసలు కలవరపాటుకు లోనయ్యేవాడు కాదు.

దాదాపుగా ప్రతి ఒక్కరూ తమనుద్దేశించి ఎదుటివారు చేసే ఆరోపణలను, వ్యాఖ్యానాలను, నిందలను తమకు వెంటనే అన్వయించుకుంటారు. అలా అన్వయించుకోగానే నిస్సహాయతకు, తీవ్ర వ్యాకులతకు లోనవుతారు. ఎందువలన ఇలా జరుగుతుంది?

ఆత్మవిశ్వాసం, ఆత్మస్థైర్యం లోపించడం వలన ప్రతి ఒక్కరూ తమలో ఏవేవో లోపాలున్నాయని, వాటిని ఎదుటి వారు ఎత్తి చూపుతూ తమను అవమానిస్తున్నారని నమ్ముతుంటారు. సహజమైన మానవ ప్రవృత్తిలో వుండే అంశాలను కూడా వారు లోపాలుగా పరిగణించుతుంటారు. ఆఫీసు నుండి ఆలస్యంగా వచ్చిన భర్తను ఉద్దేశించి భార్య “మీరు ఆఫీసులో లేడీ కోలిగ్స్‌తో కాలక్షేపం చేయడానికి తపించి పోతుంటారు. అప్పుడు నేను మీకు జ్ఞాపకం రాను” అనగానే అతను తీవ్ర ఆగ్రవేశాలతో చలించిపోతాడు. అందుకు భిన్నంగా “మీరు ఎవరినో హత్య చేసి ఉంటారు” అని భార్య ఆరోపించితే అతనసలు పట్టించుకోడు. నవ్వుకుంటాడు. అందులో ఇసుమంత కూడా వాస్తవం లేదని అతనికి తెలుసు. అందుకు భిన్నంగా తోటి ఉద్యోగినులతో కబుర్లు చెప్పడం అతనికి ఇష్టమైన అంశమే! భార్య ఆ అంశాన్ని ఎత్తి చూపే సరికి, తన బలహీనత బహిర్గతమైందని అతను తల్లడిల్లిపోతాడు. అసలిది కూడా, అతను భార్య వ్యాఖ్యలను తనకు అన్వయించుకోవడం వలన ఏర్పడిన స్థితి. అందుకు భిన్నంగా “నేను ఆలస్యంగా వచ్చానని నీకు కోపం వచ్చి, నన్ను అవమానించడానికి ప్రయత్నిస్తున్నావు” అని ఆమె వ్యాఖ్యానాన్ని ఆమె మన:స్థితికే అన్వయించడానికి ప్రయత్నించితే అతను నొచ్చుకోవలసిన అవసరం ఉండదు. అలాగే భార్య నాకంటే మీ అమ్మ అంటేనే మీకు ప్రాణం అని వ్యాఖ్యానించగానే భర్త తల్లడిల్లిపోతాడు. తల్లిని అమితంగా అభిమానించడం ఒక సహజ ప్రవృత్తి. ఆ సహజ లక్షణాన్ని కూడా భార్య ఒక లోపంగా చూపుతుంటే “నువ్వంటే నాకెంత ప్రేమో మా అమ్మ అన్నా అంతే ప్రేమ” అని చెప్పగల మనోస్థైర్యం చాలా మందికి ఉండదు.

పూర్తి ఆత్మ విశ్వాసాన్ని అలవరచుకోకలిగిన వ్యక్తి తన ఆలోచనలకు, తన ప్రవర్తనకు తానే పూర్తి బాధ్యుడిననుకుంటాడు. తనను వేదనకు గురి చేయగల అవమానించగల అవకాశాన్ని మరొకరికి అప్పగించడు. తమ మదినిండా ఆత్మవిశ్వాసాన్ని నింపుకొన్న వారిలో ప్రస్ఫుటంగా కనిపించే అంశం మరొకటి ఉంటుంది. వారు ఎదుటివారిని హేళన చేయడానికి, వారిలో లోపాలు ఎంచి తమది పైచేయిగా నిరూపించుకోవడానికి ఎన్నాడూ ప్రయత్నించరు. ఎదుటి వారి కంటే తక్కువ వారమూ కాదు. అధికులమూ కాదన్న స్పష్టత వారికి వుంటుంది. తమ ప్రత్యేకత, తమ విశిష్టత తమదీ అని వారు గాఢంగా విశ్వసిస్తారు. అలాగే ఇతరులలో నిరంతరం లోపాలు ఎంచేవారు, ఇతరులను అవమానించే అవకాశం కోసం ఎదురు చూసేవారు. ఆత్మన్యూనతతో బాధింపబడే వ్యక్తులని వారు గుర్తిస్తారు. అటువంటి వారి పట్ల తమ మదిలోనే జాలిని ప్రదర్శిస్తారు. వారు ఎంతటి అన్యాయంగా మాట్లాడినా, ఎన్ని అనవసరపు ఆరోపణలు చేసినా వారు ఎంత మాత్రం ఆగ్రహానికి, క్రోధానికి లోనుకారు. తమను అవమానించగల, తమలో ఆగ్రహం తెప్పించగల శక్తిని తామెవ్వరికి ధారాదత్తం చేయమని, తాము ప్రత్యక్షంగానో, పరోక్షంగా అంగీకరించినప్పుడు మాత్రమే తమను క్లేశానికి గురి చేయగల అవకాశం ఎదుటివారికి లభిస్తుందని వారు స్పష్టంగా గుర్తించుతారు.



**సి నరసింహారావు**
మనోవైజ్ఞానిక విశ్లేషకులు

# ప్రాంతీయ నామాల సొగసు!

విజయనగరం జిల్లాలో అడవులూ ఎక్కువే, అడవి బిడ్డలూ ఎక్కువే! అక్కడ సవర, జాతాపు, గదబ, సామంత, కొండ దొర జాతులవారు ఎవరి మానాన వారు వేలాది సంవత్సరాలుగా మనుగడ సాగిస్తున్నారు. నాలాంటి ఓషధీప్రస్థాన ప్రియులకు అందుకే ఆ ప్రాంతం అంటే ఎక్కువ మక్కువ.

మక్కువ అంటే గుర్తుకొచ్చింది. ఒకసారి నేను బొబ్బిలి నుండి 'మక్కువ' అనే అటవీ ప్రాంతానికి వెళ్ళాను. దానికి దగ్గర్లోనే 'మూలవలస' అనే జాతాపు గిరిజనుల గూడెం ఉంది. ఆ గూడెం శివార్లలో నాకు ఒక యువకుడు తారసపడ్డాడు. అతగాడితో అతని 'అమ్మనుడి'లోనే మాట కలిపాను:

ఇన్నివా! (ఇలా రా).

వచ్చాడు.

నీ దోరు ఎనదోరు? (నీ పేరేమిటి?)

నా దోరు ముల్లయ.

మీ నాయం ఎంబిటి? (మీది ఏ ఊరు?)

మా నాయం 'మూల వలహ' (మా ఊరు మూలవలస – 'స' బదులు 'హ' పలుకుతారు)

ఈ బద్దు ఎనదోరు? (ఈ తీగ పేరేమిటి?)

ఈ బద్దు 'పొదద బద్దు' (ఈ తీగ నేల గుమ్ముడు తీగ).

పొదదబద్దు వేరు మామూలు వేర్లలా ఉండదు. దాని మొదలు 20–30 కిలోల బరువున్న గడ్డ (దుంప)లా ఊరుతుంది. ఆ తరువాత, 30 సెంటి మీటర్లూ అంతకన్న ఎక్కువ పొడవూ, 3–4 సెంటి మీటర్ల లావూ కలిగిన కాడలా సన్నబడి, మళ్ళీ 15–20 కిలోల గడ్డలా ఊరుతుంది. ఇలా పరిమాణం తగ్గుతూ అనేక గడ్డలు భూమి లోపలే తయారవుతాయి. గడ్డను కోస్తే లోపల దాదాపు తెల్లగా ఉంటుంది. ముక్కలు కోసి, ఎండ బెడితే 10 కిలోలకు ఒక కిలో కూడా మిగలదు. నీరంతా ఆవిరైపోడం వల్ల, ముక్కలు వంకాయ వొరుగుల్లా గలగల్లాడతాయి.

ఇక ఈ తీగ ఉపయోగాల విషయానికి వస్తే– ఇంతవరకు ఎవరు చెప్పినా ఈ పాదు యొక్క గడ్డ ఉపయోగాలే చెప్పారు. కాని, జాతాపు ముల్లయ ఒక్కడే కొమ్మలో ఉండే సారం (రసం) ఉపయోగం చెప్పడం విశేషం! అదేమిటంటే – పొదద (బద్దు) తీగను తెంపి, రెండు కణుపుల మధ్య ముక్క (ఇంటర్ నోడ్) ను కోసి, ఒక కొన (కొస) నోటిలో పెట్టుకుని ఊదితే రెండవ కొన నుండి వచ్చే రసాన్ని కత్తీ, గొడ్డళ్ళ గాయాలకు రాస్తే, ఎంత ప్రమాదకరమైనవైనా



త్వరగా మానిపోతాయట. అవును మరి! అడవి పుత్రులకు లేచింది లగాయతు విల్లంబులూ, కత్తీ కటారులతోనే కదా పని?

ఐతే, ఇదే గడ్డను బస్తరు అడవుల్లోని హల్బా జాతి గిరిపుత్రులు 'భూయి కుమడా' అని పిలుస్తారు. వారు దీన్ని ముక్కలుగా కోసి, నీళ్ళలో ఉడికించి, ఆ నీళ్ళతో స్నానం చేసి వొంటి నొప్పుల్నీ, ఉబ్బరింపులనూ (dropsy) తగ్గించుకుంటారు. బలవంతంగా మింగి, కడుపులోకి పంపే మందులకన్న పైపూత మందులే మంచివి కదా!

'సందట్లో సడేమియా' అన్నట్లు... నా మనసులోని అనుమానాన్ని మీతో పంచుకుంటాను... జాతాపు ముల్లయ– మూల వలసను 'మూల వలహ' అన్నాడు. ఈ మధ్యనే, గువాహటి (గౌహతి) ముఖ్యపట్టణంగా ఉన్న 'అసోం' రాష్ట్రాన్ని– బ్రహ్మపుత్రా నదీ ప్రాంతాల భూమిపుత్రులు 'అహోం' అంటారని విన్నాను. అంటే– వారు కూడా 'స' అక్షరాన్ని 'హ' అని పలుకుతారా?

ఇప్పుడు ప్రాంతీయ నామాల సొగసును తెలియజేస్తూ నేను 'అత్తపత్తి' అనే మొక్కమీద రాసిన ముచ్చటను పరిచయం చేస్తాను. ఇది రాగయుక్తంగా పాడుకోడానికి అనువుగా ఉంటుంది.

'అత్తపత్తి', 'సిగ్గుచింత', 'మైమోజా పుడికా'<br>
'నిద్రగన్ని', 'కునుకురొద్ద', 'లజ్జాలూ' మూలిక!<br>
'సిగులుగుట్టి', 'లజ్జగుచ్చ'.. ఎన్ని పేర్లు దీనికి?<br>
తాకినంత ఆకులన్ని ముడుచుకునే దానికి!<br>
పొలంగట్టు, అడవితట్టు, కొల్లేరు కొలను చుట్టు<br>
ఆంధ్రావని నేలనంటి చిరుచాపలు పరిచినట్టు!<br>
అత్తపత్తి వేరు తెచ్చి రసం తీసి పుచ్చుకో,<br>
మూలవ్యాధి, చలిజ్వరముల బారి నుండి తప్పుకో!

ఈ పాటను నేను 15 ఏళ్ళ క్రితం రాసాను. వనమూలికా వైభవం గురించి రాసిన దాదాపు వంద గీతాలలో నాకు బాగా నచ్చినది కూడ ఇదే! అత్తపత్తి అని తెలుగులోను, లజ్జాలూ అని సంస్కృతంలోను, 'టచ్ మి నాట్' అని ఆంగ్లంలోనూ, 'మైమోజా పుడికా' అని లాటిన్ భాష లోను పిలిచే ఈ మొక్కను తెలుగు గడ్డ గిరిజనులు ఎంత సొగసైన పేర్లతో పిలుచుకుంటున్నారో! ఐతే, ఆపాట రాసిన తరువాత కూడ, ఆ మొక్కకు సంబంధించి– 'కునుకు ఆకు', 'నిద్ర గనికి', 'లజ్జపడ్డ, 'నత్తపత్తి' అనే మరికొన్ని పేర్లు నాకు దొరికాయి. నత్తపత్తి అనే పేరు కృష్ణా జిల్లాలోనే లభించడం విడ్డూరమే! అదెలా అంటే...

ఒక రోజున కృష్ణా జిల్లా గుడివాడ దగ్గర్లో వరి కోతలు పూర్తయి ఖాళీగా ఉన్న పొలాల్లో 70 యేళ్ళ ముసలమ్మ పశువుల్ని కాసుకుంటూ కనబడింది. బండి ఆపి, ఆమెకు పొలం గట్టుమీద పెరుగుతున్న అత్తపత్తి మొక్కను చూపించి దాని పేరేమిటన్నాను. అదా నాయనా! దాన్ని 'నత్తపత్తి' అంటారు అంది. అలా ఎందుకు అంటారు? అని అడిగితే, దానిని ముట్టుకుంటే ఆకులన్నీ 'నత్తలా' ముడుచుకుపోతాయి అంది. ఇది నాకు కొత్త సమాచారమే! ఏమంటే– ఇంతవరకు అందరూ 'అత్తపత్తి' అన్నవారేకాని, 'నత్తపత్తి' అని చెప్పినవారేలేరు! ఆలోచించి చూస్తే– అత్తపత్తి కన్న మామ్మ చెప్పినదే సబబనిపించింది. ఎందుకంటే, మనమందరం 'అత్తపత్తి' అని పిలుచుకునే మొక్కకు ఆ పేరు ఎలావచ్చిందో ఒక్కరైనా విడమరచి చెప్పిన పాపాన పోలేదు మరి!



కొప్పుల హేమాద్రి

# ముసలి వారు పడుచుదనానికి వస్తారక్కడ!



మనం నివసిస్తున్న విశ్వంలో కాలం ముందుకు నడుస్తుంది అంటే గడియారం ముళ్లు ముందుకు తిరుగుతాయి. కొంచెం వివరంగా చెప్పుకోవాలంటే శిశువు క్రమంగా పెద్దయి, బాల్య, యవ్వన, వృద్ధాప్య స్థితులకి చేరుకుంటుంది. ఎదిగే ఈ ప్రక్రియకి అరవై డెబ్బయి ఏళ్ళు పడుతుంది.

మన విశ్వం చుట్టూ మరొక విశ్వం ఉందని ఊహాగానాలు చేస్తున్నారు. ఆ విశ్వంలో కాలం వెనుదిరుతుంది అంటున్నారు. ఇటువంటి విశ్వంలో శిశువు జన్మిస్తే చాలా తక్కువ కాలం జీవిస్తుంది. ఈ విశ్వంలోకి ముసలివారిని తీసుకు వెడితే వారు రోజురోజుకు ఆరోగ్యం, ఆయుష్షు పుంజుకుంటూ నడివయసుకు ఆపైన పడుచుదనానికి పెరుగుతారు. అయితే అంతటితో ఆగక శిశువుగా ఎదిగి తల్లి గర్భంలోకి వెళ్లిపోతారు. ఇటువంటి విశ్వం ప్రతిపాదన గురించి లండన్‌లోని ప్రముఖ భౌతిక శాస్త్రవేత్త డా. స్పానర్డ్ 'నేచర్' పత్రికలో రాశాడు.

### ఇటువంటి విశ్వం ఉంటుందా?

కాలం వెనుదిరిగే విశ్వం ఉంటుందనేందుకు ఎన్నో వాదనలు వినిపిస్తున్నాయి. మొదటి సౌష్టవవాదం (సిమెట్రి) అంటే మన విశ్వానికి తుల్యమైన విశ్వం మరొకటి ఉంటుంది. అక్కడ కూడా మన విశ్వంలో పాటింపబడే భౌతిక సూత్రాలు పాటింపబడతాయి అనే వాదన ఉంది.

తన ప్రతిపాదన నిజమయితే మన భౌతిక శాస్త్ర సూత్రాలు, కేంద్రక భౌతిక శాస్త్రంలో కన్పించే కొన్ని అసందర్భాలు సులువుగా వివరించడం సాధ్యమవుతుంది అంటున్నారు స్పానర్డ్.

మనకు రెండు రకాల భౌతిక సూత్రాలు వున్నాయి. మొదటి రకం ప్రకృతి ప్రాథమికంగా అంతరాళం, కాలం పరంగా సౌష్టవంగా ఉంటుందనే భావనకు సంబంధించినది.

కణాలు ఒకదానినొకటి ఢీకొని వెనుదిరిగివచ్చే సందర్భాలలో భౌతిక సూత్రాల అవధిని మించకుండా వాటిని వెనుదిప్పి వాటికి ఆపాదించవచ్చు. ఈ సూత్రాలు పరమాణు కణాలకు కూడా అనువర్తిస్తాయి. రెండవరకం సూత్రాలు ఉష్ణగతిక శాస్త్ర రెండవ నియమంపై ఆధారపడి ఉంటాయి. అంటే ఈ సూత్రాలు వెనుదిరగవు. కొంచెం వివరంగా ఈ విధంగా చెప్పుకోవచ్చు.

ఈత కొలను కింది నుండి ఉపరితలానికి వచ్చేటప్పుడు ముందు మన తల వస్తుంది కాని కాళ్లు రావు, ఇంకా విశదంగా చెప్పుకోవాలంటే మనం పెద్దవారిగా ఎదగగలంగాని, పెద్దవారు యువకుల్లా ఎదగలేరు. ఒక రేడియో ధార్మిక పదార్థం పరమాణుకణాలుగా విఘటనం చెందగలదు గాని పరమాణు కణాలు ఐక్యత చెంది రేడియో ధార్మిక పదార్థంగా తయారు కాదు.

### సూత్రాలు వీగిపోవు

మనం నివసిస్తున్న విశ్వం వ్యాప్తి చెందుతోంది. పైగా కాలం ముందుకు సాగిపోతుంది. మరి మన విశ్వం కాలం విషయంలో అసౌష్టవం ప్రదర్శిస్తుందని మనం ఎలా భావించగలం. అందుకే కాలం వెనుదిరిగే విశ్వాన్ని ప్రతిపాదిస్తే భౌతిక సూత్రాలన్నీ వీగిపోకుండా నిలబడతాయి.

ఇలాంటి విశ్వం ఉనికి కనుగొనడం ఎలా? అటువంటి విశ్వంలోని పరమాణువులు, ప్రక్రియలు అన్నీ మన విశ్వం నుండి పూర్తిగా ఇన్సులేట్ అయి ఉంటాయట. కాలం వెనుదిరిగే విశ్వంకు చెందిన మనిషి మన దృష్టికి అందకుండా మన గుండా నడిచి వెళ్లిపోవచ్చు. ఈ రెండు విశ్వాల మధ్య ప్రసారానికి ఏదైనా పద్ధతి రూపొందిస్తే ఫలితాలు చాలా ఎబ్బెట్టుగా ఉంటాయి. కాలం వెనుదిరిగే విశ్వం పదార్థం మన చుట్టూ మనకు తెలియకుండా ఉంటుంది. దీని తాలూకు గెలాక్సీలు ఆకాశంలో ఉంటాయి. అయితే మన విశ్వం బాపతు గెలాక్సీలకు ఈ గెలాక్సీలు తెలియాల్సిన అవసరం లేదట.

### కాలం వెనుదిరిగే విశ్వం - విశేషాలు:

మన విశ్వంలో నక్షత్రాలు కాంతిని విడుదల చేస్తూంటే ఆ కాంతి మనల్ని చేరుతోంది. కాలం వెనుదిరిగే విశ్వంలో నక్షత్రాలు కాంతిని పీల్చుకుంటాయి. ఇటువంటి నక్షత్రాలను చూడాలంటే మన దూరదర్శనులు ఉపయోగపడవు. వాటిని చూసే దూరదర్శినులకు వేడికి సున్నితంగా స్పందించే పరికరాలు అమర్చాలి. ఆకాశంలో చల్లని కేంద్రాల కోసం వెతకాలి. అంటే ఈ కేంద్రాలు కేంద్రకశక్తి (న్యూక్లియర్ ఎనర్జీ) విడుదల చేయడానికి బదులు ఆ శక్తిని పీల్చుకుంటాయి. అయితే ఇంతవరకు అటువంటి విశ్వాన్ని ఎవ్వరూ గుర్తించలేదు. కారణం ప్రస్తుతం మనకు వున్న విజ్ఞానం శక్తిని విడుదల చేసే నక్షత్రాల గురించి మాత్రమే ఉంది.

### కె మెసాన్‌లు

ప్రస్తుతం పరమాణు కణాలైన కె.మెసాన్‌లు పెద్ద రహస్యంగా వున్నాయి. వీటి గురించి ఏమీ స్పష్టంగా పూర్తి అవగాహన కలగడం లేదు. సాధారణంగా ఈ కణాలు త్వరత్వరగా ఇతర కణాలుగా విఘటనం చెందుతున్నాయి. కొన్ని కణాలు అవి జీవించి ఉండాల్సిన కాలం కన్నా ఎక్కువ కాలం జీవిస్తున్నాయి.

ఇటువంటి వాటికి కారణాలు కాలం వెనుదిరిగే విశ్వాన్ని ఆసరా చేసుకుంటే తెలుస్తాయి. ఈ కణాలు కొత్త విశ్వం ప్రవేశించి అవి ముసలి వయసు నుంచి పడుచు వయసుకు ఎదిగి త్వరత్వరగా విఘటనం చెందక ఎక్కువ కాలం జీవిస్తూఉంటాయి.

వీటిలో కొన్ని మళ్లీ మన విశ్వంలో ప్రవేశించి త్వరగా విఘటనం చెందుతాయి. విచిత్రం ఏమిటంటే కాలం వెనుదిరిగి విశ్వంలోని వారి గతం మన భవిష్యత్ అవుతూ ఉంటుంది. అంటే, మనం వారికి వారి భవిష్యత్‌ను ముందు చెప్పగల్గుతాం.

ఈ రెండు విశ్వాల మధ్య రవాణా సౌకర్యం ఏర్పాటు చేయగల్గితే మనిషి మరణాన్ని జయించగల్గుతాడు. మన విశ్వంలో మరణ శయ్యమీద వున్నవారిని ఆ విశ్వానికి తీసుకువెడితే తిరిగి అతడు నిండు జీవితకాలం బతికి పసివాడుగా మారుతాడు.

– 'సైన్సు చక్రవర్తి' సి.వి. సర్వేశ్వర శర్మ

## మీరూ శాసనాలు చదవొచ్చు

# అశోకుని ఎర్రగుడి శాసనం (క్రీ.పూ.257)



కర్నూలు జిల్లా పత్తికొండ తాలూకాలో (అనంతపురం జిల్లా) గుత్తికి 10 కి.మీ దూరంలోనున్న ఎర్రగుడి పొలాల్లో గుట్టల్లోని రాళ్లపైనున్న అశోకుని శాసనాలను మొదట 18వ శతాబ్దం చివర్లో మెకంజీ, ఆయన సహాయకులు గుర్తించారు. అయితే 1928-29 లో జియోలాజికల్ సర్వే ఆఫ్ ఇండియాకు చెందిన ఘోష్ అనే పరిశోధకుడు వాటి వివరాలను భారత పురావస్తు శాఖకు తెలియజేయగా, వారు నకళ్లను తీసి ప్రచురించిన తరువాత ఎర్రగుడిలో అశోకుని శాసనాలున్నాయని తెలిసింది. అక్కడున్న 14 శాసనాల్లో మచ్చుకు ఒకటో శాసనాన్ని లిపి, భాషలను పరిశీలించడానికి ఇక్కడ పొందుపరుస్తున్నాను.

### శాసనం

- (i) దేవానం పియే హేవాహా (ii) అధికాని
- య హకమ్ ఉపానకే (iii) నోతు ఖో ఏకం సంవఛరం పకా(0)తే
- హుసం (iv) సాతిరేకే చుఖో సవఛరే యం మయా సంఘే ఉపయీ
- తే బాఢంచమే పకంతె (v) ఇమినా చు కాలేన అమిసా (యే) మునిసా
- దేవేహి తే దాని మిసి భూతా (vi) పకమస హి
- ఇయం (vii) మహప్తేనేవ సకియే (viii) ఖుదకేన పి పక
- మమినేన సకియే విపులే స్వగే ఆరా ధేతవే (ix) ఏ తాయచ అఠాయ ఇయం
- (సా)ననె సావితే (x) అరా ఖుదక మహలకా ఇమం పి (ప) క మెవూ అ(0)
- తా చమే జానెవు చిరఠితికా చ
- ఇయం పకమే హౌత విపులం పిచ వఢసితా అపరధియా దియాఢియం
- (xi)వాపితె వ్యూథేన 200 50 6

### శాసన వివరాలు

1 దేహంనాప్రియుడు (అశోకుడు) ఈ విధంగా చెబుతున్నాడు.

2 నేను ఉపాసకుడనై (రెండున్నర ఏండ్లు) గడిచాయి.

3 మొదటి సంవత్సరంలో (బౌద్దమత వ్యాప్తికై) నేను తగిన కృషిని చేయలేక పోయాను.

4 నేను దీక్షతో ఇప్పటికి ఒక సంవత్సరము నుంచి సంఘ విషయంలో పనిచేయుచున్నాను.

5 అప్పటి వరకును దేవత్వాన్ని పొందనివారు ఈ సంవత్సరం కాలంలో దేవత్వాన్ని పొందారు.

6 ఇది నా ధర్మప్రచార ఫలమే.

7 దేవత్వమును పొందగలుగునది ధనికులు మాత్రమే కాదు.

8 దరిద్రుడు కూడా మనసార ధర్మనిష్ఠతో నడిచినట్లైతే స్వర్గాన్ని పొందగలుగుతారు.

9 అందుకే నేను ఈ శాసనాన్ని నెలకొల్పాను.

10 నా రాజ్యంలోని ధనికులు, పేదవారూ ఈ విధంగా ధర్మాన్ని ఆచరిస్తే, దానిని తెలిసి ఆ విధంగానే ధర్మనిష్ఠతో నడుచుకొనే ఇతర రాజ్యాలవారు కూడా రెట్టింపవుతారు.

11 (నేను) 356 (దినములు) యాత్రను సాగించిన తరువాత (ఈ శాసనాన్ని నెలకొల్పాను)



డా ఈమని శివనాగిరెడ్డి - స్థపతి




## ప్రేమలో పడ్డ భానుమతి

సినిమా హీరోయిన్లు – దర్శకుల ప్రేమలో పడిపోవడం అప్పుడప్పుడూ జరుగుతూ ఉంటుంది. ఇది ఒక నాటితరం వారి నుంచి నేటి తరం వరకూ అలా కొనసాగుతూనే ఉంది. ఉదాహరణకు నాటితరం వారిలో నటీమణులు శాంతకుమారి, భానుమతి – దర్శకులు పి.పుల్లయ్య, పి.ఎస్.రామకృష్ణలను ప్రేమించి పెళ్లి చేసుకుంటే, ఈ తరంలో రమ్యకృష్ణ, కుష్బూ – కృష్ణ వంశీ, సి. సుందర్‌లను ప్రేమించి వివాహమాడారు. ఈ ప్రేమ విహహాలలో భానుమతి గారి ప్రేమ కాస్త సాహసోపేతమైనదని చెప్పాలి. ఎలా అంటే, ఆ వివరాలు ఆమె మాటల్లోనే చిత్తగించండి. "నేను 'కృష్ణప్రేమ' (1943) లో నటిస్తున్నప్పుడు ఈ మహానుభావుదు (రామకృష్ణ)తో పరిచయమైంది. ఆ చిత్రానికి అప్పుడు ఆయన డైరెక్టరు హెచ్.వి. బాబు




గారికి సహాయకుడిగా – డైరెక్షన్, ఎడిటింగ్ శాఖల్లో పనిచేస్తున్నారు. ఎందుకో చెప్పలేను. లవ్ ఎట్ ఫస్ట్ సైట్ అంటారే అలా ఆయన ప్రేమలో పడ్డాను. పైగా ఆ సినిమా డైరెక్టరు బాబుగారు, సంగీత దర్శకులు గాలి పెంచల నరసింహారావు గారు, రచయిత తాపీ ధర్మారావు గారు – ఇలా ఆ యూనిట్‌లో ఉన్న ప్రముఖులందరూ రామకృష్ణ మంచివాడని పొగుడుతూ ఉండేవారు. ఈయన మాత్రం ఓ మహామునిలా తనేమిటో...తన పనేమిటో! నేను ప్రేమిస్తున్నట్లు ఎన్ని సంకేతాలు ఇచ్చినా నో రెస్పాన్స్. రోజులు గడిచే కొద్దీ నాలో టెన్షన్! ఇంట్లో మా అమ్మా నాన్నా, నాకు పెళ్లి సంబంధాలు చూస్తున్నారు. ఒక సంబంధం దాదాపు ఖాయమయ్యేలా ఉంది. పోనీ ధైర్యం చేసి, నేనే విషయం నాన్నకు చెబుదామంటే ఆయనకు రామకృష్ణ గారు నచ్చరని నా గట్టి నమ్మకం. మా నాన్నకు ఆస్తి పరుదు, ఆజానుబాహువు, సంగీత ప్రియుడు ఇంకా ఏవేవో క్వాలిఫికేషన్స్ ఉన్న అల్లుడు కావాలి. ఈయనలో అవేమి లేవు. అజానుబాహువు అసలే కాదు. నాకంటే ఒక్క అంగుళం పొడుగు! ఇక అలా ఊరికే ఉంటే లాభం లేదని, ఒక రోజు సాయంత్రం చీకటి పడిన తర్వాత రిక్షాలో నేనే ఒంటరిగా ఆయన రూమ్‌కు వెళ్లాను. నేను గదిలో అడుగుపెట్టగానే ఆయనకు కంగారు, చెమటలు! నేను సిగ్గు విడిచి చెప్పాను – "పెళ్లి చేసుకుందాం' అని. ఆయన గారి 'రియాక్షన్' చూడాలి. "ఇదిగో...చూడమ్మాయ్ ...బాగా ఆలోచించుకో. నువ్వు స్టార్‌వి...నేను ఎడిటర్‌ని. నాకు వచ్చే జీతం నెలకు యాభై రూపాయలు. దాంతో నిన్నెలా పోషించగలను? బాగా ఆలోచించుకో!!" ఇవండీ ఆయన చెప్పిన సలహాలు, నీతులు! తనంతట తాను సిగ్గు విడిచి ఒక ఆడపిల్ల వచ్చి పెళ్లి చేసుకోమంటే ఇలా ఏ మగాడైనా మాట్లాడతారా?" భానుమతి గారు ఆయన సమక్షంలోనే ఈ ప్రేమ కథంతా చెబుతుంటే, సమాధానంగా చిరునవ్వులు కురిపిస్తూ ఆమె వంకే ప్రేమగా చూశారు రామకృష్ణ.

## ఘంటసాల 'పాత్రోచిత'గానం

ప్రసిద్ధ గాయకులు ఘంటసాల పాత్రలకు తగినట్లుగా నేపథ్యగానం చేసేవారా? లేక పాత్రధారులకు సరిపోయేలా ఫ్లేబ్యాక్ పాడేవారా? దీనికి విజయావారి 'మాయాబజార్' (1957) చిత్రంలోని 'సుందరి నీ వంటి దివ్య స్వరూపము ఎందెందు వెతికిన లేదు కదా' అనే పాటే ఓ ఉదాహరణ. ఈ పాట వెనక ఓ చిన్నకథ ఉంది. లక్ష్మణ కుమారుడు పాత్ర ధరించిన రేలంగిపై చిత్రీకరించాల్సిన ఈపాటను సంగీత దర్శకుడు ఘంటసాల ఆధ్వర్యంలో మొదట పిఠాపురం నాగేశ్వరరావు పాడారు. రేలంగి గొంతుకు ఆయన గాత్రం దగ్గరగా ఉంటుందని సాధారణంగా అలాంటి పాటలను పిఠాపురం చేతే పాడిస్తుంటారు సంగీత దర్శకులు ఐతే, చిత్ర దర్శకుడు కె.వి రెడ్డి గారికి మాత్రం – ఆ పాట విన్న తర్వాత సంతృప్తి కలగలేదు. ఆ పాట ఘంటసాల పాడితే ఎలా ఉంటుందో చూద్దామని మళ్లీ ఘంటసాల చేత పాడించి రికార్డు చేయించారు. మరోసారి – పిఠాపురం పాడినదీ, ఘంటసాల పాడినదీ విని, ఘంటసాల పాడిందే ఫైనల్‌గా ఓకే చేశారు కె.వి. పిఠాపురం పాడినపాట బాగానే ఉన్నా, కె.వికి ఎందుకు నచ్చలేదో అర్థం కాక ఆయననే అడిగారు ఘంటసాల – ఎలాంటి తేడాలు గమనించారో చెప్పమని! అప్పుడు కె.వి – "పిఠాపురం పాడింది రేలంగికి పాడినట్లుండి... మీరు పాడింది లక్ష్మణ కుమారుడికి పాడినట్లుంది...సినిమాలో మనకి పాత్ర ప్రధానం కానీ పాత్రధారి కాదు. అందుకే నేను మీరు పాడిన పాటను 'పాస్' చేశాను" అన్నారు. దీన్నిబట్టి ఘంటసాల అన్ని పాటలూ ' పాత్రోచితంగానే' పాడతారని అర్థమౌతోంది.




## సావిత్రిని తొలగించిన దర్శకుడు!

సూపర్ హిట్ అయిన చిత్రం 'పాతాళభైరవి' (1951) లో నాయికగా నటించిన మాలతి – ఆ తర్వాత విజయవంతమైన హీరోయిన్‌గా ఎందుకు కొనసాగలేకపోయింది? ప్రముఖ నటీమణి శారద ప్రతిభను మలయాళ చిత్రం 'స్వయంవరం'తో ఉత్తమ నటిగా జాతీయ బహుమతి గెల్చుకున్నాకే – తెలుగుచిత్ర పరిశ్రమ ఎందువల్ల గుర్తించింది? తరచి చూస్తే ఇలాంటి ప్రశ్నలు చాలా తలెత్తుతాయి. అన్నిటికంటే విడ్డూరం –'సంసారం' (1950) చిత్రంలో హీరోయిన్‌గా సావిత్రి సరిగ్గా నటించలేకపోతోందని – దర్శకుడు ఎల్.వి ప్రసాద్ ఆమెను ఆ పాత్ర నుంచి తొలగించి, ఆ సినిమాలో సావిత్రి స్నేహితురాలిగా చిన్న పాత్రను ధరిస్తోన్న పుష్పలతను నాయిక పాత్రకు ఎంపిక చేయడం! దాంతో సావిత్రి హీరోయిన్ స్నేహితురాలి




పాత్రలో ఒకే ఒక్క డైలాగు (అక్కినేనితో 'నువ్ హీరో నాగేశ్వరరావులా ఉన్నావే') ఉన్న పాత్రను ధరించాల్సి వచ్చింది ! ఐతే ఆ 'తొలగింపు' మాత్రం సావిత్రిలో ఎంతో మానసిక సంఘర్షణను రగిలించింది ఆమెకు తీవ్రమైన పట్టుదల ఏర్పడింది. "నటిగా నువ్వేనాకు స్ఫూర్తిగా నిలిచావు. 'సంసారం'లో నన్ను తొలగించి ఆస్థానంలో నిన్ను పెట్టడం నాకు ఉక్రోషాన్ని తెప్పించింది. అందుకు ఎన్ని రోజులు ఒంటరిగా కూర్చుని ఏడ్చానో నాకే తెలియదు. నీలాగా – నటిస్తున్నప్పుడు చలాకీగా ఎందుకు ఉండలేక పోయాను' అని అద్దం ముందు కూర్చుని గంటల తరబడి ప్రాక్టీస్ చేస్తూ ఉండేదాన్ని' అని సావిత్రి ఆ తర్వాత ఒక సందర్భంలో ఆ పుష్పలతతో చెప్పిందంటే, ఆమె ఆవేదనను అర్థం చేసుకోవచ్చు. ఈ విడ్డూరానికి మరో కొనసాగింపు ఏమిటంటే, 'మిస్సమ్మ' (1955) చిత్రంలో నాయికగా పి.భానుమతిని నిర్మాతలు నాగిరెడ్డి, చక్రపాణి తొలగించినప్పుడు, అదే నాయిక పాత్రకు ఆ చిత్ర దర్శకుడు ఎల్.వి. ప్రసాద్ గారు సావిత్రిని నాయికగా ఆమోదించడం! ఆ చిత్రం సావిత్రి నటజీవితానికి ఓ చక్కని మలుపుగా పరిణమించడం !



బి.కె. ఈశ్వర్

పచ్చని చెట్టు కొమ్మలు, అనకొమ్మలు వేస్తూ రుతువు రుతువుకీ తన రూపాన్ని అంతోయింతో మార్చుకుంటూ ఉంటుంది. జీవనది తన ప్రవాహ పురవడిని బట్టి, వొరవడిని బట్టి పాత మేటల్ని చప్పరిస్తూ, కొత్త లంకలను పోతపోస్తూ సాగిపోతూ ఉంటుంది. మనుషులు వుచ్చరిస్తూ ఆచరిస్తూ భాషకు సంస్కృతిని అనుక్షణం వూపిరి పోస్తూ వుంటారు. అందుకని భాషా సంస్కృతులు సజీవమైనవి. వాటికి ప్రాణం ఉంది.
రాజమహేంద్రవరము అనే స్థలనామం యిప్పుడు రాజమండ్రిగా చెలామణీ అవుతోంది. చాలా మందికి పూర్వనామం తెలిసి కూడా వుండకపోవచ్చు . అలాగే చెట్లపేర్లు, పర్వతాల పేర్లు, నదీ నదాల పేర్లు వేల సంవత్సరాల వ్యవహారంలో ఎంతగానో కదిలిపోయి, చెదిరిపోయి వుండవచ్చు. అయినా వాటిని పొరబడకుండా గుర్తిస్తున్నాం. మిగతా భాషా పదాలు కూడా వాడుకలో అసలు రూపాల్ని పోగొట్టుకున్నాయి. అన్య భాషా పదాలు వచ్చి చేరాయి. అవి తెలుగు వారి నోళ్లలో తిరిగి తిరిగి తెలుగు తనాన్ని పొదువు కున్నాయి. భాషా వేత్తలు మినహా మామూలు వారు "సెటిలైన" యితర భాషా పదాలను పట్టుకోలేరు. ఇది మంచిదే. భాష విస్తృతమవుతుంది. నదులను పుట్టిన చోట చూస్తే చిన్న చిన్న చెలమల్లాగా వుంటాయి. అవి నడక ఆరంభించి, ఆ ప్రయాణంలో వాగుల్ని వంకల్ని, నదుల్ని ఐక్యం చేసుకుంటూ ఒక ప్రవాహంగా మారిపోతుంది. పరీవాహక ప్రాంతంలో కొండల మీద వాన నీరంతా వచ్చి కలుస్తుంది. అఖండ ప్రవాహమై, తన ఆయాన్ని అడుగుల నుంచి మైళ్లకు పెంచుకుంటుంది. భాష అంతే. ఎంతో విస్తరించిన మన భాష ఉధృతిని కోల్పోతోంది. దానికి జవ జీవాలివ్వడం మన కర్తవ్యం.

– సంపాదకుడు

## వాడుకలో అపభ్రంశాలు




- ఆరిపోయిన ఆర్తి అగర్వాల్. మరణించినప్పుడు ఒక వార్తా పత్రిక ప్రచురించిన శీర్షిక. ఆర్తి అంటే దీపం కాదు, హారతి కాదు. ఆర్తి ఆరిపోవడమేమిటో తెలియదు. అసలు మన సంప్రదాయంలో ఒక విలక్షణత వుంది. దీపం ఆరిపోతే కొండెక్కింది అంటాం. బియ్యం అయిపోతే బియ్యం నిండుకున్నాయి అంటారు. నల్లపూసల పేరు తెగిపోతే పేరు పెరిగింది. అని చెబుతారు. పరుషము అయిష్టము అయిన సందర్భాలలో కూడా వీలైనంత సరళంగా తగినంత సరసంగా చెప్పడం మన సంస్కృతి. విషాద వార్తలకు అనుప్రాసలు, అంత్యప్రాసలు ఏరికోరి పెట్టడం ఏ మాత్రం సబబుకాదు.
- రాలిపోయిన మోదుగు పువ్వు. కవి, పండితుడు, నవలారచయిత దాశరథి రంగాచార్య కన్ను మూసినప్పుడు యీ శీర్షిక వచ్చింది. రంగాచార్య మోదుగుపూలు, చిల్లర దేవుళ్లు అనే ప్రసిద్ధమైన నవలలు రాశారు. దానిని ఆసరా చేసుకుని మోదుగు పువ్వుతో పోల్చడమా? మోదుగు పువ్వు ప్రకృతిలో వాసన లేని పువ్వు. అది పూజకు పనికిరాదు. చాలా అందంగా సుకుమారంగా ఉంటుంది. ఈ లక్షణాలు వుండబట్టే ఆ నవలా ఇతివృత్తానికి "మోదుగుపూలు" పేరు పెట్టారాయన. పూర్తిగా అంతరార్థాలు తెలుసుకోకుండా ఆయన మరణవార్తకు దాన్ని విశేషణంగా చేర్చడం ఏ మాత్రం మర్యాదకాదు. ఆయన నవల పేరు కదాని "చిల్లరదేవుడు" అని విశేషణం చేర్చం కదా. ఇలాంటివి సాధారణరాతలో వస్తే అంతగా పట్టించుకోరు గాని మొదటి పేజి శీర్షికలుగా వస్తే మాత్రం గట్టి ముద్రలు పడతాయి.
- ఊడ్పులు ముమ్మరం. కొన్ని ప్రాంతాలలో వరి నాట్లని ఊడ్పులంటారు. ఊడ్పు, ఊడవడం వేరే అర్థంలో వాడతాం కాబట్టి, ఊడ్పుల్ని కూడా కొందరు అపార్థం చేసుకున్న సందార్భాలున్నాయి. ఆయా పంటల్ని బట్టి వ్యవసాయ పరిభాష వుంటుంది. ఇవి ప్రాంతాన్ని బట్టి మారుతూ వుంటాయి. ఊడ్పులు అయినాయి, మొక్క నాటుకుంది, దుబ్బు చేసింది, చిరుపొట్ట మీద వుంది. సుంకు పోసుకుంది, ఈనుతోంది, కంకె విడిచింది, కొన్ని ప్రాంతాల్లో ఓదెల మీద వుంది, కుప్పలు పూర్తయినాయి, మాసూళ్లు మొదలైనాయి, నూర్పిళ్లు మొదలైనాయి. ఇవి వరి వివిధ దశల్లో వినిపించే రైతు మాటలు. కోతకు ముందు పాయలు తీయడం వుంటుంది. నూర్పిడి కోసం కళ్లం సిద్ధం చేసుకోవడం వుంటుంది. ఈ మాట "దింపుడు కళ్లం" అనే చోట వేరే అర్థంలో వినిపిస్తుంది. దింపుడు కళ్లాల ఆశ అంటే ఏ మాత్రం ఆశలేదని. శవాన్ని స్మశానానికి తీసుకు వెళుతూ, మధ్యలో ఒక చోట ఆపి, దింపి, శవం చెవులో పిలిపిస్తారు. అదొక ఆచారంగా అంత్యక్రియల్లో నిలబడి పోయింది.

## తెలుగు వారి సిరి – నానుడి

- మూతిపెట్టిన వాడు మేత పెట్టడా? చాలా మంచి మాట. ఆశని, మానసిక ఆరోగ్యాన్ని పెంచే సామెత యిది. నారు పోసిన వాడు నీరు పోయ్యడా అనే సామెత కూడా సమానార్థకమే.
- మూడు బోనాలు సిద్ధమయినవి, దివ్వెకట్టి ముడికి వచ్చినది. దొరగారు సువారమునకు రావచ్చును. అంటే వంట సిద్ధమైంది, పొయ్యి కూడా ఆర్పేశాం. దొరగారు భోజనానికి రావచ్చు అని అర్థం. రాజమందిరాలలో వుంటే వంటశాలని సువారం అంటారు. చిన్న సువారం, పెద్ద సువారం వుంటాయి. చిన్న దాంట్లో పరివారానికి దాసదాసీజనానికి వంటలు చేస్తారు. రాజ భోజనం పెద్ద సువారంలో మాత్రమే తయారవుతుంది. అక్కడ నుంచి రాజుగారి భోజనశాలకి ప్రత్యేక రక్షిత మార్గం వుంటుంది. అపరిశుభ్రతను, ఎటువంటి విష ప్రయోగాలకు అవకాశం లేకుండా ప్రత్యేక ఏర్పాట్లు వుంటాయి.
- మూల విరాట్టు తిరిపెమెత్తుకుంటుంటే ఉత్సవ మూర్తులకు తెప్పతిరునాళ్లట ! తిరిపెం అంటే బిచ్చం. " తిరిపెమున కిద్దరాండ్రా / పరమేశా గంగ విడుము పార్వతి చాలున్" అనే శ్రీనాధుని చాటువు చాలా ప్రసిద్ధి. దేవుళ్ల మీద కూడా చనువు తీసుకుని మాటలు విసరడం మన జన్మహక్కు. "మింగ మెతుకు లేదు మీసాలకు సంపెంగ నూనె" సామెత దీనికి దగ్గర్లో




వుంటుంది.

- తూర్పున కొర్రు వేస్తే, దుక్కిటెద్దు రంకె వేస్తుంది. కొర్రు అంటే ఇంద్రధనుస్సు. మారుమూల పల్లెల్లో పాత కాలంలో వినియోగంలో వున్న మాట కొర్రు. తూర్పున కొర్రు వెయ్యాలంటే సూర్యుడు పడమటి దిక్కున వుండాలి. వాన వెలిశాక మాత్రమే హరివిల్లు పడుతుంది. ఆ తరుణంలో పచ్చిక బీళ్లలో గడ్డి పుష్కలంగా వుంటుంది. వాతావరణం చల్లగా పొడిగా ఆహ్లాదకరంగా వుంటుంది. అందుకే దుక్కిటెద్దు రంకెవేస్తుంది.

ఇంద్రధనస్సు, హరివిల్లు, సప్తవర్ణి,, వానవెల్లి,

సింగారి చెంగు (ఇది లోపలి తమిళనాట వాడుకలో వుంది), ఇంద్రచాపం, కొర్రు, రైతు విరోధి, (హరివిల్లు వర్షం వెలిసినప్పుడే వస్తుంది. వర్షం రైతు నేస్తం కనుక యిది విరోధి) యిలా ఎన్నో పేర్లు.

## ధాన్యాలు–చిరు ధాన్యాలు

వరి, గోధుమ, జొన్న మొదలైనవి ధాన్యాలు. ఇవి




నిత్యం తినే అన్నానికి వినియోగించేవి. అపరాలు లేదా చిరు ధాన్యాలు లేదా తృణ ధాన్యాలు అనేవి వేరు. మినుములు, పెసలు, కందులు, శెనగలు వగైరాల్ని పప్పు ధాన్యాలుగా కూడా వ్యవహరిస్తారు.

శ్రీనాథ మహాకవి జొన్న తిండిని మోటుగా భావించాడు. జోన్నన్నము, జొన్నకలి, జొన్న, జొన్నయంబలి, జొన్న కూడుల్ని ప్రస్తావించాడు. గరళం మింగిన శివుడైనా వీటిని తిని హరాయించుకోలేడని సవాలు విసిరాడు. జొన్న సంగడి యిదే జొన్న సంకటి బలవర్ధకమైన ఆహారం. పల్నాటి సీమలో నాగార్జున సాగరం రాక ముందు యిదే ముఖ్య పంట. ఇదే వారి ఆహారం. కంది నిత్యం మనం తినే పోషక విలువలున్న పప్పు దినుసు. పసుపు పండించే చేలలో పునాస పంటగా కందిని వేస్తారు. చిన్న వాళ్లు పెద్ద కబుర్లు చెబుతుంటే " కాలం నాటి కంది గింజ" అంటారు. అపరకర్మలు ఆచరించే వేళ కందిపప్పుని వాడరు. పెసర పప్పుని వండుతారు. మినప్పప్పుతో గారెలు వండుతారు. మినుము శాకాహారులు తినే మాంసాహారమని అంటారు. చాలా బలవర్ధకమైంది.

అనుములు, అలచందలు, బొబ్బర్లు ఒకే లాంటివి. కుళుత్థ అంటే ఉలవలు. ఎద్దులకి గుర్రాలకి ఉలవగుగ్గిళ్ళు పెడతారు. ఇవి కాయలలోంచి వచ్చే కాయ ధాన్యాలు. సజ్జలు, రాగులు, కొర్రలు, యవలు, తవిదలు (తమిదలు) చోళ్లు యివి కంకెలు కంకెలుగా పండుతాయి. గంటిలనే తృణధాన్యం కూడా వుంది. ఇవన్నీ ఒక జాతి కంటే ఒక జాతి చిన్నవిగా ఉంటాయి. ఈ పంటలు పండించే మెట్టప్రాంతంలో వీటికి అనువైన సాధన సంపత్తి వుండేది. అక్కడే "కొర్రల మంచం" అనే మాట విన్నాను. కొర్రలు ఆవగింజ పరిమాణంలో వుంటాయి. వాటిని ఆ మంచం మీద ఆరపోసేవారు. నులకతో ఆ మంచాన్ని ఎంత చిక్కగా వత్తుగా పొందికగా అల్లితే వాటిని దానిపై పోసి ఆరబెట్టగలరో ఆలోచించవచ్చు. పెసరలాంటిదే గాని యింకా చిన్నది పిల్లిపెసర. ఇది కాయధాన్యం. ఈ తృణ ధాన్యాలలో " నువ్వు"ది విశిష్ట స్థానం. అడివి నువ్వులు, పంట నువ్వులు రెండు రకాలు. నువ్వుల నుంచి తీసే నూనె రుచికరమైన పంటనూనె. నూనె తీశాక మిగిలే పిండిని కూడా రకరకాలుగా కూరల్లో వాడతారు. అయితే శ్రీనాథుడు మాటల్ని బట్టి వెల్లుల్లి, తిలపిష్టం (నువ్వు చెక్క) శిష్టులు తినేవి కావని స్ఫురిస్తుంది. గతిలేక, "వెల్లుల్లిన్ తిలపిష్టమున్ మెసలితిన్..." అని శ్రీనాథుడు వాపోయాడు. ఇంకా ప్రాంతాలను బట్టి మరి కొన్ని ధాన్యాలు వుండే వుంటాయి.

## తెలుగు తిక్కన

కొందరు కొన్ని సార్లు, చెప్పడానికి తెలుగులో సరైన మాట లేదండీ అంటుంటారు. దివ్వె దీపం జ్యోతి అన్నీ సంస్కృతిపదాలే. తిల్లిక అనేది అచ్చమైన తెలుగు మాట. తెలుగు భాషని విస్తృతంగా విశృంఖలంగా విలక్షణంగా వాడుకున్న ప్రాచీన భారతకవి తిక్కన సోమయాజి. పద్మవ్యూహాన్ని అందంగా తెలుగులో తమ్మి మొగ్గరం అన్నారు. అంపశయ్య అచ్చ తెలుగులో "అమ్ములమెత్త" అవుతుంది. తిక్కనే ఒక చోట "మధ్యముట్టు" అనే తెలుగుమాట వాడారు. ఇది చేనేత పరిభాష తెలిసిన వారికి యిట్టే అర్థం అవుతుంది. నూలు పోగు తెగినప్పుడు దానిని అతకడానికి ఒక చిన్న పోగును మెలుపుతారు. దీన్ని "మధ్యముట్టు" అంటారు.

ఒక నది, వాగు ప్రవహించే తీర ప్రాంతాన్ని పరీవాహక ప్రాంతం అంటాం. ఉదాహరణకి గోదావరి పరీవాహక ప్రాంతం, కృష్ణా పరీవాహక ప్రాంతం అంటాం. దాని పొడుగునా మిట్టల మీద, కొండల మీద కురిసే వర్షం వచ్చి నదుల్లో చేరుతూ




వుంటుంది. ఆ చేరే ప్రాంతాన్ని "క్యాచ్‌మెంట్ ప్రాంతం" అంటారు. తెలుగులో "ఆరగాణి" దానికి సరైన మాట. "మాగాణి" అంటే పల్లపు భూమి. నాలుగైదు దశాబ్దాలకు ముందు వార్తా పత్రికలలో, వ్యాస, కథా పత్రికలలో చక్కని తెలుగు మాటలు మాత్రమే వుండేవి. ఇప్పుడైనా సందర్భాలకు తగిన పొందికైన తెలుగు మాటల్ని పట్టుకోవడం పెద్ద సమ–సమస్యేమీ కాదు. కాకపోతే చిత్తశుద్ధి వుండాలి.

## అచ్చతెలుగు అణా!

మన స్వాతంత్ర్యదినోత్సవ శుభవేళ అచ్చ తెలుగు అణాముచ్చట చెప్పుకోవలసిందే. నయా పైసలు




రావడానికి ముందు అణాలు బేడలు పావలాలు చెలామణీలో వుండేవి. నొక్కులు నొక్కులుగా నాజూగ్గా వుంటే అణాకాసు ఆకర్షణీయంగా వుండేవి. పైగా సరుకుల వెలలు అణా భాషలోనే చెప్పేవారు. అణా, అణన్నర, నాలుగు అణాలు, ఆరణాలు, పదణాలు...యిలా వుండెవి ధరల పట్టీ అణా కాసుమీద తెలుగులో విస్పష్టంగా "అణా" అని ముద్రించి వుండేవి. ఇంగ్లీషుతో సహా మరి నాలుగు భారతీయ భాషల్లో అణా ముద్రించేవారు.

ఒక సారి సర్దార్ వల్లభాయ్ పటేల్ పట్టాభితో "ఏమిటయ్యా ఎప్పుడూ తెలుగు, తెలుగు వాళ్లం అని యాగీచేస్తావు. ఎక్కడుంది నీ తెలుగు" అన్నారట. ఎక్కడపడితే అక్కడే, తెలుగు సర్వవ్యాపి కావాలంటే అణా కాసు చూడండి. మీ మాతృభాష గుజరాతీ లేదక్కడ. బాపూజీ భాష కూడా లేదు, అంటూ వడ్డించారంట. అణాలు కనుమరుగైనా, పదహారణాల తెలుగుదనం అనే లాంటి చాలా వాడుకలు కనుమరుగవలేదు. ఇక "అణా గ్రంథమాల" అనే పుస్తక సంస్థ ఆ రోజుల్లో ఎనలేని సేవ చేసింది. జరుకీ శాస్త్రి అనుష్టుప్ సంస్కృత ఛందాన్ని అనుకరిస్తూ అనుకరిస్తూ పేరడీ చెప్పారు.

ఒక కానీ ఒకే కానీ, రెండు కానులు అర్థణా, మూడు కానులు ముక్కానీ, నాలుగు కాణులొక అణా, అయిదు కానులణాకానీ, ఆరు కానులణన్నర !

## పొడుపు – విడుపు

పొడుపు :

సంద్రంలో పుడుతుంది. సంద్రంలో పెరుగుతుంది. ఊళ్లోకి వస్తుంది. రంకెలేస్తుంది.

[illegible]

– శ్రీరమణ

### మనవి

మన తెలుగు మాటల్ని రకరకాలుగా తలచుకుంటున్న యీ శీర్షికను ఆదరించండి. ఇందులో పాలుపంచుకోండి. మీరు విన్న మాటల్ని నలుగురితో పంచుకోండి. ఇంతకు మించిన మాతృసేవ లేదు.

– సంపాదకులు
ఆంధ్రప్రదేశ్ మాస పత్రిక

## తానా 20వ మహాసభలు

# ప్రవాసాంధ్ర సంస్కృతికి కలైడోస్కోప్



జూలై 4 వ తారీకు అమెరికా స్వాతంత్ర్యదినోత్సవం. 1979లో రెండవ సమావేశం, 2005లో 15 వ సమావేశాల తరవాత ముచ్చటగా మూడవసారి డిట్రాయిట్ నగరం తానా మహాసభలకి వేదిక అయింది. ఆ రోజుల నుండి ఇప్పటికి తానాపరిమాణంలోనూ స్థాయిలోనూ ఎన్నోరెట్లు పెరిగింది. ప్రతి రెండేళ్ళకూ తానా పట్ల పెరుగుతున్న అంచనాలతో పోటీపడుతూ నిర్వాహకులు కూడా ఈసభల స్థాయిని పైకెత్తే ప్రయత్నమే చేస్తూ వస్తున్నారు. ముఖ్యంగా 2013 డాలస్ సమావేశాల తరవాత డిట్రాయిట్ పైన అంచనాలు మరింత పైకెదిగాయి. డిట్రాయిట్ తెలుగువారు తమ ఇళ్ళవాకిళ్ళనే కాదు, గుండె తలుపుల్ని తెరిచి ఆత్మీయమైన ఆతిథ్యాన్నిఅందించారు. ఏవిధంగా చూసినా ఈమహాసభలు ఆ అంచనాలను మించాయని ఒప్పుకోకతప్పదు. సభల సంచాలక కార్యవర్గాన్నీ, అలుపెరుగక శ్రమించిన వందలాది వాలంటీర్లనీ, తగిన ఆసరా అందించిన తానా నాయకవర్గాన్నీ అభినందించకతప్పదు.

### సాదరసత్కారాల బేంక్వెట్

జూలై 2 గురువారం సాయంత్రం జరిగిన బేంక్వెట్ డిన్నర్‌కి రెండువేలకి పైగా అతిథులు హాజరయ్యారు. భారత్ నుంచి విచ్చేసిన పలురంగాల ప్రముఖులతో బాటు, ఉత్తరమెరికా నలుమూలల నుండీ హేమాహేమీలయిన తెలుగువారు పరస్పరం కలుసుకుని ముచ్చటించుకోవడానికి ఇది చక్కని వేదిక అయింది. పరస్పర పరిచయాలూ, పలకరింపులూ అయ్యాక, స్థానిక కళాకారులు ప్రదర్శించిన నాట్యాంజలితో సభాకార్యక్రమం మొదలయింది. ఈ సందర్భంగానే పలువురు స్థానిక నాయకులు (డిట్రాయిట్ డిప్యుటీమేయర్, ఇంకా పలువురు కౌంటీ, రాష్ట్రస్థాయి అమెరికన్ నాయకులు) కూడా పాల్గొన్నారు. స్థానిక రాజకీయాలలో క్రియాశీలుడైన నాయకుడు రవి యలమంచి, వర్ధమాన కార్యకర్త ఆదిత్య సతి ఈ భాగాన్ని సమర్ధవంతంగా నిర్వహించారు.

ఏంకర్ సుమ తన సహజమైన చమత్కారంతో వ్యాఖ్యానం చేస్తుండగా, తానా ప్రతిభా పురస్కారాలు బహూకరించడం జరిగింది. వైద్యం, సాంకేతిక నైపుణ్యం, వాణిజ్యం, కొత్త వ్యాపారాల స్థాపన, భాష, సాహిత్యం, సమాజసేవ వంటి వైవిధ్యమైన రంగాలలో తెలుగువారి కీర్తిపతాకను ఎగురవేసిన ప్రతిభావంతుల దీక్షాదక్షతలను గుర్తిస్తూ తానా తమవారిని సత్కరించుకుంది. ఆచార్య రవ్వా శ్రీహరిగారి తెలుగుభాషాసేవకు గుర్తింపుగా గిడుగు రామమూర్తి స్మారక పురస్కారం అందజేశారు. సినీ గేయ రచయిత సుద్దాల అశోక్ తేజ ప్రతిష్ఠాత్మకమైన ఎన్‌టీఆర్ సాంస్కృతిక సేవా పురస్కారాన్ని అందుకున్నారు. ఈ సందర్భంగా అశోక్ తేజ ఆలపించిన నందమూరి రామాయణం పాట సభ్యుల్ని కదిలించింది. తానా వ్యవస్థాపకులలో ముఖ్యులైన డా.గుత్తికొండ రవీంద్రనాథ్ గారి పేరిట ఏర్పాటైన సామాజిక సేవా పురస్కారం ఈసభలలో డా.పొదిల ప్రసాద్ గారికి అందించారు. తరువాత సుమారు ఏభైమందికి ఈ ప్రతిభా పురస్కారాలను తానా అధ్యక్షులు మోహన్ నన్నపనేని, ఉపాధ్యక్షులు డా. చౌదరి జంపాల, సభల సంచాలకులు గంగాధర్ నాదెళ్ళ, ఇతర ప్రముఖ అతిథుల ద్వారా అందించారు. డా. శ్రీమన్నారాయణ కాకరాల (ఇంజనీరింగ్), చక్రధరరావు కొడాలి (సామాజికసేవ) వంటి తలపండినవారి సరసనే అనుదీప్ కొడాలి (ఆటలు), శమంత మాదాల (సామాజికసేవ) వంటి ఇరవై వయసు దాటని యువతరం ప్రతినిధులు కూడా ఉండడం శ్లాఘనీయం.

### స్వాగత సమావేశం

శనివారంనాడు సాంప్రదాయకమైన పద్ధతిలో మహాసభల వేడుకలు ప్రారంభమైనాయి. కోబోహాల్ ముఖ్యద్వారం వద్ద మంగళకరమైన సన్నాయిమేళంతో, వేదపండితులు పూర్ణకుంభాలతో ఆహూతులని స్వాగతించారు. కేంద్రమంత్రి వెంకయ్యనాయుడు, సుప్రీంకోర్టు జడ్జి వెంకటరమణ, మొదలైన ముఖ్య అతిథులను తానా నాయకవర్గ సభ్యులు తోడ్కొని సభాప్రవేశం చేశారు. పదివేల మందికి పైగా ప్రేక్షకులు సుఖాసీనులయ్యేట్లు తయారైన ముఖ్యసభాప్రాంగణంలో వేదిక అనేక దేదీప్యమానమైన విద్యుద్దీప తెరల అలంకరణతో అత్యద్భుతంగా అలంకరించబడింది. ముందుగా ముఖ్యఅతిథులు తానానాయకులతోకలిసి, వేదమంత్రాల మధ్యన, జ్యోతిప్రజ్వలన చేసి సభలకు శుభారంభం పలికారు. వెంటనే, వెనుక తెరపై ఆయా దేశాల పతాకలు ఎగురుతున్న దృశ్యం పల్లవించగా, పలువురు చిన్నారులు అమెరికా, కెనడా, భారత్ దేశాల జాతీయ గీతాలను ఆలపించారు. సభలకు ఆహూతులైన ఆంధ్రప్రదేశ్, తెలంగాణా రాష్ట్రాల మంత్రివర్యులు, శాసనసభ్యులతో పాటుగా ఆత్మీయ అతిథులైన సిబీఐజేడీ వి.వి. లక్ష్మీనారాయణ, మాజీ రాజ్యసభసభ్యులు యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, అమెరికాలో

మనుషులు, దృశ్యాలు, సెలబ్రిటీలు, రాజకీయనాయకులు, నాట్యాలు, సంగీతాలు, స్పీచిలు, సంభాషణలు, అందాలు, ఆనందాలు, షాపింగులు, నవ్వులు, పువ్వులు, షడ్రుచులు, సువాసనలు – అన్నీ కలగలిసి ఒక్కసారి జలపాతంలాగా ఉక్కిరిబిక్కిరిగా ముంచెత్తేస్తే – కాలాన్నిఆపెయ్యగలిగితే ఎంత బాగుంటుంది. ఏకకాలంలో ఐదుచోట్ల ఉండగలిగితే ఇంకెంత బాగుంటుంది. అలా అనిపించే సందర్భం 20వ తానా (తెలుగు అసోసియేషన్ ఆఫ్ నార్త్ అమెరికా) మహాసభలు. అలా అనిపించిన ప్రదేశం కోబోహాల్, డిట్రాయిట్.

మేరిలాండ్ రాష్ట్ర శాసనసభ్యురాలైన తెలుగు సంతతి వనిత, అరుణ మిల్లర్ ప్రభృతులు వేదిక నలంకరించి ప్రసంగించారు.

వెనువెంటనే దాదాపు రెండువందలమంది స్థానిక ఔత్సాహిక కళాకారులతో జరిగిన ప్రారంభోత్సవ నృత్యరూపకం ఆహూతులను అబ్బురపరిచింది. సిరివెన్నెల పలుకులకు వారబ్బాయి యోగీశ్వరశర్మ తళుకులద్దగా డిట్రాయిట్లో పేరొందిన నాట్యాచార్యులు సంధ్యశ్రీ ఆత్మకూరి నాట్యపు కులుకులు రంగరించి ఆవిష్కరించిన ఈ అద్భుత దృశ్యకావ్యంలో డా.జంపాలచౌదరి రాసిన డిట్రాయిట్ మోటౌన్ మెడ్లి (కార్ల పరిశ్రమకి కేంద్రం, మోటౌన్ అనే సంగీతశైలికి జన్మస్థానం) చాలా సందర్భోచితంగా ఉన్నదని పలువురు ప్రశంసించారు.

అక్కడితో మొదలుపెట్టి ఈ ముఖ్యవేదికపై రకరకాల సాంస్కృతిక ప్రదర్శనలు ఈ రెండురోజులపాటూ నిర్విరామంగా కొనసాగాయి. ముఖ్యంగా భారత్ నుంచి వచ్చిన పేరిణి శివతాండవం బృందం విజయవాడ సిద్ధార్థ కళాశాల విద్యార్థినులు చేసిన తప్పెటగుళ్ళ జానపదనృత్యాల విన్యాసం ప్రేక్షకులను ఉత్తేజపరిచినాయి. అమెరికా నలుమూలలనుండి ఎన్నో ఔత్సాహిక కళాకారుల బృందాలు వచ్చి అత్యద్భుతమైన ప్రదర్శనలు ఇచ్చారు. డాలస్ నుంచి శ్రీలత సూరి నిర్వహణలో డా. రాజేష్ అడుసుమిల్లి, ప్రణమ్య సూరి ముఖ్య పాత్రధారులుగా ప్రదర్శించిన సాంప్రదాయ నృత్యం "ఛరిష్ణు" అందరి మన్ననలు అందుకుంది. డిట్రాయిట్ బృందం (కృష్ణప్రసాద్ జలిగామ ప్రభృతులు) ప్రదర్శించిన శివశక్తి నృత్యరూపకం కూడా ప్రేక్షకులను ఆకట్టుకుంది.

ముఖ్యవేదిక మీదనే వెంకయ్యనాయుడు గారికి జీవనసాఫల్య పురస్కారాన్ని అందించి తానా ఘనంగా సత్కరించింది. తదుపరి సభనుద్దేశించి ప్రసంగిస్తూ ప్రవాస భారతీయులతో అనుబంధాన్ని మరింత పటిష్టం చేయడానికి భారతీయ ప్రభుత్వం చేపట్టిన విధివిధానాలను వివరించారు. తదనంతరం సినీహీరో వెంకటేష్ మాట్లాడుతూ ధనార్జన ఒక్కటే జీవితలక్ష్యం కాదనీ, మానవీయతా విలువలు పెంపొందించే దిశగా అందరం కృషిచేయాలని పిలుపునిచ్చారు. ఈసందర్భంగా డిట్రాయిట్ యువత సమర్పించిన వెంకీపాటల మెడ్లీ అందరినీ సరదా చేసింది. ఆహూతులైవచ్చిన తారామణులు తాప్సీ, రకుల్ ప్రీత్ సింగ్, రీచా గంగోపాధ్యాయ – వీరితో ఏంకర్ సుమ తెలుగు మాట్లాడించాలని చేసిన సరదా ప్రయత్నం కితకితలుగా నవ్వించింది.

## ఆలోచనాత్మకమైన ఫోరంలు

మిషిగన్ రాష్ట్ర గవర్నర్ రిక్ స్నైడర్ తో కలిసి కేంద్రమంత్రి వెంకయ్య నాయుడు బిజినెస్ ఫోరంని ప్రారంభించారు. రెండుదేశాల మధ్యన అభివృద్ధి చెందుతున్న వ్యాపారసహకారాలపై ప్రతిపాదనలు, చర్చలు జరిగాయి. కొత్తగా కంపెనీలు మొదలు పెట్టాలనుకుంటున్న ఔత్సాహిక వ్యాపారవేత్తలకు సలహాలతో ఒకతరగతి కార్యక్రమాన్ని నిర్వహించారు.

ఆచార్య చేకూరి రామారావుగారితో డిట్రాయిట్ తెలుగువారికి ఉన్న సాన్నిహిత్యాన్ని పురస్కరించుకుని సాహిత్యసమావేశాలు జరిగిన సభాస్థలికి చేరా సాహిత్య వేదిక అని పేరుపెట్టడం ఎంతో సముచితంగా ఉన్నది. భాష ఎదుగుదల, పరిణామం, సాహిత్యంలోభాష, సినిమాసాహిత్యం వంటి పలు అంశాలపైన ఉపన్యాసాలు, చర్చలు జరిగాయి. గుమ్మా సాంబశివరావు, వెలమల సిమ్మన్న, శరత్ జ్యోత్స్న ఇత్యాది ఆచార్యవర్యులు చక్కని ప్రసంగాలు చేశారు. కవి దర్భశయనం శ్రీనివాసాచార్య, కథకుడు డా. వి. చంద్రశేఖరరావు, భాషా ఉద్యమనేత స.వెం. రమేశ్ చేసిన ప్రసంగాలు ఉత్తేజకరంగా ఉన్నాయి. ఆదివారం ఉదయం తెలుగు సాహిత్యంలో మారుతున్న స్త్రీ పాత్రల చిత్రణ గురించి మంచి ఆసక్తికరమైన సదస్సు జరిగింది. సీనియర్ రచయిత్రులు పి.సత్యవతి, కాత్యాయని విద్మహే ఈ విషయంలో స్థూలమైన పరిశీలన అందించగా అమెరికా రచయిత్రులైన కల్పనరెంటాల, గోపరాజు లక్ష్మి ఈ విషయానికి వ్యక్తిగత కోణాన్ని ఆపాదించి, తద్వారా సంక్లిష్టమవుతున్న పరిస్థితులను విశ్లేషించారు. ప్రక్కనే మరొక వేదికపై మేడసాని మోహన్ అష్టావధానం చేశారు.

డా. పద్మజ నందిగామ నేతృత్వంలో జరిగిన మహిళావేదికలో తరుణి – ఆ తరం, ఈ తరం – అనే శీర్షికతో పాతతరం అనుభవాలను తలపోసుకుంటూ, భావి తరాల ఆశయాల్ని కలబోసుకుంటూ చక్కటి చర్చలు నిర్వహించారు. భారత్ నుండి పివోడబ్లు సంధ్య, ఎలీప్ పద్మజ, అమెరికాలో టిఆర్డబ్లు కంపెనీ ఛీఫ్ ఇన్ఫర్మేషన్ ఆఫీసర్ మమత చామర్తి, ఫిలిమేకర్ అపర్ణ మల్లాది తదితరులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా అపర్ణ రూపొందించిన తెలుగు సినీ మహిళా దర్శకులపై లఘుచిత్రం అందరినీఆకట్టుకుంది.

## ఆధ్యాత్మికం

తానా సభలంటే అంతా మజాఖుషీయే కాదు, ఇహపర సాధనకు ఉభయతారకంగా ఉంటుందని అనుభవజ్ఞుల ఉవాచ. శుక్రవారంనాడు సాయిబాబా అభిషేకోత్సవము, శనివారంనాడు శ్రీనివాస కళ్యాణోత్సవము అత్యంత వైభవంగా జరిగినాయి. శ్రీనివాసకళ్యాణానికి మూర్తులనూ, ఆచార్యులనూ, జేయీవో పోలభాస్కర్ పర్యవేక్షణలో తిరుపతి నుంచి తీసుకుని వచ్చారు. భక్తులు వేలసంఖ్యలో హాజరై రెండు కార్యక్రమాలలోనూ పాల్గొన్నారు. ఇదికాక శ్రీసింహాచల శాస్త్రిగారి హరికథ, స్థానిక ఔత్సాహికులచే హిందూయిజం క్విజ్, ఆర్ట్ ఆఫ్ లివింగ్, క్రియా యోగ, శోభారాజు, కళ్యాణి ద్విభాష్యం పాడిన భక్తిసంగీత కార్యక్రమాలు జరిగాయి.

## మాహిషంచ శరచ్చంద్రచంద్రికా ధవళందధి

ఆంధ్రులు ఆరంభశూరులు కాదూ, పట్టుపట్టి సాధించేదాకా విడువరు అని తానా చరిత్ర ఋజువు చేస్తూనే ఉన్నది. అలాగే తెలుగువారు భోజనప్రియులు అనే విషయం కూడా తానా మహా సభలు ఋజువు చేస్తూనే వస్తున్నాయి. ప్రతిరోజూనా, ముప్పూటలా మూడుపిండివంటలతో షడ్రసోపేతమైన భోజనం కొన్ని వేలమందికి వొండి వడ్డించటం అంటే సామాన్యమైన విషయం కాదు. అక్కడక్కడా కొంచెం తడబడినా, భోజనశాలలో ఎప్పుడూ ఒక పది పెళ్ళిళ్ళు జరుగుతున్న పండగ వాతావరణం నెలకొని ఉన్నదంటే అది అతిశయోక్తి కాదు.

## మంగళాంతాని కావ్యాని

ఎంతటి ఉత్సాహభరితమైన కార్యక్రమమైనా ముగింపుకి రాక తప్పదు. ముగింపు సమావేశంలో తానా అధ్యక్షులు మోహన్ నన్నపనేని నుండి డా.జంపాల చౌదరి అధ్యక్షునిగా పదవీబాధ్యతలు స్వీకరించారు. తదుపరి కొత్తగా ఎన్నికైన ఉపాధ్యక్షులు సతీష్ వేమన, ఇతర కార్యవర్గ సభ్యులను పరిచయం చేశారు. ఉద్విగ్నమైన వీడ్కోలు సందేశంలో తానా సంస్థతో తన ప్రగాఢ అనుబంధాన్ని నెమరువేసుకున్న మోహన్ ఇక ముందు కూడా తానా కోసం నిలుస్తానని చెప్పారు. స్వర బ్రహ్మ మణిశర్మ నేతృత్వంలో ప్రఖ్యాత గాయనీగాయకుల సినీ సంగీతవిభావరితో ఈ ఇరవయ్యవ మహాసభలు శుభప్రదంగా ముగిశాయి.



శంకగిరి నారాయణస్వామి
డిట్రాయిట్, యూఎస్ఏ

## కథాస్రవంతి




తెలుగు సాహిత్యంలో ఒకప్పుడు కవిత్వానిదే అగ్రస్థానం. నేడు ఆ స్థానాన్ని కథ ఆక్రమించిందంటే అతిశయోక్తి కాదేమో! ఇది కాకతాళీయంగా జరిగిన సంఘటన కాదు. ఇదో అనివార్య పరిణామక్రమం. ఈ 'కథాక్రమాన్ని' సింహావలోకనం చేసే కార్యక్రమం ఆంధ్రప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం (అరసం) చేపట్టింది. అంతే కాదు తెలుగు కథ తీరుతెన్నులు, కథన రీతులు, రచయితల రచనా కౌశలం, సామాజిక బాధ్యత స్వీకరించిన రచనలలో కనిపించే వస్తు నిష్ఠను, విశిష్టతను, వైవిధ్యాన్ని నవతరానికి తెలియజేయాలని, అందజేయాలని అరసం నడుంకట్టింది. 'కథాస్రవంతి' పేరుతో ప్రఖ్యాత కథకుల సుప్రసిద్ధ కథలను కొన్నింటిని సంకలనీకరించి అమూల్య సంపుటాలుగా వెలువరిస్తోంది. సంకుచిత భావాలకతీతంగా ఒక విశాల దృక్పథంతో ఒక సమదృష్టితో అరసం ఈ కార్యక్రమాన్ని నిర్వర్తిస్తోంది. అదులో భాగంగా తొలివిడగా ఈ ఏడాది ప్రారంభంలో పది సంపుటాలను విడుదల చేసింది. ఈ ప్రచురణలకు అరసం జాతీయ కార్యదర్శి పెనుగొండ లక్ష్మీనారాయణ గౌరవ సంపాదకులు. రాష్ట్ర ప్రధాన కార్యదర్శి వల్లూరు శివప్రసాద్ ప్రధాన సంపాదకులు. ఒక్కో సంపుటానికి కథాపరిశ్రమలో నిష్ణాతులైన ప్రముఖ సాహితీవేత్తలు, విమర్శకులు ఒకొక్కరు సంపాదకులు. 1 చాగంటి సోమయాజులు కథలు – సంపాదకులు, చాగంటి తులసి, 2 కొడవటిగంటి కుటుంబరావు కథలు – కృష్ణాబాయి 3 మధురాంతకం రాజారాం కథలు – ఆర్. ఎం. ఉమామహేశ్వరరావు 4 పెద్దిభొట్ల సుబ్బరామయ్య కథలు – రాచపాళం చంద్రశేఖరరెడ్డి 5 అల్లం శేషగిరిరావు కథలు – ఎ. ఎన్. జగన్నాథశర్మ 6 కొలకలూరి ఇనాక్ కథలు – మేడిపల్లి రవికుమార్ 7 కేతు విశ్వనాథ రెడ్డి కథలు – సింగమనేని నారాయణ 8 అల్లం రాజయ్య కథలు – ముక్తవరం పార్థసారథి 9 పి. సత్యవతి కథలు – కె. ఎన్. మల్లీశ్వరి 10 ఓల్గా కథలు – డాక్టర్ కె.శ్రీదేవి. ఇలా పది కథా సంపుటాలు వెలువరించింది.

సాహిత్య సృజనలో ఫలానా వాళ్ళు గొప్ప రచయితలని ఎందుకు అంటారు? ఫలానావి గొప్ప రచనలుగా ఎందుకు నిలబడిపోతాయో తెలుసుకునేందుకు వర్ధమాన రచయితలకు ఈ కథాసంపుటాలు గొప్ప సాధనాలుగా ఉపయోగపడతాయనడంలో ఏమాత్రం సందేహంలేదు. ఈ పుస్తకాల అంత:సౌందర్యమేకాదు, పినిసెట్టి అలంకరణతో బాహ్యాసౌందర్యంకూడా ఆకర్షణీయంగా ఉంది. సుమారు వంద పేజీలున్న ఒకొక్క పుస్తకం వెల 50 రూపాయలు.

టి ఎస్ రెడ్డి

---

## కథలు తిలతండుల న్యాయమున వెలుంగ...




'కిటికీ బయటి వెన్నెల'
వాడ్రేవు వీరలక్ష్మీదేవి కథలు
ప్రతులకు: నవోదయ, అన్ని పుస్తక కేంద్రాలు.

వాడ్రేవు వీరలక్ష్మీదేవి కథలు చదవడమంటే పెద్దనగారి పద్యంలోలా తిలతండులన్యాయమున ప్రకాశించే జీవిత రంగభూమిని ఆనందాశ్చర్యాలతో చూస్తూవుండడం. 'కొండఫలం', 'ఉత్సవసౌరభం' కథాసంపుటుల తర్వాత, ఆమె 'కిటికీ బయటి వెన్నెల' కథాసంకలనం వెలువరించారు. కిటికీ బయటి వెన్నెల మరికొన్ని కథలు– లోని కథలు స్థూలంగా 'స్పేసెస్' ని పొంది, కోల్పోయి, తిరిగి పొందే క్రమాన్ని చిత్రించిన కథలు.

సాంద్రమూ, సార్థకమూ అయిన నిర్మాణం కలిగిన 'కిటికీ బయటి వెన్నెల' ఈ సంపుటిలోని 10 కథల్లోకల్లా విశిష్టమైనది. ఒక కథ ఏకకాలంలో వాస్తవికతలం లో విశ్వసనీయంగా ఉంటూనే ప్రతీకాత్మకంగా కూడా సఫలమవడం సాధారణ విషయంకాదు. 'ఇంప్రెషనిస్టిక్' శైలిలో కథనం సాగడం వల్లనూ,చెకోవ్ లాగే పాత్రలను నిర్మమత్వంతో, సహానుభూతితో చిత్రించడం వల్లనూ సమకాలీన జీవితాన్ని వ్యాఖ్యానించేటప్పుడు చాలామంది రచయితలు చూపించని తేటతనం ఈ కథలో కనిపిస్తుంది.

ఎంచుకునే ఇతివృత్తాల్లో వైవిధ్యమే కాక, ప్రతి కథలోనూ సంక్లిష్టతకీ, ఆరోగ్యకరమైన సంశయాత్మకతకీ తావుంచారు రచయిత్రి. ప్రతి కథలోనూ సూచనప్రాయంగా విడిచిన ఉపకథలెన్నో ఉన్నాయి. ఒక రకంగా ఈ సంపుటిలోని ప్రతి కథకూడా రెండు కథలు కలుసుకునే చోటు.

స్వర్ణయుగాల కోసం, యుటోపియాల కోసం తృష్ణ అధికమవుతున్న కాలమిది. విశుద్ధమూ, నిర్మలమూ అయిన కొన్ని సాన్నిధ్యాల్లో మాత్రమే ధ్వంసమైన మన పూర్వీకుల నివాసస్థలాల్ని మనం తిరిగి నిర్మించుకోగలమనే మెలకువ కనిపిస్తుందీ కథల్లో. ఇంటినీ, గదుల్నీ, ఇంటి చుట్టూవున్న స్థలాన్ని, పొరుగుమనిషికీ నీకూ మధ్య కౌముదీ సేతువును నిర్మించే కిటికీనీ అందుకనే వీరలక్ష్మీదేవి ఇంతగా పట్టించుకున్నారనిపిస్తుంది.

ఆదిత్య కొర్రపాటి

# బహుముఖాల 'ప్రాతినిధ్యం'




'ప్రాతినిధ్య కథ 2014'
వెల రూ. 150, పేజీలు 350
ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తకకేంద్రాలు.

ప్రాతినిధ్య కథ 2014 సంకలనంలో డా. వి. చంద్ర శేఖరరావు కథ 'సూర్యుని నలుపు రంగు రెక్కలు' టైటిల్ అమితంగా నచ్చింది- అనడం కన్నా కథకి అమితంగా నప్పింది. అకాలధర్మం చేసిన ఒక దళితుని కథ ఇది. సమకాలీనతను తన గత కథల్లోలాగానే ఇందులోనూ చొప్పించేందుకు సృజనాత్మకంగా, సమర్థవంతంగా ప్రయత్నించాడు చంద్రశేఖరరావు. ఇదే తరహాలో రచయిత చేసిన గత ప్రయత్నాలలోని సృజన, సామర్థ్యాలకు సంబంధించిన విజయాల, వైఫల్యాల బేరీజు ఇప్పుడు అప్రస్తుతం గానీ, 'సూర్యుని నలుపు రంగు రెక్కలు' కథ మాత్రం బలవంతంగా గుదిగుచ్చిన (ఒకచో కృత్రిమ) సన్నివేశాల, ఉద్వేగాల, భావాల, పాత్రల, సంబంధాల, దృక్పథాల, వాటి యానాల సముచ్చయం.

బహుశా రబ్ నే బనాదీ మోదీ బీఫ్‌ని నిషేధించాలనుకున్న తరుణంలో వేంపల్లి షరీఫ్ గొడ్లు కోసుకుని బతుకీడ్చే దౌలా నిరసనని 'తలుగు' కథగా రచియించాడు. కరసేవకులు దూసిన దండాని ఆపే చేతులు మొలిచిన (కర్రెనుము కొమ్ముల సహితంగా) ఆశావహ ముగింపు తలుగులో షరీఫ్ చూపాడు. అయితే బీఫ్ నిషేధం అనే సమకాలీన సమస్యను ఇతివృత్తంగా చేసుకుని క్రమంగా దాన్నించి పక్కకు జరిగిపోయింది తలుగు కథనం. నిస్సహాయులు సాగించే అనేకానేక రోజువారీ ఒంటరి పోరాటాలూ, వాటికి మన అహాలను తృప్త పరిచే విడి (isolated) సాహసోపేత ఎండింగ్ లను సూచించే పరోక్షంగా, subtle గానయినా) మరో మంచి ప్రిడిక్టబుల్ కథ 'తలుగు'. ఇలాంటి వందలాది (బహుశా వేలాది) 'విప్లవ' (సోకాల్డ్ ఫార్ములా) కథల తానులోకి తాజాగా రాయలసీమలోని కడప ప్రాంతం నుంచి చే(జా)రిన(?) కథే షరీఫ్ హాయిగా, సునాయసంగా, కూసుగా కూర్చిన ఆంధ్రప్రదేశ్ తెలుగు కథ తలుగు.

ఒక తీరని కలగా మిగిలిపోయిన అద్భుతమైన కాల్పనిక కథే మహిబెజవాడ 'వదిలెల్లిన జోళ్ళు'. జీవితంలో శరవేగంగా మాయమైపోయిన అపురూప, అరుదైన, అలవికాని అనురాగ, బాంధవ్య కుసుమాలు నజ్జ నజ్జు అయి కళ్ల ముందు నిలిచినప్పుడు కలిగే ఒక డిసూల్యూషన్‌మెంట్ నుంచి పుట్టే అంతర్ నిరసనకు ప్రతి రూపమే మహిబెజవాడ మన ముందుంచిన ఈ సామూహిక స్వప్నం.

గతం తాలూకు ఎమోషనల్ బ్యాగేజి ఇద్దరు కొత్త దంపతుల మధ్య (రెండో పెళ్లయినా అది పదోదయినా వారిద్దరికీ అది కొత్తదే కదా) వివాదాస్పదమవుతుంది. ఎవరి జ్ఞాపకానికి అనుమతి వుంది, ఎవరి గతానికి సమ్మతి లేదు అన్నదే అసలు చర్చ కుప్పిలి పద్మ కథ 'సెకండ్ హజ్బెండ్' లో. రేప్ విథిన్ మ్యారేజ్ ఇతివృత్తంతో వచ్చిన కథగా సెకండ్ హజ్బెండ్ కథని వర్గీకరించవచ్చు. పాతిక కథల 'ప్రాతినిధ్య కథ 2014' సంకలనంలో ఇటువంటి తప్పక చదవాల్సిన కథలు ఎన్నో.

**అనంతు చింతపల్లి**

# స్వీకారం




**బహుమతి కథ – 3**
2014 లో రంజని బహుమతులు పొందిన కథలు
**వెల:** రూ 160;
**పేజీలు:** 180
**ప్రతులకు:** రంజని తెలుగు సాహితి సమితి, ఏజీస్ ఆఫీసు హైదరాబాద్ – 500 004.
విశాలాంధ్ర, నవోదయ, పుస్తక కేంద్రాలు




**ఎదురుమతం**
షేక్ కరీముల్లా
**వెల:** రూ 50;
**పేజీలు:** 86
**ప్రతులకు:**
షేక్ మషురున్ 21 – 55, పెద్ద మసీదు బజారు వినకొండ –522 647, గుంటూరు జిల్లా మరియు అన్ని ప్రముఖ పుస్తక విక్రయకేంద్రాలు




**నాటకరంగ వ్యాసాలు**
ఎన్.ఎస్.కామేశ్వరరావు
**వెల:** రూ 120;
**పేజీలు:** 148
**ప్రతులకు:**
ఎన్.వి శ్రీనివాస్
ఫ్లాట్ 55, ధర్మపురి కాలనీ, సాయిబాబా గుడి దగ్గర, ఉప్పల్
హైదరాబాద్ – 500 039.
విశాలాంధ్ర, నవోదయ, ప్రజాశక్తి పుస్తక కేంద్రాలు.




**దీప తోరణం**
కథానికలు
కన్నెగంటి అనసూయ
**వెల:** రూ 120;
**పేజీలు:** 177
**ప్రతులకు:**
కన్నెగంటి అనసూయ
406, వింధ్యా 4
కూకట్ పల్లి "జ" జంక్షన్
జయభారతి గార్డెన్స్,
హైదరాబాద్ – 500 018
అన్ని పుస్తక కేంద్రాల్లో...

శ్రీరమణీయం

# మద్రాసు జ్ఞాపకాలు



అప్పట్లో దక్షిణాది సాంస్కృతిక వ్యవహారాలను సమన్వయించి, సముదాయించడానికి మద్రాసు అమెరికన్ సెంటర్ పక్షాన వారధిగా డా. పప్పు వేణుగోపాలరావు వ్యవహరించే వారు. దానికేం గాని, బాగా చదువుకున్న వారు. అదలా ఉంచితే సరసుడు, స్నేహశీలి. సంగీత సాహిత్యాలను కాచివడపోసి తూచిన చిన్నపాటి ఆదిభట్ల నారాయణదాసు. పైగా విజయనగరం ద్రావిడ పిండం కూడాను. ఆటా పాటా లేదు గాని ఆవార మాట ఉంది. నాట్య సంగీతాలను శాస్త్ర సమ్మతంగా విశ్లేషించగల శిల్పి. ఈ అంశాలపై అధిక ప్రసంగాలు చేసి ఖండాంతర కీర్తిని ఆర్జించారు. ఎంత లేకపోతే, మద్రాసు మ్యూజిక్ అకాడెమి కార్యదర్శిగా టరటరముల నించి రాణిస్తున్నారు ? మద్రాసు తెలుగు వారికీయన గరిమనాభి. పట్టనిగొడుగు. పన్నీటి మడుగు. ఏది వచ్చినా నేనున్నానని ప్రతిధ్వనించే సంస్కారి. అంటే –జ్ఞాపకం వచ్చింది.

యన్నార్ చందూర్ చనిపోయినపుడు, నేనున్నానని కొడుకై అంతిమ సంస్కారాలు శ్రద్ధగా నిలబడి నిర్వర్తించారు. అందుకు మాలతీచందూర్ ఎంతగానో మెచ్చుకున్నారు. నిజం. "ఎటుపోయి ఎటొచ్చినా మనవాడు యీ విధంగానైనా ఏకాశీలోనో దర్జాగా బతికెయ్యగలడు రమణా!" అంటూ ఎంతో తృప్తిగా నిట్టూర్చారు. కన్న తల్లిలా ఆనందపడ్డారు. జీవితానికి చాలదూ?

ఒక సారి మద్రాసు తేనాంపేటలో వదాన్యులు రమణయ్య రాజా ఇంట్లో హేమాహేమీలంతా చేరారు. డా బెజవాడ గోపాలరెడ్డి, యన్నార్ చందూర్, ఆనాటి ఫిలిం సెన్సార్ ఆఫీసరు డి. రామలింగం, ఎయిర్ ఇండియా ఉన్నతాధికారి నేస్తలింగం, మద్రాసు చాంబర్ ఆఫ్ కామర్స్ ప్రముఖుడు యస్సార్ లింగం, యింకా మరికొందరు కూడా ఉన్నారు. అందర్నీ గమనించిన వేణుగోపాలరావు ఏదో స్ఫురించినవాడిలా ముఖం పెట్టి, "మనది త్రిలింగదేశం ఎందుకయిందో నాకిప్పుడు అర్థమైంది" అని ప్రకటించాడు. త్రిలింగాలతో సహా అందరూ నవ్వుకున్నారు. కొన్నిసార్లు ఆయన చతుర్లు నవ్వించేవి. కొన్నిసార్లు నవ్వించవు. అయినచో ఏమైనది? సృష్టిలో పూతంతా పిండెకాదు కదా?

సాహిత్య సంగీతాలపై డా.పప్పు సోదాహరణ ప్రసంగాలు చాలా రసవత్తరంగా ఉండేవి. పోతన భక్తి తత్వంపై ని గూఢమైన సంగతులను వెలికి లాగి, పరిశోధన గ్రంథాన్ని సమర్పించి డాక్టరేట్ గ్రహించారు. జగద్గురువు శంకరాచార్యుని జీవిత చరిత్రని రచించారు. అక్కడితో ఆగలేదు. స్వయంగా హిమాలయాలకు వెళ్లి మానసరోవరం దర్శించి వచ్చారు. అంతేనా, మానస యాత్రలో తనలో చూపుని మేళవించి, సరోవరాన్ని శ్రోతలకనుల కట్టించి ధన్యులైనారు. "డా.పప్పుగారికి మానస యాత్ర దరిమిలా హంసత్వం సిద్ధించినట్టు నాకు సందేహంగా ఉందని" ఒక పెద్దాయనతో అన్నాను." అబ్బే అదేం లేదండీ. ఆ మధ్య మా యింటికి వస్తే మర్యాదగా పాలు పండూ పెట్టాం. పాలన్నీ సొంతంగా సొంతంగా తాగేశారే...? అన్నారు ప్రశ్నార్థకంగా. హంసత్వం సిద్ధిస్తే నీళ్లు వదిలేశావారని ఆయన భావం కావచ్చు. ఆ పెద్దాయన ఎవరో కాదు, ప్రముఖ పాత్రికేయులు చెన్నపట్నం ప్రముఖులు బి.యస్.ఆర్ కృష్ణ. చాలా మంచివారు, గొప్పవారు, పప్పుకి పరమ ఆప్తులు.

సాహిత్య సంగీతాలపై డా. పప్పు సోదాహరణ ప్రసంగాలు చాలా రసవత్తరంగా ఉండేవి. పోతన భక్తి తత్వంపై ని గూఢమైన సంగతులను వెలికి లాగి, పరిశోధన గ్రంథాన్ని సమర్పించి డాక్టరేట్ గ్రహించారు.

మద్రాసులో మాండొలిన్ శ్రీనివాస్‌ని రాజాలక్ష్మి ఫౌండేషన్ తమ అవార్డుతో ఘనంగా సన్మానించారు. ఆ సందర్భానికి విజయవాడ నుంచి నండూరి రామ మోహనరావు, పురాణం కూడా వచ్చారు. ఆరుద్రతో సహా పలువురు ప్రముఖులు ఆనాటి సభలో పాల్గొన్నారు. ఆ ఉదయం రమణయ్య రాజా యింట్లో అందరికీ విందు. చాలా మంది పెద్దలు చేరారు. సాయంత్రం సభలో ఆరుద్ర ఎలా మాట్లాడతారోనన్న ఆలోచన వచ్చింది. "...అసలు మాండొలిన్ తెలుగు వాయిద్యం. మన ప్రాచీన తెలుగు కావ్యాల్లో చూచినట్లయితే ఇరవైఏడు వీణా విశేషాలు కనిపిస్తాయి. వాటిల్లోనేమోను మాండలిన్ కూడా ఒకటి. అందుకే మాండొలిన్ మన కర్ణాటక సంగీతాన్నేమోనూ పలకగలుగుతోంది..." యిలా మరికొంత పూహించాం. మీకు చెప్పలేదు. డా. పప్పుకి మిమిక్రీ మీద మంచి పట్టుంది. అప్పుడక్కడ మిమిక్రీ సమ్రాట్ నేరెళ్ల వేణుమాధవ్ కూడా ఉన్నారు. అందర్నీ వేణుమాధవ్ అనుకరిస్తే, ఆయనని వేణుగోపాలరావు అనుకరించేవారు. ఆరుద్ర ప్రసంగాన్ని అరుద్ర గళంతో స్వరసహితంగా డా. పప్పు అనుకరించి అందర్నీ అహ్లాదపరిచారు. సాయంత్రం రాణిసీతై హాల్లో సన్మాన సభ ఆరుద్ర సరిగ్గా అవే మాటలు, అదే తీరున మాట్లాడుతున్నారు. ఆ ఉదయం విన్నవారు వేదిక మీద, వేదిక కింద ఉన్నారు. వారంతా నవ్వాపుకోలేకపోతున్నారు. ఆరుద్ర కారణం తెలియక తికమక పడ్డారు. అసలు సంగతి తెలిశాక కుదుట పడ్డారు. ఆరుద్ర గెడ్డం లేకున్నా రుషే!

చివరగా ఒక్క సంగతి చెప్పాలి. ఏడెనిమిదేళ్ల క్రితం మాండొలిన్ శ్రీనివాస్ వాద్య గోష్ఠులలోంచి బాపు తనకు బాగా నచ్చిన వాటిని ఒక క్యాసెట్ పైకి ఎక్కించుకున్నారు. దాని "ఇన్‌లే కవర్" జాకెట్ అంటారేదాన్ని తన కుంచెతో డిజైన్ చేసుకున్నారు. ఆ విద్వాంసుడి చేవ్రాలు కూడా ఉంటే మరింత శోభస్కరం అనుకున్నారు బాపు. మరో కవరు కూడా చిత్రించి తనకొకటి, శ్రీనివాస్‌ని మరొకటి అనుకున్నారు. ఆటోగ్రాఫ్ కోసం బాపు డా. పప్పుసాయం కోరారు. సంగతి తెలిసిన శ్రీనివాస్ తెగ ఆనందపడ్డాడు. "మహాప్రసాదం! నేనే మీ ఇంటికి వచ్చి, మీ దర్శనం చేసుకుని, మీ సమక్షంలో చేవ్రాలు చేసి వెళ్తాను" అంటూ శ్రీనివాస్ ఫోనులో హామీ ఇచ్చారు. ఎందుకైనా మంచిదని ఆ రెండు ఇన్‌లే కవర్లనీ డా.పప్పు ద్వారా శ్రీనివాస్‌కి పంపారు. రాలేదు, చాలా రోజులైనా శ్రీనివాస్ రాలేదు. సరికదా సంతకంతో జాకెట్ అయినా రాలేదు. అతి తీవ్రమైన జాప్యాన్ని బాపు తట్టుకోలేక డా. పప్పుకి యీ క్రింది విధంగా ఉత్తరం రాశారు :

అయ్యా,

ఏళ్లు గడిచిపోతున్నా నా జాకెట్ ఇంతదాకా రాలేదు. "విగతకంచుకనై" నిరీక్షిస్తున్నాను. గమనించగలరు.

ఇట్లు

బాపు

(విగత అంటే లేని, లేనిదగు.

కంచుకము = ఒకనొక వస్త్రవిశేషము. జాకెట్, రవికె)

శ్రీరమణ

# ఎండైనా...వానైనా....

పుష్కరాల కోసం రాజమండ్రిలో మకాం వేసిన ముఖ్యమంత్రి, అన్ని పనులూ, పాలనావ్యవహారాలూ అక్కడే చక్కబెట్టారు. అక్కడ ఆయన నిర్వహించిన కార్యక్రమాల చిత్రమాలిక.

ఛాయాచిత్రం 1: వర్షంలోనే రాజమండ్రిలో తొలి క్యాబినెట్ మీటింగ్‌కు హాజరవుతున్న ముఖ్యమంత్రి

ఛాయాచిత్రం 2: పుష్కరాల ప్రారంభ సంరంభాన్ని కనులవిందుగా తిలకిస్తున్న చంద్రబాబు దంపతులు

ఛాయాచిత్రం 3: అమరావతి మాస్టర్‌ప్లాన్‌ను స్వహస్తాలతో అందించేందుకు రాజమండ్రి విచ్చేసిన సింగపూర్ మంత్రి ఈశ్వరన్‌తో సిఎం



1



2



3

Regd. No.HD - 962/2015-17
Published on 01-08-2015

ఆంధ్రప్రదేశ్

RNI No. 10926/1957
Posting: 4th & 5th

MOHAN PUBLICATIONS

ఆధ్యాత్మిక గ్రంథనిలయం

అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం,
రాజమహేంద్రవరము - 533101.
ఫోన్ : 0883 - 2462565
e-mail : mohanpublications@gmail.com

# మావద్ద లభించు గ్రంథములు



## వ్రత కథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ. 10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మివ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాథ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాథవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీవ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీకుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మివ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |

| | | |
|---|---|---|
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |



# స్తోత్రాలు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |
| 30. | మణిద్వీపవర్ణన (పాకెట్) | 10-00 |
| 31. | ఆరు చాలీసాలు | 10-00 |
| 32. | శివారాధన (శివస్తోత్రాలు) | 10-00 |
| 33. | వేంకటేశ్వర సుప్రభాతం (పాకెట్) | 10-00 |
| 34. | ఆరుదండకాలు | 5-00 |
| 35. | వేంకటేశ్వర గోవిందనామములు | 5-00 |

| | | |
|---|---|---|
| 36. | అష్టలక్ష్మీ స్తోత్రమ్ కనకధారాస్తోత్రమ్ | 10-00 |
| 37. | దేవీఖడ్గమాలాస్తోత్రమ్ (మహిషాసురమర్దనీస్తోత్రంతో) | 10-00 |
| 38. | సుందరకాండ (పాకెట్) | 10-00 |
| 39. | భగవద్గీత మూలం | 27-00 |
| 40. | రామరక్షాస్తోత్రమ్ | 15-00 |
| 41. | స్తోత్ర రత్నావళి | 36-00 |
| 42. | పురాణపండ లలితా-విష్ణు సహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 43. | పురాణపండ లలితాసహస్రనామస్తోత్రమ్(మినీ) | 10-00 |
| 44. | పురాణపండ విష్ణు సహస్రనామస్తోత్రమ్ | 10-00 |
| 45. | పురాణపండ ఆదిత్య హృదయం | 10-00 |
| 46. | మంత్రపుష్పం (మినీ) | 10-00 |
| 47. | శివానందలహరి-సౌందర్యలహరి | 36-00 |
| 48. | కుజదోషం | 10-00 |
| 49. | కాలసర్ప దోషం | 10-00 |
| 50. | మీ అప్పులు తీరాలా? | 10-00 |
| 51. | దృష్టిదోషాలు నివారణ | 10-00 |
| 52. | పంచసూక్తములు | 10-00 |
| 53. | సంధ్యావందనం | 10-00 |
| 54. | రుద్రనమకమ్-చమకమ్ | 10-00 |
| 55. | గాయత్రీమంత్రాలు | 10-00 |
| 56. | హయగ్రీవ స్తోత్రమాల | 10-00 |
| 57. | దక్షిణామూర్తి స్తోత్రమాల | 10-00 |
| 58. | ద్వాదశ జ్యోతిర్లింగాలు - పంచారామాలతో | 10-00 |
| 59. | శ్రీసూక్తం పురుష సూక్తం | 10-00 |
| 60. | నవగ్రహస్తోత్రమాల | 36-00 |
| 61. | మహాన్యాసమ్ | 36-00 |
| 62. | సుందరకాండ గానామృతం | 36-00 |
| 63. | గోమాతపూజావిధానము | 10-00 |
| 64. | ఆనందసిద్ధి - 1 శ్రీదేవీ స్తోత్రమాల | 108-00 |
| 65. | ఆనందసిద్ధి - 2 ఏ సమస్యకు ఏ స్తోత్రమ్ పారాయణచేయాలి | 108-00 |
| 66. | ఆనందసిద్ధి-3 మానసదేవీ స్తోత్రమాల | 108-00 |
| 67. | శ్రీ కాలభైరవ రక్షా కవచమ్ | 63-00 |
| 68. | అర్చన | 40-00 |
| 69. | నిత్యదేవతార్చన | 40-00 |
| 70. | సర్వదేవతా స్తోత్ర నిధి | 99-00 |
| 71. | శ్రీచక్ర నవవరణార్చన | 63-00 |
| 72. | చండీ సప్తశతి పారాయణ క్రమం | 99-00 |
| 73. | శ్రీదేవి స్తోత్ర రత్నావళి 32 దేవి స్తోత్రాలకు తాత్పర్యంతో | 99-00 |
| 74. | వనదుర్గా మంత్రానుష్ఠాన క్రమమ్ | 63-00 |
| 75. | శ్రీ కాలభైరవ వ్రతము | 63-00 |



# శ్రీ సాయి దత్త గ్రంధములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ సాయిబాబా సచ్చరిత్ర | 120-00 |
| 2. | సంపూర్ణ శ్రీ గురు చరిత్ర | 120-00 |
| 3. | శ్రీ సాయిఆరాధన-షిర్డివైభవం | 120-00 |
| 4. | శ్రీ సాయిబాబా జీవిత చరిత్ర (క్రౌన్) | 63-00 |
| 5. | శ్రీ గురుచరిత్ర (క్రౌన్) | 63-00 |
| 6. | నవనాధ చరిత్ర | 99-00 |
| 7. | శ్రీసాయిచరిత్ర (భైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 8. | శ్రీగురుచరిత్ర (భైండు) ప్రయాణపుపారాయణగ్రంథం | 63-00 |
| 9. | సత్యదత్తవ్రతం దత్తాత్రేయపూజాకల్పం,సహస్రంతో | 30-00 |
| 10. | అనఘాదేవీ వ్రతం | 30-00 |
| 11. | భక్తుల ప్రశ్నలకు బాబా జవాబులు | 30-00 |
| 12. | శ్రీ సాయిపూజాకల్పం (సహస్రంతో) | 25-00 |
| 13. | శ్రీ సాయిభజనమాల | 20-00 |
| 14. | శ్రీ సాయి భజన్స్ | 20-00 |
| 15. | శ్రీ సాయిభక్తి గీతాలు | 20-00 |
| 16. | శిరిడిహారతులు (భావంతో) | 20-00 |
| 17. | "శ్రీసాయి"కోటి | 27-00 |
| 18. | "శ్రీసాయిరామ్"కోటి | 20-00 |
| 19. | శ్రీ సాయినాథ స్తోత్రమంజరి | 10-00 |
| 20. | శ్రీ సాయివేయినామాలు | 8-00 |
| 21. | శ్రీ సాయి హారతులు (పాకెట్) | 15-00 |
| 22. | శ్రీ సాయి స్తవనమంజరి | 10-00 |
| 23. | హిందీ శ్రీ సాయి హారతులు | 15-00 |
| 24. | శని సింగణాపూర్ క్షేత్రమాహాత్మ్యం | 63-00 |
| 25. | ఇంగ్లీషు శ్రీ సాయిహారతులు | 15-00 |
| 26. | షిరిడి దర్శనం-శ్రీసాయి వైభవం | 99-00 |
| 27. | సాయిసత్యవ్రతం | 30-00 |
| 28. | సాయి అనుగ్రహమ్ | 120-00 |
| 29. | నవగురువారాల వ్రతకల్పము | 15-00 |
| 30. | శ్రీదత్తలీలామృతము | 99-00 |
| 31. | హృదయంలో సాయి | 15-00 |
| 32. | శ్రీషిరిడీసాయి లీలామృతం(శ్రీసచ్చరిత్ర) | 120-00 |
| 33. | గజాననమహరాజ్ చరిత్ర | 99-00 |



# జ్యోతిషాలు

| | |
|---|---|
| 1. 'కాలచక్రం' గంటలపంచాంగం (గార్గేయ) | 72.00 |
| 2. గ్రహభూమి పంచాంగము (గార్గేయ) | 108.00 |
| 3. ఆనందసిద్ధి పంచాంగం (వై.వి.శాస్త్రి) | 63.00 |
| 4. ములుగు వారి రాశిఫలితాలు (12రాశులువారికి) | 45.00 |
| 5. ములుగు వారి రాశిఫలితాలు విడివిడిగాఒక్కొక్కటి | 12.00 |
| 6. కాలచక్రంజ్యోతిషక్యాలండర్ | 30.00 |
| 7. గ్రహబలం క్యాలండర్ (శ్రీనివాసగార్గేయ-భక్తిటివి) | 30.00 |
| 8. శుభమస్తు (పిడపర్తి) క్యాలండర్ | 30.00 |
| 9. సాదా క్యాలండర్ | 5.00 |
| 10. పాకెట్ క్యాలండర్ | 15.00 |
| 11. తాజకనీలకంఠీయమ్ | 100-00 |
| 12. కేరళ జ్యోతిష రహస్యాలు | 180-00 |
| 13. జ్యోతిష బ్రహ్మ రహస్యాలు | 180-00 |
| 14. మానసాగరి జాతకపద్ధతి | 180-00 |
| 15. వరాహమిహిర జాతకపద్ధతి | 180-00 |
| 16. వధూవర వివాహమైత్రిద్వాదశకూటములు | 99-00 |
| 17. సింపుల్ రెమిడీస్ | 180-00 |
| 18. శంభు హోరప్రకాశిక | 250-00 |
| 19. పూర్వ పరాశరి | 100-00 |
| 20. పరాశర జ్యోతిషవిజ్ఞాన సర్వస్వం | 200-00 |
| 21. ప్రశ్న సింధు | 99-00 |
| 22. నక్షత్ర విశేష ఫలితాలు | 63-00 |
| 23. సూర్యసిద్ధాంతపంచాంగగణితంచేయడంఎలా? | 180-00 |
| 24. దృక్సిద్ధాంతపంచాంగగణితం చేయడంఎలా? | 180-00 |
| 25. ఆయుర్దాయ నిర్ణయం | 63-00 |
| 26. జాతక గణిత ప్రవేశిక | 63-00 |
| 27. జ్యోతిషమర్మబోధిని | 63-00 |
| 28. జ్యోతిష ప్రశ్నోత్తరమాల | 63-00 |
| 29. ముహూర్తం నిర్ణయించడంఎలా? | 63-00 |
| 30. జాతక మకరందం | 63-00 |
| 31. జ్యోతిష సరస్వతి | 63-00 |
| 32. మీజననకాల విశేషాలు | 63-00 |
| 33. ముహూర్త విజ్ఞాన భాస్కరం | 63-00 |
| 34. జ్యోతిష స్వయంబోధిని | 63-00 |
| 35. శుభముహూర్త శిరోమణి | 63-00 |
| 36. నక్షత్ర ఫలమంజరి | 36-00 |
| 37. పంచాంగం చూసే విధానం | 36-00 |
| 38. సర్వార్థ జ్యోతిషం | 36-00 |
| 39. ప్రాథమిక జ్యోతిషం | 36-00 |
| 40. నవరత్నములు శుభయోగములు | 36-00 |

| | |
|---|---|
| 41. శుభశకునాలు | 30-00 |
| 42. హస్తరేఖాఫలితాలు | 36-00 |
| 43. సంఖ్యల్లో భవిష్యత్ | 36-00 |
| 44. ముహూర్త దీపిక | 99-00 |
| 45. పుట్టుమచ్చలు ఫలితాలు | 30-00 |
| 46. కలలు ఫలితాలు | 30-00 |
| 47. జాతక చక్రం వేయడం ఎలా? | 36-00 |
| 48. మానసాగరి (ప్రాచీనజ్యోతిషగ్రంథం) -పుచ్చాశ్రీనివాసరావు | 250-00 |
| 49. జ్యోతిషశాస్త్ర చిట్కాలు | 120-00 |
| 50. గుప్తా శతాబ్ది పంచాంగం (1940-2050) | 999-00 |
| 51. ప్రశ్నచండేశ్వరమ్ | 63-00 |
| 52. ద్వాదశభావ ఫలచంద్రిక | 250-00 |
| 53. జ్యోతిష శతయోగరత్నావళి (నూరుయోగాలఫలితాలు) | 120-00 |
| 54. అంగసాముద్రికం | 36-00 |
| 55. హస్త సాముద్రికం | 63-00 |
| 56. లాల్ కితాబ్ | 99-00 |
| 57. శకునశాస్త్రం | 63-00 |
| 58. ఆధునికప్రశ్నశాస్త్రం | 120-00 |
| 59. పరాశరజ్యోతిష ప్రశ్నజ్యోతిషం | 180-00 |
| 60. అష్టకవర్గు (కొండపల్లి) | 63-00 |
| 61. బృహత్‌జాతకం (ప్రాచీనప్రతికిపునర్ముద్రణ) | 250-00 |
| 62. లగ్నరత్నాకరం | 63-00 |
| 63. షట్పంచాశిక | 120-00 |
| 64. 40 రోజుల్లో జ్యోతిషంనేర్చుకొనండి | 270-00 |
| 65. 40 రోజుల్లో సాముద్రికంనేర్చుకొనండి | 180-00 |
| 66. 40 రోజుల్లో సంఖ్యాశాస్త్రం | 180-00 |
| 67. 40 రోజుల్లో నక్షత్ర (నాడీ) ఫలితములు | 270-00 |
| 68. 40 రోజుల్లో వైద్యజ్యోతిషం నేర్చుకోండి | 250-00 |
| 69. మీ పుట్టినతేదీ అద్భుతరహస్యాలు (సాయిగణపతిరెడ్డి) | 270-00 |
| 70. కె.పి.జ్యోతిషం (పరిచయం) | 63-00 |
| 71. ముహూర్తచింతామణి | 99-00 |
| 72. సూర్యచంద్ర గ్రహణములు | 63-00 |
| 73. ప్రసిద్ధవ్యక్తుల జాతకాలు (వేరేకొండప్ప) | 180-00 |
| 74. అదృష్టరెమెడీస్ | 144-00 |
| 75. గ్రహసంచార ఫలనిర్ణయదీపిక | 63-00 |
| 76. జ్యోతిష రెమిడీస్ | 300-00 |
| 77. జాతకమార్తాండం పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 78. జ్యోతిషవిద్యాప్రకాశిక పాతప్రతికి యథాతథం (కొండపల్లి) | 250-00 |
| 79. నాడీజ్యోతిషం | 63-00 |
| 80. నక్షత్రపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |

| | | |
|---|---|---|
| 81. | లగ్నపారిజాతం (గోరసవీరభద్రాచార్య) | 63-00 |
| 82. | గౌతమసంహిత | 63-00 |
| 83. | హోరరత్నమాల | 63-00 |
| 84. | జాతకఫల మణిమంజరి | 200-00 |
| 85. | పుష్కర పంచాంగం (2013-14నుండి 2024-25) | 560-00 |
| 86. | దశాభుక్తిఫల నిర్ణయం | 250-00 |
| 87. | వింత జోష్యములు | 63-00 |
| 88. | షోడశవర్గులు | 200-00 |
| 89. | రవిగ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 90. | చంద్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 91. | కుజ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 92. | బుధ గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 93. | గురు గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 94. | శుక్ర గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 95. | శని గ్రహ సమస్త ప్రభావములు | 99-00 |
| 96. | రాహు & కేతు గ్రహముల సమస్త ప్రభావములు | 99-00 |
| 97. | ఆధునిక గ్రహములు-ఉపగ్రహములు సమస్త ప్రభావములు | 99-00 |
| 98. | ముహూర్తమార్తాండం | 63-00 |
| 99. | లఘుజాతకం | 63-00 |
| 100. | జాతకాలంకారము | 63-00 |
| 101. | మేషలగ్న ఫలితములు | 99-00 |
| 102. | వృషభ లగ్న ఫలితములు | 99-00 |
| 103. | మిధున లగ్న ఫలితములు | 99-00 |
| 104. | కర్కాటక లగ్న ఫలితములు | 99-00 |
| 105. | సింహలగ్న ఫలితములు | 99-00 |
| 106. | కన్యలగ్న ఫలితములు | 99-00 |
| 107. | తుల లగ్న ఫలితములు | 99-00 |
| 108. | వృశ్చిక లగ్న ఫలితములు | 99-00 |
| 109. | ధనుస్సు లగ్న ఫలితములు | 99-00 |
| 110. | మకర లగ్న ఫలితములు | 99-00 |
| 111. | కుంభ లగ్న ఫలితములు | 99-00 |
| 112. | మీన లగ్న ఫలితములు | 99-00 |
| 113. | నారద సంహిత | 200-00 |
| 114. | పంచాంగపీఠికలేఖికాగణితం | 250-00 |
| 115. | తారాబలం - చంద్రబలం (వేరే కొండప్ప) | 99-00 |
| 116. | సులభలగ్న సాధన (చిత్రాలగురుమూర్తిగుప్తా) | 200-00 |
| 117. | రాహు కేతువుల యోగము | 99-00 |
| 118. | ఛాయాగ్రహములు | 99-00 |
| 119. | జ్యోతిషవిజ్ఞాన దీపిక | 63-00 |

## బి.వి.రామన్ గారి గ్రంథములు

| | |
|---|---|
| 120. జ్యోతిష విద్యారంభం | 50-00 |
| 121 గ్రహభావ బలములు | 50-00 |
| 122. కాలచక్రదశ | 50-00 |
| 123. అనుభవ ప్రశ్నాజ్యోతిషం | 50-00 |
| 124. జ్యోతిషశాస్త్రంలో వాతావరణ భూకంపాలు | 50-00 |
| 125. పురోగామి జాతకం | 50-00 |
| 126. భావార్ధరత్నాకరం | 75-00 |
| 127. భారతీయజ్యోతిష సర్వస్వం | 75-00 |
| 128. అష్టకవర్గ పద్ధతిః | 75-00 |
| 129. జ్యోతిషశాస్త్రంలో సందేహాలు,సమాధానాలు | 75-00 |
| 130. ప్రశ్నతంత్ర | 75-00 |
| 131. ముహూర్తం | 75-00 |
| 132. విశిష్ట జాతకములు | 125-00 |
| 133. భారతీయఫలితజ్యోతిషం | 125-00 |
| 134. 300 ముఖ్యమైన యోగములు | 125-00 |
| 135. జాతకంపరిశీలించడంఎలా ? | 300-00 |

## రాష్ట్రపతి అవార్డుగ్రహీత, మహామహోపాధ్యాయ, వాచస్పతి శ్రీ మధురకృష్ణమూర్తిగారి గ్రంథములు

| | |
|---|---|
| 136. బృహత్పరాశరహోరాశాస్త్రము-1 | 200-00 |
| 137. బృహత్పరాశరహోరాశాస్త్రము-2 | 200-00 |
| 138. బృహత్పరాశరహోరాశాస్త్రము-3 | 200-00 |
| 139. బృహత్పరాశరహోరాశాస్త్రము-4 | 200-00 |
| 140. భావార్ధరత్నాకరము | 100-00 |
| 141. ముహూర్త చింతామణి | 100-00 |
| 142. ముహుర్త చింతామణి-పార్టు2 | 200-00 |
| 143. స్వప్న శాస్త్రము | 36-00 |
| 144. శతయోగమంజరి | 50-00 |
| 145. వ్రతనిర్ణయకల్పవల్లి | 250-00 |
| 146. దైవజ్ఞవల్లభం | 75-00 |
| 147. వసంతరాజశకునమ్ (బృహత్‌శకునశాస్త్రం) | 250-00 |
| 148. వాస్తుశాస్త్రవివేకము-1 | 100-00 |
| 149. వాస్తుశాస్త్రవివేకము-2 | 200-00 |
| 150. వాస్తుశాస్త్రవివేకము-3 | 100-00 |
| 151. వాస్తుశాస్త్రవివేకము-4 | 200-00 |
| 152. అనుభవసులభవాస్తు - 1 | 50-00 |
| 153. అనుభవసులభవాస్తు - 2 | 100-00 |
| 154. పంచాంగ వివేకము | 99-00 |
| 155. వశిష్ఠ సంహిత | 360-00 |
| 156. పంచపక్షి శాస్త్రం (కేస్‌బైండ్) | 200-00 |



# వాస్తులు

| | | |
|---|---|---|
| 1. | 40 రోజుల్లో "వాస్తువిద్య" నేర్చుకొనండి | 180-00 |
| 2. | వాస్తుశాస్త్ర రహస్యములు | 200-00 |
| 3. | వాస్తునుబట్టి మీ ఇల్లు | 63-00 |
| 4. | మీరూ మీ వాస్తు | 63-00 |
| 5. | గృహవాస్తు చిట్కాలు | 63-00 |
| 6. | వాస్తు పూజ | 63-00 |
| 7. | వాస్తు సూత్రములు | 63-00 |
| 8. | వాస్తుశాస్త్ర రహస్యాలు | 63-00 |
| 9. | గృహవాస్తు వర్గులు | 99-00 |
| 10. | విశ్వకర్మవాస్తు శాస్త్రరీత్యా మీ ఇంటి ప్లానులు | 63-00 |
| 11. | విశ్వకర్మ వాస్తుశాస్త్రరీత్యా మీఇండ్లఆయములు | 99-00 |
| 12. | విశ్వకర్మ వాస్తు శాస్త్రం(చిత్రాలగురుమూర్తిగుప్తా) | 180-00 |
| 13. | ఆధునిక గృహవాస్తు | 99-00 |
| 14. | శుభవాస్తు | 270-00 |
| 15. | వాస్తుయంత్ర రత్నావళి | 120-00 |
| 16. | వాస్తుశాస్త్రం | 120-00 |
| 17. | హౌస్ ప్లాన్స్ | 63-00 |
| 18. | గృహనిర్మాణ వాస్తు | 63-00 |
| 19. | వాస్తు రెమెడీస్ | 63-00 |
| 20. | గృహవాస్తు దర్పణం | 63-00 |
| 21. | జ్యోతిష-గృహవాస్తుచంద్రిక | 200-00 |
| 22. | వాస్తురత్నాకరం (కొండపల్లి) | 63-00 |
| 23. | వాస్తుశిరోమణి ,, | 120-00 |
| 24. | వాస్తుసంగ్రహమ్ ,, | 63-00 |
| 25. | పంచవాస్తు పారిజాతం ,, | 120-00 |
| 26. | వాస్తుడిండిమమ్ ,, | 63-00 |
| 27. | వాస్తుదుందిభి ,, | 120-00 |
| 28. | విశ్వకర్మవాస్తుప్రకాశిక (కేస్‌బైండ్) | 250-00 |
| 29. | కృష్ణవాస్తుశాస్త్రము | 63-00 |
| 30. | జలవాస్తు,శల్యవాస్తు (దంతూరిపండరీనాథ్) | 99-00 |
| 31. | మయవాస్తు (గోరసవీరభద్రాచార్య) | 120-00 |
| 32. | వాస్తు జ్యోతి | 63-00 |
| 33. | మన ఇల్లు-మనవాస్తు | 99-00 |
| 34. | వాస్తవ వాస్తుపూజావిధానము | 108-00 |
| 35. | వాస్తు దర్పణం | 120-00 |



# మంత్రశాస్త్రాలు



| | | |
|---|---|---|
| 1. | మంత్రసాధన | 63-00 |
| 2. | తంత్రజాలం | 63-00 |
| 3. | మంత్రశక్తి | 63-00 |
| 4. | దత్తాత్రేయ తంత్రవిద్య | 63-00 |
| 5. | దత్తాత్రేయ మూలికాతంత్రమ్ | 63-00 |
| 6. | తాంత్రిక పంచాంగం | 63-00 |
| 7. | యక్షిణీ తంత్రం | 63-00 |
| 8. | మంత్రానుష్ఠాన చంద్రిక | 63-00 |
| 9. | సర్వదేవతా మంత్రకవచములు | 63-00 |
| 10. | మంత్రాక్షరాలరహస్యం (బీజాక్షరనిఘంటువు) | 63-00 |
| 11. | సర్వదేవతా మంత్రరత్నావళి | 63-00 |
| 12. | సదాచార దీపిక | 63-00 |
| 13. | యోగినీ-వామకేశ్వరతంత్రం | 63-00 |
| 14. | ప్రపంచసారతంత్రం | 63-00 |
| 15. | బదనిక తంత్రమ్ | 63-00 |
| 16. | ఉచ్ఛిష్ట గణపతి తంత్రమ్ | 63-00 |
| 17. | గుప్త సాధన తంత్రం | 63-00 |
| 18. | గంధర్వ తంత్రమ్ | 63-00 |
| 19. | సౌందర్యలహరి (మంత్రయంత్రరత్నావళి) | 63-00 |
| 20. | యంత్ర మంత్ర తంత్ర | 63-00 |
| 21. | పాశుపత తంత్రం | 99-00 |
| 22. | పంచదశ మహాఖడ్గ తంత్రం | 99-00 |
| 23. | రుద్రాష్టాధ్యాయః | 99-00 |
| 24. | మంత్రసిద్ధి | 120-00 |
| 25. | పరశురామతంత్రమ్ | 108-00 |
| 26. | శ్రీలలితావిలోమ పంచదశీ | 108-00 |
| 27. | శ్రీ గురు తంత్రం | 108-00 |
| 28. | గాయత్రీ తంత్రమ్ | 108-00 |
| 29. | మహాశక్తి మంత్ర తంత్ర రహస్యాలు | 150-00 |
| 30. | శ్రీ దుర్గ తంత్రమ్ | 200-00 |
| 31. | మహామృత్యుంజయఅమృతపాశుపతమ్ | 200-00 |
| 32. | సర్ప (నాగ)తంత్రం | 250-00 |
| 33. | హవన తంత్రం | 250-00 |
| 34. | షోడశనిత్యతంత్రం | 250-00 |
| 35. | శాక్తేయతంత్రం | 250-00 |

| | |
|---|---|
| 36. రుద్రయామళతంత్రం | 250-00 |
| 37. లక్ష్మీప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 38. హిరణ్యశూలినీ తంత్రమ్ | 250-00 |
| 39. మాయాప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 40. శ్రీ విశ్వరూప ప్రత్యంగిరా తంత్రమ్ | 250-00 |
| 41. స్వర్ణాకర్షణభైరవతంత్రం | 250-00 |
| 42. కాశీవిశాలాక్షి తంత్రం | 250-00 |
| 43. శాంతితంత్రమ్ | 250-00 |
| 44. యంత్రసిద్ధి | 360-00 |
| 45. శ్రీ లక్ష్మీ తంత్రమ్ | 360-00 |
| 46. మంత్రమహోదధి (స్త్రీదేవతాకల్పమ్) | 360-00 |
| 47. మంత్రమహోదధి (పురుషదేవతాకల్పమ్) | 360-00 |
| 48. మంత్రశాస్త్రం (గ్రంథము) | 360-00 |
| 49. ప్రత్యంగిరాకృత్యాతంత్రం | 360-00 |
| 50. కామధేనువు తంత్రం | 360-00 |
| 51. శూలినీదుర్గాతంత్రం | 360-00 |
| 52. శ్రీవిద్య రహస్యం | 290-00 |
| 53. కులార్ణవ తంత్రమ్ | 150-00 |
| 54. ఆచార్య సిద్ధ నాగార్జునతంత్రం (ఒరిజనల్) | 390-00 |
| 55. సిద్ధమూలిక రహస్యం (మంత్ర,యంత్రసహితం) | 63-00 |



## గ్రంథాలు - ఆరాధనలు

| | |
|---|---|
| 1. భగవద్గీత శ్లోక తాత్పర్య సహితం | 54-00 |
| 2. భగవద్గీత (వచనం) | 99-00 |
| 3. భగవద్గీత శ్లోకతాత్పర్యం-కేసుబైండింగ్ | 72-00 |
| 2. గణేశ ఆరాధన 1 | 99-00 |
| 3. గణేశోపాసన 2 | 99-00 |
| 4. నవగ్రహవైభవం | 99-00 |
| 5. నవగ్రహ రెమెడీస్ | 99-00 |
| 6. నవగ్రహ వేదం | 99-00 |
| 7. శనిగ్రహారాధన | 99-00 |
| 8. ఆదిత్యారాధన | 99-00 |
| 9. సుబ్రహ్మణ్యారాధన | 99-00 |
| 10. శ్రీ శివ ఆరాధన | 99-00 |
| 11. లక్ష్మీ ఆరాధన | 99-00 |
| 12. హనుమదారాధన | 99-00 |
| 13. లలితారాధన | 99-00 |

| | | |
|---|---|---|
| 14. | శ్రీ చక్రారాధన | 99-00 |
| 15. | గాయత్రీ ఆరాధన | 99-00 |
| 16. | వీరభద్రారాధన | 99-00 |
| 17. | కుజగ్రహారాధన | 99-00 |
| 18. | భైరవారాధన | 99-00 |
| 19. | దైవారాధన | 99-00 |
| 20. | గీతారాధన (భగవద్గీత శ్లోకతాత్పర్యసహిత) | 99-00 |
| 21. | శ్రీవేంకటేశ్వరాధన | 99-00 |
| 22. | హయగ్రీవారాధన | 99-00 |
| 23. | లక్ష్మీనరసింహారాధన | 99-00 |
| 24. | శ్రీ బాలాత్రిపురసుందరీ స్తోత్ర కదంబం | 99-00 |
| 25. | దేవీ లీలామృతం | 99-00 |
| 26. | పురాణపండ సుందరకాండ వచనం | 99-00 |
| 27. | పురాణపండ రామాయణం | 99-00 |
| 28. | పురాణపండ భారతం | 99-00 |
| 29. | పురాణపండ భాగవతం | 99-00 |
| 30. | (సూరి) వాల్మీకి రామాయణం | 99-00 |
| 31. | కాలసర్ప యోగం | 99-00 |
| 32. | నిత్య జీవితములో రుద్రాక్షలు | 99-00 |
| 33. | నిత్య జీవితములో నవరత్నాలు | 99-00 |
| 34. | వేదసూక్తములు | 99-00 |
| 35. | వేమన పద్యసారామృతం | 99-00 |
| 36. | పండగలు పర్వదినాలు | 99-00 |
| 37. | సూక్తిరత్నాలు | 99-00 |
| 38. | హనుమచ్చరిత్ర | 99-00 |
| 39. | నవగ్రహ దర్శనమ్ | 99-00 |
| 40. | నిత్యజీవితంలో నవగ్రహాలు | 99-00 |
| 41. | సాలగ్రామములు | 99-00 |
| 42. | గురుశుక్ర ప్రభావము చంద్రకళానాడీ | 99-00 |
| 43. | శనిగ్రహరెమిడీస్ | 99-00 |
| 44. | జాతకసుధాసారము-జాతకమోక్షప్రదాయిని | 99-00 |
| 45. | వివాహజ్యోతిషమంజరి-మ్యారేజ్‌మ్యాచింగ్‌గైడ్ (సాయిగణపతిరెడ్డి) | 99-00 |
| 46. | మీపుట్టినతేదీనిబట్టి మీజీవితరహస్యాలు (న్యూమరాలజీ లైఫ్‌గైడ్) ,, | 99-00 |
| 47. | మీఅదృష్టానికి (పేరు) నేమ్‌కరక్షన్ ,, | 99-00 |
| 48. | న్యూమరాలజీ రెమిడీస్ | 99-00 |
| 49. | మూకపంచశతీ | 99-00 |
| 50. | శ్రీరామకర్ణామృతం | 99-00 |
| 51. | రహస్యకుక్కుటశాస్త్రం | 300-00 |
| 52. | ఉపాసన విధానం | 99-00 |
| 53. | పంచమవేదం మహాభారతం | 99-00 |

| | |
|---|---|
| 54. దేవుళ్ళు డాట్ కామ్ | 99-00 |
| 55. గణపతిభాష్యం | 99-00 |
| 56. యజుర్వేద ఉపనయనవివాహప్రయోగమంజరి | 99-00 |
| 57. నవయోగులు | 99-00 |
| 58. ఆంధ్రప్రదేశ్‌లోనిదర్శించవలసిన ప్రముఖదర్గాలు | 99-00 |
| 59. సకలదేవతాఅష్టోత్తరాలు(పెద్దది)-(180అష్టోత్తరశతనామావళులతో) | 99-00 |
| 60. సకలదేవతా అష్టోత్తరశతనామావళులు (కేస్‌బైండింగ్) | 216-00 |
| 61. సకలదేవతా సహస్రనామములు | 99-00 |
| 62. ఆధ్యాత్మిక సూక్తి నిధి | 99-00 |
| 63. బ్రాహ్మణులు గోత్రాలు,ప్రవరలు | 99-00 |
| 64. సర్వదేవతాస్వరూపుడు శ్రీ వేంకటేశ్వరుడు | 99-00 |
| 65. శ్రీ లక్ష్మీసన్నిధి | 99-00 |
| 66. శ్రీలక్ష్మీగణపతి హోమకల్పం | 99-00 |
| 67. మార్షల్‌ఆర్ట్స్ (కరాటే,కుంగ్‌ఫూనేర్చుకోండి) | 99-00 |
| 68. మ్యాజిక్‌గైడ్ | 99-00 |
| 69. చదరంగం | 99-00 |
| 70. పంచముఖ హనుమత్ వైభవం | 63-00 |
| 71. గరుడపురాణం | 40-00 |
| 72. మాఘపురాణం | 36-00 |
| 73. శివపురాణం | 36-00 |
| 74. వైశాఖపురాణం | 36-00 |
| 75. కార్తీక పురాణం | 36-00 |
| 76. కార్తీక పురాణం (చిన్నది) | 25-00 |
| 77. సర్వకార్యసిద్ధికి రామాయణపారాయణ | 63-00 |
| 78. పెద్దబాలశిక్ష | 50-00 |
| 79. గాయత్రీ మహిమ | 36-00 |
| 80. వృక్షదేవతలు | 63-00 |
| 81. యాజుష స్మార్త సంస్కార చంద్రిక | 200-00 |
| 82. సనాతనవైదిక బ్రాహ్మణస్మార్తాగమకల్పమ్ | 150-00 |
| 83. చతుర్వేదములు | 120-00 |
| 84. నవగ్రహారాధన | 120-00 |
| 85. తాళపత్ర సమాహార గోపురం | 120-00 |
| 86. మనుధర్మ శాస్త్రం (వచనంలో...) (కేస్‌బైండు) | 250-00 |
| 87. మానవధర్మములు | 120-00 |
| 88. వేదమంత్ర సంహిత | 120-00 |
| 89. సహస్రలింగార్చన | 120-00 |
| 90. శ్రీ శివగీత | 120-00 |
| 91. ద్వాదశఉపనిషత్తులు | 120-00 |
| 92. పురాణపండవారి సౌందర్యలహరి (కేస్‌బైండ్) | 250-00 |
| (శ్లోకతాత్పర్యసహిత విపులవ్యాఖ్యతో) సాదా | 120-00 |
| 93. బృహత్ శివ స్తోత్ర రత్నాకరము | 200-00 |
| 94. బృహత్ దేవీ స్తోత్రరత్నాకరము | 200-00 |
| 95. బృహత్ విష్ణు స్తోత్రరత్నాకరము | 200-00 |

| | |
|---|---|
| 96. కేదారనాథ్ బదరీనాథ్ యాత్రాగైడు | 63-00 |
| 97. దక్షిణావృత శంఖములు | 63-00 |
| 98. 108 దివ్యదేశాల విష్ణుక్షేత్రదర్శని | 36-00 |
| 99. ధర్మసింధువు(కేస్‌బైండింగ్) | 270-00 |
| 100. భారతీయ శైవక్షేత్రయాత్రాదర్శిని | 99-00 |
| 101. చిలుకూరి బాలాజీచరిత్ర | 36-00 |
| 102. భగవత్‌స్తుతి | 63-00 |
| 103. సూర్యోపాసన | 36-00 |
| 104. కాశీఖండం | 250-00 |
| 105. దేవీభాగవతం | 360-00 |
| 106. శ్రీ ఆంజనేయం | 216-00 |
| 107. ధర్మసందేహాలు | 216-00 |
| 108. ఆధ్యాత్మిక దైవిక వస్తువులు | 250-00 |
| 109. రామాయణం | 600-00 |
| 110. పోతన భాగవతం | 900-00 |
| 111. శివమంత్రములు | 63-00 |



## వైద్య గ్రంథాలు

| | |
|---|---|
| 1. ఆహారం ఆరోగ్యం | 36-00 |
| 2. మూలికావైద్య చిట్కాలు | 36-00 |
| 3. ఆయుర్వేద వైద్య చిట్కాలు | 30-00 |
| 4. గృహవైద్య రహస్యాలు | 36-00 |
| 5. గృహవైద్యసారం | 36-00 |
| 6. హోమియోవైద్యం (ద్వాదశలవణచికిత్స) | 63-00 |
| 7. ప్రకృతివైద్యం | 36-00 |
| 8. ఆహారం-వైద్యం | 99-00 |
| 9. సంపూర్ణ ఆయుర్వేద-చిట్కా వైద్యం | 99-00 |
| 10. ఆయుర్వేదమ్ | 36-00 |
| 11. ఆయుర్వేద మూలికావైద్యదీపిక | 99-00 |
| 12. దుంపకూరలు, ఆకుకూరలు, కాయగూరలు (వాడకం - ఉపయోగాలు) | 99-00 |
| 13. ఏకమూలికావైద్యం | 99-00 |
| 14. అష్టాంగ హృదయం (4భాగాలు) | 1200-00 |
| 15. రహస్యసిద్ధయోగవైద్యసారమ్ | 99-00 |
| 16. ప్రాథమిక హోమియోవైద్యం | 99-00 |
| 17. ఒబెసిటీ | 99-00 |
| 18. హెల్త్‌గైడ్ | 99-00 |
| 19. ఆయుర్వేదం-జీవనవేదం | 99-00 |
| 20. ఫుడ్‌థెరపి | 63-00 |

| | | |
|---|---|---|
| 21. | న్యాచురల్‌థెరపి | 99-00 |
| 22. | సంపూర్ణఆరోగ్యానికి 20సి॥ | 63-00 |
| 23. | కీళ్ళనొప్పులు మీ సమస్యలైతే... | 99-00 |
| 24. | యోగామంత్ర | 63-00 |
| 25. | యోగా మండే టు సండే | 63-00 |
| 26. | హెర్బల్ మెడిసిన్-హెల్త్‌టుడే | 99-00 |
| 27. | హెల్త్‌ఫైల్ | 108-00 |
| 28. | వస్తుగుణపాఠం | 250-00 |
| 29. | రసాయన వాజీకరణ తంత్రం | 150-00 |
| 30. | వస్తుగుణ మకరందం | 400-00 |
| 31. | నాటువైద్యం -(కేస్‌బైండ్) | 360-00 |
| 32. | నాటువైద్యం (చిన్నది) | 99-00 |
| 33. | ప్రాణాయామము-యోగ | 63-00 |



## అయ్యప్ప - భవానీ దీక్షాలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ అయ్యప్ప లీలామృతం | 30-00 |
| 2. | శ్రీ అయ్యప్ప భజనపాటలు | 63-00 |
| 3. | శ్రీ అయ్యప్ప పూజాకల్పం | 20-00 |
| 4. | శ్రీ అయ్యప్ప భక్తి గీతాలు | 20-00 |
| 5. | హారతిగైకొనుమా | 40-00 |
| 6. | శ్రీ అయ్యప్ప దీక్ష F | 10-00 |
| 7. | శ్రీ అయ్యప్ప భజనమాల F | 10-00 |
| 8. | శ్రీ అయ్యప్ప నిత్యపూజ P | 10-00 |
| 9. | శ్రీ అయ్యప్ప నిత్యనియమావళి P | 10-00 |
| 10. | భవానీదీక్ష (శ్రీ భవానీ లీలామృతం) | 36-00 |
| 11. | దేవీలీలామృతం | 99-00 |
| 12. | శ్రీ దేవీ పూజాకల్పం | 20-00 |
| 13. | దేవీ భక్తిగీతాలు | 20-00 |
| 14. | భవానీదీక్ష P | 10-00 |
| 15. | దేవీ భక్తిమాల F | 10-00 |
| 16. | శ్రీ అయ్యప్ప భజనావళి | 120-00 |
| 17. | అయ్యప్పపూజావిధి (జేసుదాసుసాంగ్స్‌తో) | 24-00 |



# భజనలు - కీర్తనలు

| | | |
|---|---|---|
| 1. | అన్నమయ్య కీర్తనలు | 20-00 |
| 2. | శ్రీరామదాసు కీర్తనలు | 20-00 |
| 3. | సర్వదేవతా మంగళహారతులు | 20-00 |
| 4. | వసుంధర మంగళ హారతులు | 25-00 |
| 5. | సౌభాగ్య దేవతా మంగళహారతులు | 36-00 |
| 6. | సర్వదేవతా భజనలు | 36-00 |
| 7. | చిట్టి పొట్టి పాటలు | 10-00 |
| 8. | జాతీయ గీతాలు | 10-00 |
| 9. | దేశభక్తి గీతాలు | 36-00 |
| 10. | పండుగలు-పుణ్యక్షేత్రాలు భక్తిగీతాలు | 36-00 |
| 11. | గొబ్బిళ్ళపాటలు,లాలిపాటలు,కోలాటపాటలు | 36-00 |
| 12. | అన్నమయ్య సంకీర్తనలు | 99-00 |
| 13. | పెళ్ళిపాటలు-స్త్రీలపాటలు | 36-00 |
| 14. | భక్తానంద భజనకీర్తనలు(ఓల్డ్‌సినీస్టైల్) | 36-00 |
| 15. | సర్వదేవతాభక్తిమణిమాల | 36-00 |
| 16. | బతుకమ్మ ఉయ్యాల పాటలు | 36-00 |
| 17. | అన్నమయ్య సంకీర్తనానిధి(1000కీర్తనలు) | 270-00 |



# హిట్ సాంగ్స్



| | | |
|---|---|---|
| 1. | ఘంటసాల భక్తిగీతాలు-భగవద్గీత | 36-00 |
| 2. | ఎస్.పి.బాలు భక్తిగీతాలు | 36-00 |
| 3. | ఘంటసాల సుమధురగీతాలు | 99-00 |
| 4. | పి. సుశీల సుమధురగీతాలు | 99-00 |
| 5. | ఎస్.పి. బాలు సుమధురగీతాలు | 99-00 |
| 6. | ఎస్.జానకి సుమధురగీతాలు | 99-00 |
| 7. | వేటూరి సుందరరామమూర్తిహిట్స్ | 99-00 |
| 8. | సర్వదేవతా సినీభక్తిగీతాలు | 99-00 |



# స్త్రీలకు ఉపయుక్త పుస్తకములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీకాంతామణి వంటలు (వెజ్) | 63-00 |
| 2. | శ్రీకాంతామణి వంటలు (నాన్‌వెజ్) | 63-00 |
| 3. | శాకాహార వంటలు | 30-00 |
| 4. | మాంసాహారవంటలు | 30-00 |
| 5. | చిట్టిచిట్కాలు | 30-00 |
| 6. | అందానికి చిట్కాలు | 30-00 |
| 7. | పిల్లల పేర్లు (పెద్దది) | 30-00 |
| 8. | పిల్లల పేర్లు (చిన్నది) | 10-00 |
| 9. | లేటెస్ట్ ఎంబ్రాయిడరీ శారీబోర్డర్స్ | 36-00 |
| 10. | లేటెస్ట్ ఎంబ్రాయిడరీ డిజైన్స్ | 36-00 |
| 11. | చిన్నారులకు చిరుతిళ్ళు | 30-00 |
| 12. | పసందైన ఫాస్ట్‌ఫుడ్ వంటలు | 30-00 |
| 13. | పలావ్‌లు, ఫ్రైడ్ రైస్‌లు, వెరైటీరైస్‌లు | 30-00 |
| 14. | వేపుళ్ళు-ఇగుర్లు | 30-00 |
| 15. | బ్రేక్‌ఫాస్ట్ వంటలు | 30-00 |
| 16. | పండుగలలో చేసుకొనే పిండివంటలు | 30-00 |
| 17. | మైక్రోవేవెన్ వంటలు | 99-00 |
| 18. | సర్వదేవతాభక్తిమాల | 36-00 |
| 19. | పిల్లలపేర్లు (బాబు) | 36-00 |
| 20. | పిల్లలపేర్లు (పాప) | 36-00 |
| 21. | మోడ్రన్ మెహంది (గోరింటాకు డిజైన్స్) | 36-00 |
| 22. | మోడ్రన్ పిల్లలపేర్లు | 99-00 |
| 23. | నోరూరించే నాన్‌వెజ్‌వంటలు | 99-00 |
| 24. | మోడ్రన్ టైలరింగ్ (లేడీస్ & జంట్స్) | 99-00 |

# వివిధ రకములు

| | |
|---|---|
| ఎందరోమహానుభావులు | 270-00 |
| యోగాసనాలు | 36-00 |
| సూర్యనమస్కారములు | 36-00 |
| పొడుపు కథలు (చిన్నవి) | 10-00 |

| | |
|---|---|
| హిందీ-తెలుగు-స్వబోధిని | 20-00 |
| ఇంగ్లీషు-తెలుగు-స్వబోధిని | 20-00 |
| జనరల్ నాలెడ్జ్ | 20-00 |
| నూరు ఎక్కాలు | 10-00 |
| 1-100 టేబుల్ బుక్ | 10-00 |
| 1-100 టేబుల్‌బుక్ (క్రౌన్‌సైజు) | 4-50 |
| శ్రీరామకోటి | 27-00 |
| శ్రీశివకోటి | 27-00 |
| మేజిక్ | 30-00 |
| అంకెలతో గారడీ | 30-00 |
| హృదయస్పందన (కవితలు) | 30-00 |
| వాత్స్యయన కామసూత్రాలు | 36-00 |
| ఎ.పి.టూరిస్ట్ గైడు | 36-00 |
| ఇంద్రజాల రహస్యాలు | 30-00 |
| మహేంద్రజాల రహస్యాలు | 30-00 |
| శరీరభాష (బాడీ లాంగ్వేజ్) | 99-00 |
| క్రియాయోగం | 36-00 |
| ఆనందంగా జీవిద్దాం | 99-00 |
| హరిశ్చంద్ర నాటకం | 50-00 |
| వాత్సాయనకామసూత్రాలు | 99-00 |
| పంచసాయకం | 99-00 |
| రతిరహస్యాలు | 99-00 |
| అనంగరంగం (కంభంపాటి స్వయంప్రకాష్) | 99-00 |
| శృంగారకేళి (కంభంపాటి స్వయంప్రకాష్) | 99-00 |
| గాయత్రీవిజ్ఞాన్ | 99-00 |
| చింతామణి (నాటకం) | 50-00 |
| బాలనాగమ్మ | 50-00 |
| కాళహస్తి స్త్రీల వ్రతకథలు | 36-00 |
| కాళహస్తి రామాంజనేయ యుద్ధం(బదిరెడ్డి) | 50-00 |
| కాళహస్తి గోవింద నామాల భగవద్గీత | 36-00 |
| కాళహస్తి గృహవాస్తు చింతామణి | 99-00 |
| కాళహస్తి గృహవాస్తు మర్మాలు (బైండు) | 63-00 |
| రామరాయవాస్తుశాస్త్రం(ముద్రగడరామారావు) | 90-00 |
| ఎం.ఎస్.ఆర్.హనుమాన్‌చాలీసా | 10-00 |
| ఎం.ఎస్.ఆర్.సుందరకాండ | 80-00 |
| బ్రహ్మంగారిజీవితచరిత్ర (జవంగుల) | 125-00 |
| శ్రీ ఆదిశంకరాచార్య దివ్యచరితామృతం | 40-00 |
| కాశీరామేశ్వర మజిలీ కథలు | 63-00 |
| శ్రీలలితాసహస్రనామము(భాస్కరభాష్యం) | 600-00 |

